# Sri Sitarama Jyotishyalayam

# జ్యోతిష్య భాగము – 1

రచించిన వారు : బ్రహ్మశ్రీ శిష్ట్లా నాగేశ్వర శర్మ (ప్రకాష్) గారు, జంషెడ్ పూర్
మొబైల్ నెం. : +919470566998 / +917903591993
తయారు చేసినవారు : ఎ.వి.కె. శ్రీనివాసరావు, భిలాయి (ఛ.ఘ)

## నక్షత్రములు- రాశుల సంబంధము

అశ్వని- 4 పాదములు,  భరణి- 4పాదముల
కృత్తిక- 1వ పాదం= మేషము

కృత్తిక-2,3,4 పాదములు-రోహిణి-4పాదములు
మృగశిర-1,2,పాదములు=వృషభము

వృగశిర-3,4,పాదములు-ఆర్ద్ర-4,పాదములు
పునర్వసు-1,2,3 పాదములు మిధునము.

పునర్వసు-4వ పాదము-పుష్యమి-4 పాదములు ఆశ్రేష-4 పాదములు = **కర్కాటకము**.

మఘ-4,పాదములు-పుబ్బ-4,పాదములుఉత్తర-1వ,పాదము = **సింహం.**

ఉత్తర-2,3,4,పాదములు-హస్త-4,పాదములు చిత్త-1,2 పాదములు = **కన్య.**

చిత్త-3,4,పాదములు-స్వాతి-4పాదములు విశాఖ-1,2,3, పాదములు = **తుల.**

విశాఖ-4వ పాదము-అనూరాధ-4,పాదములు  జేష్ఠ-4,పాదములు = **వృశ్చికము.**

మూల-4,పాదములు-పూర్వాషాఢ-4,పాదములు ఉత్తరాషాఢా-1వ పాదము = **ధనస్సు.**

ఉత్తరాషాఢ-2,3,4,పాదములు-శవణం-,పాదములు ధనిష్ట-1,2,పాదములు = **మకరము.**

ధనిష్ట-3,4, పాదములు-శతభిషం-4పాదములు-పూర్వాభాద్ర-1,2,3,పాదములు = **కుంభం**.

పూర్వాభాద్ర-4,వ పాదము-ఉత్తరాభాద్ర-4 ,పాదములు-రేవతి-4, పాదములు = **మీనము.**

ఈ ఇరువది యేడు నక్షత్రములును ఒక్కొక్క నక్షత్ర ప్రమాణములను 4భాగములుగా విభజించిరి. ఆభాగములే నక్షత్ర పాదములను బడుచున్నవి.ఈవిదముగా 27,నక్షతములకు 27✖4=108 పాదములు వచ్చును. ఈ 108 పాదములను 12 భాగములుగా విభజించి ద్వాదశ రాశులుగాఏర్పర్చిరి. ఈ విధముగా ఖగోళము. యందలి నక్షత్రముల స్థింతి మేషాదిద్వాదశరాసులకు పంచగాఅందే 108 పాదములను 12 రాశులకు విభజించగా ఒక్కొక్కరాశికి 9నక్షత్రపాదము లేర్పడును. అనగా అశ్వని 4,పాదమపలు, రాశికి 9నక్షత్రపాదము లేర్పడును. అనగా అశ్వని 4పాదములు,భరణి 4 పాదములు కృత్తికలోమొదటి పాదము కలిపి మేషరాశి యగును.ఈ ప్రకారముగా అశ్వనీలగాయితు 27 రాశి నక్షత్రములను ఒక్కొక్క రాశికి 9పాదములు చొప్పున మేషములగాయితు ద్వాదశరాశులందుపంచబడ్డవి.

జ్యోతిష్యుడు జాతకాన్ని పరిశీలించి జాతకుడికి చెప్పేటప్పుడు మంచిని ఎక్కువగా చెడుని తక్కువగా చెప్పాలి. జాతకంలో గ్రహాలు చెడు చేస్తాయి అని అనుకున్నప్పుడు మంచిని కూడా చేస్తాయి. మంచి వాటి గురించి ఆలోచింపజేయాలి. చెడ్డవాటిని వర్ణించకూడదు. ఎదుటి వ్యక్తిని మెప్పించటం కోసం లేనివి చెప్పటం తగదు. అది మంచి ఐన చెడు ఐన సరే.

గ్రహాలలో పాజిటివ్, నెగిటివ్ అనే రెండు కారకత్వాలు ఉంటాయి. రెండిటి సమన్వయంతో జాతక పరిశీలన చేయాలి. ఉదా:- రవి –సమస్యా పరిష్కారం (పాజిటివ్), కోపం (నెగిటివ్). కాబట్టి కోపంతో ఉంటే సమస్య పరిష్కారం కాదు. మనం చేసే క్రియల వలన పాపాన్ని బలపరచటం, పుణ్యాన్ని బలహీనపరచటం జరుగుతుంది.

ఒక శిశువుకి మరొక శిశువుకి జన్మించటానికి మధ్య తేడా 1 నిమిషం 36 సెకండ్లు. పుట్టిన వెంటనే శిశువు ఏడ్చినప్పుడు గ్రహాలు శరీరంలోకి ప్రవేశిస్తాయి. మానససాగరి ప్రకారం శిశువు జన్మించిన ఆరవ రోజు మనిషికి బ్రహ్మ వ్రాత వ్రాస్తాడు.

మనం మరణించిన తరువాత కూడా బ్రతికి ఉండాలంటే భాగ్యస్థానం బాగుండాలి. భాగ్యస్థానం బాగుంటే పూర్వ పుణ్య బలం వలన మరణించిన తరువాత కూడా మన పేరు ప్రఖ్యాతల వలన అందరి గుండెల్లో బ్రతికే ఉంటాం.

రత్నధారణ చేసేటప్పుడు అభివృద్ధి కోసం కుడిచేతికి ధరించాలి. ఆరోగ్యం కోసం ఎడమచేతికి ధరించాలి. బ్రతికున్న వ్యక్తి జాతకములనే సాధారణంగా పరిశీలించవలసి ఉంటుంది. అయితే దైవజ్ఞుని జ్ఞానములు పరిశీలించే నిమిత్తం చనిపోయిన వ్యక్తి జాతకమును ఇచ్చినప్పుడు ఆ దైవజ్ఞుడు నిమిత్తములను అనుసరించి విచారణ చేయవలసి ఉంటుంది. ఇష్టదేవతా సిద్ధి చేత దీనిని గ్రహించవచ్చు. ఆయుర్ధాయంను విచారణ చేయటం ద్వారా దీనిని నిర్ణయించవచ్చును. అందుకే జాతకంలో యోగాలు మిగతా అంశాలు చెప్పేటప్పుడు ఆయుర్ధాయాన్ని పరిశీలించాలి. కానీ ఆయుర్ధాయ విషయాలను జాతకునికి తెలియజేయరాదు.

భావచక్రము వలన పుట్టిన దగ్గర నుండి చావు మధ్యలో ఉండే అంశాలను తెలుసుకోవచ్చును. భావ మధ్యమంలో గ్రహం ఉంటే ఆ భావ ఫలితాలను ఆ గ్రహం సంపూర్ణంగా ఇస్తుంది. భావ అంత్యంలో గ్రహం ఉంటే ముందు భావ ఫలితాలను కూడా ఇస్తుంది.

దానం చేసిన వస్తువును తీసుకున్న వ్యక్తి స్వీకరించి అనుభవించాలి, ఆనందించాలి, మెచ్చుకోవాలి. అప్పుడే మనం చేసిన దానికి దాన ఫలితం లభిస్తుంది. అలాకాని పక్షంలో మనస్సులోనే దానం చేసినట్లుగా భావించాలి.

కుజుడు వ్యయస్థానంలో ఉంటే చేసిన అప్పులు తీర్చటానికి మరలా మానవ జన్మ ఎత్తుతారు. అందుకే కుజుడు వ్యయంలో ఉన్నప్పుడు ఋణానుబంధాలను తీర్చుకోవాలని అంటారు.
ఇంద్ర, వరుణ, యములు అతీంద్రియ శక్తులకు ప్రతీక. అమావాస్య నాడు పుట్టినవాడు కష్టపడకుండానే (శ్రమించకుండా)డబ్బు సంపాదిస్తాడు.

బొగ్గుతో ఎంత అప్పు ఉన్నదో నేలపైన రాసి కుజునికి ఋణ విమోచన అంగారక స్తోత్రం 40 రోజులు చేసి ఎడమకాలితో తుడిపి వేసిన అప్పు తొందరగా తీరును.

ఇష్టదేవతోపాసన సాధనచేస్తే పశ్న శాస్త్రం సిద్ధిస్తుంది. జాతకచక్రంలో అన్నీ భావాలు భాగలేకపోయిన పంచమభావం, చంద్రుడు భాగుంటే తెలివైన ఆలోచనతో జీవితాన్ని నెగ్గుకురాగలాడు. జాతకంలో అన్నీ లగ్నాలకి తృతీయాధిపతి శత్రువే అవుతాడు. ఒక్క కర్కాటక లగ్నానికి మాత్రమే తృతీయాధిపతి మిత్రుడు అవుతాడు. అందుకే కర్కాటక లగ్నం వాళ్ళు తప్ప మిగతా వాళ్ళు చెప్పిన మాట వినరు.

కర్కాటక లగ్నం వాళ్ళకి, సింహ లగ్నం వాళ్ళకు వైవాహిక జీవితం మిగతా గ్రహ పరిస్థితులు అనుకూలంగా లేకుంటే ఇబ్బందులు ఎదుర్కొంటారు. కర్కాటక లగ్నం వాళ్ళకు సప్తమాధిపతి, అష్టమాధిపతి ఒక్కరే కావటం, సింహలగ్నానికి షష్ఠాధిపతి, సప్తమాధిపతి ఒక్కరే కావటం వలన ఇబ్బందులు ఉంటాయి. సప్తమాధిపతికి షష్ఠం, అష్టమం ఆదిపత్యం రాకూడదు.

ఊర్ధ్వముఖ త్రికోణంలో (కోణాలలో) మంచి గ్రహాలు ఉంటే మంచిది. అధోముఖ త్రికోణంలో (కేంద్రంలో) పాప గ్రహాలు ఉంటే మంచిది. జాతకచక్రంలో ఆప్యాయత, ఆదుకునే వ్యక్తిని (తల్లైన, తండ్రైన) చతుర్ధంలో చూడాలి. అదుపు చేసేవారిని, అధికారం చూపించేవారిని (తల్లైన, తండ్రైన) దశమంలో చూడాలి. తల్లిదండ్రులు ఎంత చెడ్డవారైనా తప్పనిసరిగా ఆధరించాలి. ఎవరిని బాధ పెట్టిన తల్లిని మాత్రం బాధ పెట్టరాదు.
ఆధ్యాత్మిక వారసత్వాన్ని నవమభావంలో చూడాలి. లౌకిక జ్ఞాన వారసత్వాన్ని దశమ స్థానంలో చూడాలి. స్నేహం పెంచుకోవాలి అనుకుంటే అతడు (భర్త) లేకుండా ఆమెతో (స్నేహితుడి భార్య) మాట్లాడరాదు.

## జ్యోతిషంలోని నక్షత్రాల ఆకృతులు అధిదేవతలు

మొత్తం 27 నక్షత్రాలు  అశ్వని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర, పునర్వసు, పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ (పూర్వఫల్గుణి), ఉత్తర (ఉత్తరఫల్గుణి), హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనూరాధ, జ్యేష్ట, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి.  ప్రతిరాశిలో మూడు నక్షత్రాలు తొమ్మిది పాదాల చొప్పున మన పూర్వీకులు విభజన చేయడం జరిగింది.

**మేషరాశిలో నక్షత్రాలు :-**

 మేషంలో అశ్వని ,భరణి,కృత్తిక మొదటి పాదం ఉంటుంది. అశ్వినికి అశ్విని దేవతలు, భరణికి యముడు, కృత్తికకు అగ్నిదేవుడు అధిదేవతలు. దీనికి లాటిన్ ఎరిస్ అని పేరు. అశ్విని చుక్కలు గుర్రపు తల ఆకారాన్ని కలిగి ఉంటుంది. వేదంలో అశ్వని నక్షత్ర  ప్రస్థావన అలాగే మంత్రం మనకు కనభడుతుంది. భరణి పోయిరాళ్ళుగా మూడుచుక్కల సమూహం. కృత్తిక నక్షత్రం మంగళికత్తి ఆకారంలో ఉంటుంది.

**వృషభరాశిలో నక్షత్రాలు :-**

రాశులలో రెండవది వృషభం. ఈ రాశిలో క్రుత్తికలోని మూడుపాదాలు, రోహిణి , మృగశిరలోని రెండు పాదాలు వస్తాయి. కృత్తికనక్షత్రం అరుచుక్కల సమూహం. రోహిణి నక్షత్రంలో అయిదు చుక్కలు ఉంటవి. రోహిణి నక్షత్రం ఉదయించేటప్పుడు A అక్షరం మాదిరిగా అస్తమించేటప్పుడు V అక్షరం మాదిరిగా కనభడుతుంది. రోహిణికి ఆధిదైవం ప్రజాపతి. రోహిణి నక్షత్రాన్ని ప్రజాపతికి కూమర్తెగా మన పురాణాలు తెలియజేసాయి.  మృగశిరానక్షత్రం మృగం ఆకారంలో ఉంటుంది. దీనికి అధిదేవత సోముడు. కొంతమంది యజ్ఞోపవీతాన్ని ధరించిన పురుషుడు అని మరికొందరు మృగరూపం దాల్చిన ప్రజాపతి అన్నారు.

**మిథునరాశిలో నక్షత్రాలు :-**

మిథునరాశిని గమనిస్తే మృగశిర చివరి రెండు పాదాలు,ఆరుద్రనక్షత్రంలోని 4 పాదాలు అలాగే పునర్వసు నక్షత్రంలోని మూడుపాదాలు ఉంటాయి. ఆరుద్రనక్షత్రం దీనినే ఆ నక్షత్రం యొక్క రంగును బట్టి పగడపుచుక్క అన్నారు. ఆరుద్రకు రుద్రుడు అధిపతి యోరోపియన్లు ఈ నక్షత్రాన్ని బీటల్ జూ అంటారు. తెలుగుప్రాంతంలో గొల్లకావిడి చుక్కలు అంటారు. జ్యోతిషం ప్రకారం రుద్రుడే శివుడు దానిపైన ఉన్న నక్షత్రం మృగశిర అంటే చంద్రుడు అంటే శివునిపైన ఉన్న తలలో ఉన్న చంద్రుడుగా అభివర్ణిస్తారు. కాస్టర్ ,పోలాక్స్ ,పోస్వాన్ చుక్కలు కలిపి చేపలాగ పునర్వసు నక్షత్రం ఉంటుంది. అధితిదేవి ఈ నక్షత్రానికి అధిదేవత. అదితికి ఉన్న ప్రాదాన్యం ఏమిటంటే యజ్ఞాయాగాది క్రతువులు అడితితో ఆరంభం అయ్యి అధితితోనే  పూర్తిఅవుతాయి.

**కర్కాటక రాశిలో నక్షత్రాలు :-**

కార్కాటక రాశిలో  నాలగవ రాశి. ఈ రాశిలో పునర్వసు నాల్గవ పాదం,పుష్యమి నాలుగు పాదాలు,ఆశ్లేష నాలుగు పాదాలు ఉంటాయి. ఇందులో పుష్యమి నక్షత్రానికి సిద్ధయ,అంగీరస,పోట్లపువ్వుచుక్క అని పేర్లు ఉన్నాయి. తదుపరి ఆశ్లేష నక్షత్రం ఈ నక్షత్రం సర్పదేవత అయిన ఆశ్రేశ అని అసిలెరని. సర్పపుచుక్క అని అంటారు. అశ్లేషతో వినాయకుడు ఉదయించుట

వలన అతను నాగయగ్నిపవితుడు అయినాడు. హైడ్రాగుంపులోని డెల్టా, ఎప్సిలాన్, ఈట ,ల రో జీటా గుర్తులు కలవి ఆశ్లేషచుక్కలు. కర్కాటకం అంటే ఎండ్రకాయ అని అర్థం.

**సింహరాశిలో నక్షత్రాలు :-**

సింహరాశిని గమనిస్తే మఘ 4 పాదాలు , పుబ్బ 4 పాదాలు, ఉత్తర 1 పాదం కలిసి ఉన్నాయి. మఘనక్షత్రానికి పల్లకీబొంగు చుక్క ,పితురుల చుక్క అనే పేర్లు ఉన్నాయి. ఈ నక్షత్రానికి పితృదేవతలే ఆధిదైవాలు. పల్లకి ఆకారంలో అయిదు చుక్కలు ఈ నక్షత్రంలో ఉన్నాయి. మహాకాంతి నక్షత్రం అయిన ఆల్ఫా చుక్క యోగాతార మఘ . పూర్వంలో దక్షిణాయనం మఘకార్తితో ఆరంభం అయ్యేది కావున పితృదేవతలు అధిదేవతలు అయ్యారని తైత్తరీయసంహిత చెబుతున్నది. తదుపరి పుబ్బ దీనినే పూర్వఫల్గుణి అంటారు. దీనికే పోద్దురిక్క అనే పేరు కలదు. దీనికి అధిదేవత భగుడు. మేషంను ఉదయించే సమయం గా చెబితే సింహం అస్తమించే సమయం.

**కన్యారాశి నక్షత్రాలు :-**

ఉత్తర మిగిలిన మూడు పాదాలు,హస్తాలోని నాలుగు పాదాలు,చిత్తా నక్షత్రంలోని రెండు పదాలు కాన్యారాశి. కన్యఆకారంలో ఈ రాశినక్షత్రాల సమ్మేళనం ఉంటుంది కావున ఆ పేరు వచ్చింది. కన్యారాశికి రోదశి,అరమతి అను పేర్లు కలవు. కాన్యరాశిలో spica స్టార్ ఉంటుంది. హస్తానక్షత్రానికి కైనాటిరెక్క అని పేరు. హస్తా నక్షత్రం అరచేతి రూపం. అయిదు చుక్కలు హస్త అని తెలుస్తుంది. హస్తకు ఆదిదైవం సూర్యుడు. చిత్తానక్షత్రం ముత్తెపుసవతు రిక్క అని పేరు. చిత్తాకు విశ్వకర్మ అదిదైవం.

**తులారాశిలో నక్షత్రాలు :-**

చిత్తానక్షత్రంలోని రెండు పాదాలు, స్వాతి నక్షత్రం, విశాఖనక్షత్రంలోని మూడు పాదాలు ఈ రాశికి చెందుతాయి. స్వాతి నక్షత్రాన్ని కరువలి రిక్క అని పిలుస్తారు. స్వాతికి నిస్ట్య అనే పేరు కూడా ఉంది. దీనికి ఆదిదైవం వాయువు. భూతేశమండలంలోని తోలి అవడం చేత ఆల్ఫాభుటీస్ అని ఆర్క్ చూరస్ అనీ పేర్లు కలవు. ఏకాదశ రుద్ర రూపాల్లో ఈ భూతేషుడు ఒకరు. విశాఖనక్షత్రం కు జోడుపేల్పుల రిక్క అని పేరు. ఆకారాన్ని బట్టి చేటరిక్క, కమ్మరిసారే అని పేరులు ఉన్నాయి. విశాఖకు ఇంద్రాగ్నులు అధిదైవం. కుమ్మరిసారె రూపంలో గుండ్రంగా అమరిఉన్న అయిదు చుక్కలు ఉండటం వలన విశాఖ కులలచక్ర పంచ అన్నారు. ఖగోళ తులారాశిలో తక్కెడ రూపంలో ఉన్నరూపమే విశాఖ. సూర్యుడు తులరాశిలోకి ప్రవేశించినపుడు సమస్త లక్షణాలు సరిసమానం అవుతాయి. సూర్యుడు తులారాశిలో ఉన్నపుడు పగలు, రాత్రి సమానంగా ఉంటాయి.

**వృశ్చికరాశిలోని నక్షత్రాలు :-**

విశాఖ చివరిపాదం, అనురాధ నక్షత్రం, జ్యేష్ట నక్షత్రం లోని నాలుగు పాదాలు. అనురాధ కు చెలిమిచుక్క అని , తోరనపు చుక్క అని పేరు. అనురాధకు అధిదైవం మిత్రుడు. వృశ్చికరాశిలోని బీటా , డెల్టా , పై సంజ్ఞలు గల చుక్కలు అనురాధ నక్షత్రపు చుక్కలు. చత్రకార త్రయం మూడుచుక్కలు గొడుగు ఆకృతిలో కనభడుతాయి. జ్యేష్ట నక్షత్రంనకు తాతిరిక్క అనే పేరు కలదు. జ్యేష్ట వృశ్చికరాశిలో తోలి చుక్క. దీన్నే ఆల్ ఫా స్కార్పియో అని అంటారు. ఆల్ ఫా , సిగ్మా , టౌ గుర్తులున్న నక్షత్రాలు కలిసి జ్యేష్ట అనే గుంపు ఏర్పడింది. అధిదైవం ఇంద్రుడు. ఈ నక్షత్రం సూర్యుని కన్నా తొమ్మిది కోట్ల రెట్లు పెద్దది.

**ధనుస్సు రాశిలోని నక్షత్రాలు : -**

ధనుస్సురాశిలో మూలానక్షత్రంలో 4 పాదాలు, పూర్వాషాడ 4 పాదాలు, ఉత్తరాషాడ మొదటిపాదం ఉంటాయి. మూలానక్షత్రానికి నోకురిక్క అని పేరు. ఈ నక్షత్రానికి నిర్రుతి , పితురులు అధిపతులు. తేలుకొండి ఆకారంలోని 11 నక్షత్రాల సమూహం మూల అవుతుంది. వృశ్చికపు తోకలోని చిట్టచివరి అయిదు చుక్కలు కలిసి మూల అవుతుంది. పూర్వషాడకు నీటిచుక్క అనే పేరు. జలదేవత ఈ నక్షత్రానికి అధిపతి. డెల్టా , ఎప్సిలాన్ చుక్కలు కలిసి పూర్వాషాడ అవుతుంది.

**మకరరాశిలోని నక్షత్రాలు :-**

ఉత్తరాషాడలోని చివరి మూడుపాదాలు , శ్రవణంలోని 4 పాదాలు, ధనిష్ట నక్షత్రంలోని మొదటి రెండు పాదాలు ఈ రాశికి చెందుతాయి. వేదకాలంలో ఈ రాశిని అజం అనేవారు. మకరం పైన మేక క్రిందిభాగంలో చేపఆకారంలో ఉంటుంది. ఉత్తరాషాడ నక్షత్రం వంపులతో కనబడుతుంది. అందుకే దీనిని ఏచకంకటి చుక్క అంటారు. కీత.ఒమ్రికాన్ గుర్తులు గల చుక్కలు ఉత్తరాషాడ. దీనికి అధిదేవతలు విశ్వదేవతలు. శ్రవణం నకు శ్రోనా అని అశ్వథామ అని పేరు కలవు. దీని ఆదిదైవం విష్నుభగవానుడు. ఈ నక్షత్రాన్ని కరిపేలుపు చుక్క అంటారు. మూడు నక్షత్రాల గుంపు కలది. గడుద గుంపులోని అల్ఫాచుక్క.

**కుంభరాశి నక్షత్రాలు : -**

ధనిష్టా నక్షత్రంలోని 3,4 పాదాలు , శతభిషం లోని నాలుగు పాదాలు , పూర్వాభాద్రలోని మొదటి మూడు పాదాలు కలిపితే కుంభరాశి అవుతుంది. ధనిష్టకు మద్దెలరూపు చుక్క అనే పేరు కలదు. ఈ నక్షత్రం అధిదేవత అష్టవసువులు. శీర్షత్రయ మంటే మూడుతారలతో కూడి ఉంటుంది. ధనిష్ట గోలాకానికి చెందిన నక్షత్రం. శతభిషకు నీతిరెక్క అని పేరు. అధిదైవం వరణుడు. శతంతారః అంటే వంద తారల గుంపు అని అర్థం.

**మీనరాశిలో నక్షత్రాలు :-**

పూర్వాభాద్ర నక్షత్రంలోని నాల్గవ పాదం , ఉత్తరాభాద్ర పాదాలు, రేవతి లోని నాలుగు పాదాలు ఈ రాశికి చెందుతాయి. పూర్వభాద్రకు కాళ్ళరిక్క అనిపేరు కలదు. ఉత్తారభద్రకు ముక్కంటిరిక్క అనిపేరు. రేవతికి కడచిక్క అనిపేరు. రేవతికి కొసరిక్క, మీనరూపు చుక్క అనిపేరు. పూర్వాభాద్రకు అజైకపాదుడు, ఉత్తరాభాద్రకు అహిర్భద్యుడు , రేవతికి పూషుడు అధిదైవాలు. మీనరాశిలోని రెండు చేపలు ఉంటాయి

## నక్షత్రాలు ప్రయోజనాలు

**దృవ నక్షత్రాలు:-** ఉత్తర, ఉత్తరాషాడ, ఉత్తరాభాద్ర, రోహిణి నక్షత్రాలు. స్థిరమైన పనులు చేయుటకు పనికి వస్తాయి. నూతన కార్యములు కాకుండా ఉన్నవి. ఉదా:- గృహ నిర్మాణం, ఉద్యోగం.

**చర నక్షత్రాలు:-** స్వాతి, పునర్వసు, శ్రవణం, ధనిష్ఠ, శతభిష నక్షత్రాలు చర నక్షత్రాలు. ఈ నక్షత్రాలలో యాత్రలు, విద్యా, వాహన చోదనం, గృహారంభం, నూతన కార్యములు.

**ఉగ్ర నక్షత్రాలు:-** భరణి, మఖ, పుబ్బ, పూర్వాషాడ, పూర్వాభాద్ర నక్షత్రాలు ఉగ్ర నక్షత్రాలు. ఈ నక్షత్రాలు శుభ కార్యాలకు మంచిది కాదు. ఆయుధాల ప్రయోగానికి, మందులు తయారు చేయటానికి పనికి వస్తాయి.

**మిశ్రమ నక్షత్రాలు:-** విశాఖ, కృత్తిక నక్షత్రాలు. ఇవి మిశ్రమ నక్షత్రాలు. ఇవి యజ్ఞ క్రియలు, దేవాలయ కార్యములు చేయుటకు మంచివి. నిప్పు, బాంబులు, పేలుడు పదార్థాలు చేయుటకు మంచిది.

**క్షిప్ర నక్షత్రాలు:-** అశ్విని, హస్త, పుష్యమి, అభిజిత్ నక్షత్రాలు క్షిప్ర నక్షత్రాలు. విద్యారంభానికి, అమ్మకాలకి, ఔషదాలు తీసుకొనుటకు, పనిలో సత్ఫలితాలు ఇచ్చే వాటికి, వెంటనే జరిగే పనులకు ఈ నక్షత్రాలు మంచివి.

**మృదు నక్షత్రాలు:-** మృగశిర, రేవతి, చిత్త, అనురాధ నక్షత్రాలు మృదునక్షత్రాలు. ఇవి లలిత కళలు,స్నేహం చేయటానికి, నూతన వస్త్రాలు కొనటానికి, దరించటానికి, దౌత్య కార్యాలకు, వివాహములకు మంచిది.

**దారుణ నక్షత్రాలు:-** మూల, జ్యేష్ఠ, ఆశ్లేష, ఆరుద్ర నక్షత్రాలు దారుణ నక్షత్రాలు. ఈ నక్షత్రాలు హింస, దొంగతనం, ఆందోళన కార్యములకు, ఎదుటివారిని జయించటానికి, తాంత్రిక విద్యలకు, చేతబడులు చేయటానికి, ఇతరులను లొంగతీసు కోవటానికి పనికి వస్తాయి.

**ఊర్ధ్వముఖ నక్షత్రాలు:-** ఆరుద్ర, పుష్యమి, శ్రవణం, ధనిష్ఠ, శతభిషం, రోహిణి, ఉత్తరాత్రయ నక్షత్రాలు వీటి దృష్టి ఆకాశం వైపుకు ఉంటుంది. కాబట్టి రాచ కార్యాలకు, వ్యవహారాలకు, గృహప్రవేశాలకు, దనుర్విద్యలకు, విమాన చోదనం, గృహ నిర్మాణం, విత్తనాలు చల్లుటకు, దేవాలయ నిర్మాణాలు, రాకెట్ ప్రయోగాలకు మంచివి.

**అధోముఖ నక్షత్రాలు:-** మూల, ఆశ్లేష, విశాఖ, కృత్తిక, పుబ్బ, పూర్వాషాడ, పూర్వాబాద్ర నక్షత్రాలు వీటి దృష్టి క్రింది వైపుకు ఉంటుంది. బావులు త్రవ్వటానికి, నాగలి పట్టుటకు, పునాదులు త్రవ్వటానికి పనికి వస్తాయి.

**తిర్యఙ్ముఖ నక్షత్రాలు:-** మృగశిర, రేవతి, చిత్త, అనురాధ, హస్త, స్వాతి, పునర్వసు, అశ్విని, జ్యేష్ఠ ఇవి రోడ్లు వేయుటకు, ముందుకు సాగే వాటికి,ద్వజ స్తంభ ప్రతిష్ఠ,విగ్రహ ప్రతిష్ఠలకు మంచిది.

**పంచక నక్షత్రాలు:-** ధనిష్ఠ, శతభిషం, పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర, రేవతి, శుభకార్యాలకు మంచిది. క్రూర కర్మలు ప్రారంభించుటకు, సాహస కార్యములకు ఈ నక్షత్రాలు పనికి రావు.

**గండ నక్షత్రాలు :-** ఆశ్లేష, మఖ, జ్యేష్ఠ, మూల, రేవతి, అశ్వని నక్షత్రాలలో శిశువు జన్మించిన విశేషంగా గ్రహ శాంతులు చేయవలెను.

***అశ్వని నక్షత్రం - గుణగణాలు, ఫలితాలు***

అశ్విని నక్షత్ర అధిదేవత అశ్వినీ దేవతలు. సూర్య భగవానుడి భార్య సజ్ఞాదేవికి, సూర్య భవానుడికి పుట్టిన వారు అశ్వినీ దేవతలు. ప్రాథమికంగా అశ్వనీ నక్షత్రం సన్య నక్షత్రంగా పురుష లక్షణంతో క్షిపుతారగా గుర్తింపు పొందింది. దీనికి అధిపతి కేతువు. ఈ నక్షత్రంలో జన్మించినవారు శివుడి అర్చన చేసి వైడూర్యాన్ని ధరించవలసి ఉంటుంది.

అశ్వని నాలుగు పాదాలు మేష రాశిలోనే ఉన్నాయి

మొదటి పాదం

అశ్వినీ నక్షత్రం మొదటి పాదంలో పుట్టిన వారి నక్షత్ర అధిపతిగా కుజుడు. వీరు శక్తికి మించిన సామర్థ్యం ప్రదర్శించాలని ప్రయత్నిస్తారు. అస్థిర చిత్తంతో ఉంటారు. కొన్ని సార్లు రాజీ ధోరణితో ఉండాల్సి ఉంటుంది. అనవసర విషయాలపై దృష్టి పెట్టడం జరుగుతుంది. పనికి రాని ఆలోచనలు బుర్రను తొలుస్తుంటాయి. సమాజంలో మంచి గుర్తింపు, గౌరవం పొందాలన్న తాపత్రయపడతారు.

గ్రహ దశలు

పుట్టినప్పటి నుంచి కేతు మహర్దశ ఏడు సంవత్సరాలు, శుక్ర మహర్దశ ఇరవై సంవత్సరాలు, రవి మహర్దశ ఆరు సంవత్సరాలు, చంద్ర మహర్దశ పది సంవత్సరాలు, కుజ మహర్దశ ఏడు సంవత్సరాలు అనుభవిస్తారు.

రెండో పాదం

అశ్వినీ నక్షత్రం రెండవ పాదంలో పుట్టిన వారి నక్షత్ర అధిపతిగా కుజుడు నవాంశ రాశ్యధిపతి శుక్రుడు. దీంతో వీరు పట్టుదల గల వారు. ఎదుటి వ్యక్తుల స్వభావాన్ని త్వరగా గ్రహిస్తారు. చాలా విషయాల్లో చురుగ్గా వ్యవహరిస్తారు. తలపెట్టిన కార్యాన్ని సాధించడంలో అనుకూలమైన మార్గాన్ని ఎంచుకుంటారు. ప్రాజ్ఞులు, దక్షులుగా గుర్తింపు పొందుతారు. మంచి ఆత్మవిశ్వాసం గలవారై ఉంటారు.

గ్రహ దశలు

వీరు పుట్టినప్పటి నుంచి కేతు దశ ఐదు సంవత్సరాల మూడు నెలలు. శుక్ర మహర్దశ ఇరవై సంవత్సరాలు. రవి మహర్దశ ఆరు సంవత్సరాలు. చంద్ర మహర్దశ పది సంవత్సరాలు, కుజ మహర్దశ ఏడు సంవత్సరాలు అనుభవిస్తారు.

మూడో పాదం

అశ్వని మూడో పాదంలో జన్మించిన వారికి ప్రాచీన శాస్త్రాలను ఇష్టపడుతారు. ముఖ్యంగా జ్యోతిష్య, తర్క శాస్త్రాలపై మక్కువ ఉంటుంది. చక్కటి సలహాలు ఇవ్వడంలో నేర్పరులు. అయితే ఆ సలహాల వల్ల తమకు తాము ఎలాంటి లాభాన్ని పొందలేరు. నలుగురిలో కలిసేందుకు ఇష్టపడరు.

గ్రహ దశలు

పుట్టినప్పటి నుంచి కేతు మహర్దశ మూడున్నర సంవత్సరాలు, శుక్ర మహర్దశ ఇరవై సంవత్సరాలు. రవి మహర్దశ ఆరు సంవత్సరాలు. చంద్ర మహర్దశ పది సంవత్సరాలు, కుజ మహర్దశ ఏడు సంవత్సరాలు, రాహు దశ 18 సంవత్సరాలు అనుభవిస్తారు.

నాలుగో పాదం

అశ్వని నాలుగో పాదంలో జన్మించిన వారు కళాత్మకంగాను, అలంకార ప్రియులుగానూ, నిదానమైన ప్రవర్తనతోనూ ఉంటారు. గాఢమైన ఆలోచనలు కలిగి మేధావులుగా గుర్తింపు పొందుతారు. నిరంతరం కొత్త విషయాలపై ఆసక్తి కనబరుస్తారు. లక్ష్యసాధనలో వెనుకడుగు వేయరు. అయితే వీరికి ఫలితం సునాయాసంగా అందదు. శ్రమ పడాల్సిన అవసరం ఉంటుంది.

గ్రహ దశలు

పుట్టినప్పటి నుంచి కేతు మహర్దశ 7 సంవత్సరాల 9 నెలలు, శుక్ర మహర్దశ ఇరవై సంవత్సరాలు. రవి మహర్దశ ఆరు సంవత్సరాలు. చంద్ర మహర్దశ 10 సంవత్సరాలు, కుజ మహర్దశ ఏడు సంవత్సరాలు, రాహు దశ 18 సంవత్సరాలు అనుభవిస్తారు.

**ఈ నక్షత్ర జాతకుల గుణగణాలు**

అశ్వినీ నక్షత్ర జాతకులు అశ్వం వలే ఉరిమే ఉత్సాహంతో కనిపిస్తారు. తెలివి, జ్ఞాపకశక్తి, సామర్థ్యం, చైతన్యవంతమైన, విశాలమైన కళ్ళు కలిగివుంటారు. పోటీ మనస్తత్వం ఉంటుంది. క్రీడల యందు ఆసక్తి అధికం. అశ్వినీదేవతలు శసత్రచికిత్స, ఆయుర్వేద వైద్యములో నిపుణులు కనుక అశ్వినీ నక్షత్రజాతకులు ఆయుర్వేదం వంటి వైద్యం యందు ఆసక్తితో ఉంటారు. వీరు ఉద్రేకపూరిత మనస్తత్వం కలిగి ఉంటారు. రాశ్యాధిపతి కుజుడు కనుక వీరికి ధైర్యసాహసాలు అధికం. ఎటువంటి పరిస్థితులనైనా మనోస్థైర్యంతో ఎదుర్కొనగలరు. ఓర్పు, నేర్పు, సామర్థ్యంతో కార్యనిర్వహణ పూర్తి చేస్తారు. తనను నమ్ముకున్న వారిని ఆపదలో కాపాడుట వీరి విశిష్ట గుణం.

ఈ నక్షత్ర జాతకులు వీరు ఇతరుల సలహాలు స్వీకరించినా.. చివరకు తమకు నచ్చినట్లు నిర్ణయం తీసుకుంటారు. ఈ నక్షత్రము దేవగణ నక్షత్రము కనుక న్యాయం, ధర్మము పాటిస్తారు. వీరికి నాయకత్వ లక్షణాలు అధికం కనుక రాజకీయనాయకులుగా, అధికారులుగా చక్కగా రాణిస్తారు. నక్షత్రాధిపతి కేతువు కనుక వైరాగ్యం, దైవోపాసనా, భక్తి వంటి లక్షణాలు వీరికి అధికం. కొంత అలసత్వము కలిగి ఉండడము సహజమే. తాము అనుకున్నది సాధించాలన్న పట్టుదల ఉంటుంది. ఇతరులకు కింద పనిచేయడం వీరికి నచ్చదు. అన్ని విషయాలలో ఆధిపత్య మనస్తత్వం కలిగి ఉంటారు.

క్రీడాకారులుగా, వైద్యులుగా, సైనికపరమైన ఉద్యోగులుగా చక్కగా రాణించగలరు. ఇవి అశ్వినీ నక్షత్రజాతకుల సాధారణ గుణాలు. అయితే జాతకచక్రం, లగ్నం, పుట్టిన సమయం, మాసముల వలన గుణగణాలలో కొద్దికొద్దిగా మార్పులు ఉంటాయి. ఈ నక్షత్ర జాతకులకు 45 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా జరుగుతుంది. బాల్యము నుంచి యుక్తవయస్కులు అయ్యే వరకు వీరికి జీవితం వీరికి ఆనందదాయకముగా జరుగుతుంది. అశ్వనీ నక్షత్ర జాతకులకు కృత్తిక, మృగశిర, పునర్వసు, చిత్త, అనూరాధన, జ్యేష్ట నక్షత్రములు ఏ కార్యమునకు పనికి రావని శాస్త్రం చెబుతోంది.!

***భరణి నక్షత్రం - గుణగణాలు, ఫలితాలు***

మేష రాశిలోని రెండో నక్షత్రమే 'భరణి నక్షత్రము'. ఈ నక్షత్రం స్త్రీ లక్షణం కలిగి ఉన్నప్పటికీ ఉగ్రతారగా గుర్తింపు పొందింది. శుక్రుడు అధిపతిగా ఉన్నాడు కనుక వీరు రజో గుణంతో భాసిల్లుతారు. ఈ నక్షత్రము 4 పాదాలూ మేష రాశిలోనే ఉన్నాయి.

భరణి మొదటి పాదము

శారీరకంగా శక్తివంతులై ఉంటారు. ఇదే సమయంలో పౌరుషవంతులుగానూ.. శత్రువులను లొంగదీసుకుంటారు. పంతాలు పట్టింపులు సాధించుకునేందుకు ప్రయత్నిస్తారు. పెద్దలపట్ల గౌరవం, ఆచార వ్యవహారాలపైనా, సాంస్కృతి సాంప్రదాయలపైన, నీతి నియమాలపైనా శ్రద్ధాసక్తులు కలిగి మెసులుకుంటారు. అయితే తమలోని లోపాలు బయటపడకుండా నిరంతరం జాగ్రత్త పడుతుంటారు.

మొదటి పాదములో గ్రహ దశలు

జన్మించినప్పటి నుంచి శుక్ర మహాదశ ఇరవై సంవత్సరాలు, రవి మహాదశ ఆరు సంవత్సరాలు, చంద్ర మహర్దశ పది సంవత్సరాలు, కుజ దశ ఏడు సంవత్సరాలు, రాహు దశ 18 సంవత్సరాలు ఉంటుంది.

భరణి రెండో పాదము

భరణి రెండో పాదం యందు పంతం, పట్టుదల అధికంగా కనిపిస్తుంది. అనుకొన్నది పూర్తి చేయాలన్న పట్టుదల ఉంటుంది. అయితే ఈ క్రమంలో పలు సందర్భాల్లో మొండితనంతో వ్యవహరిస్తారు. సంపన్న జీవితాన్ని గడపడంతోపాటు మంచిచెడులపై అవగాహన, నీతి నియమాలపై శ్రద్ధ కలిగి ఉంటారు. కీర్తివంతులై చిరస్థాయిని పొందుతారు. ఆలోచనా ధోరణి అధికం. అనవసర విషయాలపై ఆసక్తితో శోధిస్తారు.

రెండో పాదములో గ్రహ దశలు

జన్మించినప్పటి నుంచి శుక్ర మహాదశ 20 సంవత్సరాల పాటు ఉంటుంది. రవి మహాదశ ఆరు సంవత్సరాలు, చంద్ర మహర్దశ 10 సంవత్సరాలు, కుజ దశ ఏడు సంవత్సరాలు, రాహు దశ 18 సంవత్సరాలు ఉంటుంది.

భరణి మూడో పాదము

భరణి మూడో పాదంలో జన్మించినవారు తమ ప్రమేయం ఏమీ లేకుండానే ఫలితం కోరుకుంటారు. వాస్తవానికి-ఆలోచనకు మధ్య పొంతన ఉండదు. అయితే తెలివితేటల విషయంలో గొప్పవారే. పొగడ్తలంటే ఇష్టపడతారు. శక్తివంతులు కావడంవల్ల ఆధిక్యాన్ని ప్రదర్శించడానికి ముందుంటారు. తొందరగా కోపం వచ్చినా నిగ్రహ శక్తిని కలిగి ఉంటారు. ఈ పాదంలో జన్మించిన వారికి దైవభక్తి ఎక్కువ.

భరణి మూడో పాదంలో గ్రహ దశలు

పుట్టినప్పటి నుంచి ముందుగా శుక్ర మహాదశ సుమారుగా పదేళ్లు. రవి మహాదశ ఆరేళ్లు, చంద్ర మహర్దశ పదేళ్లు, కుజ దశ ఏడేళ్లు, రాహు దశ పద్దెనిమిదేళ్లు ఉంటుంది.

భరణి నాలుగో పాదము

ఈ పాదంలో ఊహల ఊయాల ఊగుతారు. మరోవైపు ఆడంబరాన్ని, పటాటోపాన్ని కోరుకుంటారు. పంతంపట్టి పనులు సాధించుకోవడం వీరి లక్షణం. కష్టమైనా, నష్టమైనా తమదే పైచేయిగా ఉండాలని పట్టుబడతారు. తరచూ కోపాన్ని ప్రదర్శిస్తారు. బతిమాలించుకునే మనస్తత్త్వం. పొగడ్తలను ఆస్వాదిస్తారు. గర్వంతోనూ, కఠినత్వంతోనూ వ్యవహరిస్తారు.

భరణి నాలుగో పాదంలో గ్రహ దశలు
ఈ పాదంలో జన్మించిన వారు శుక్ర మహాదశ ఐదేళ్లు, రవి మహాదశ ఆరేళ్లు, చంద్ర మహర్దశ పదేళ్లు, కుజ దశ ఏడేళ్లు, రాహు దశ పద్దెనిమిదేళ్లు ఉంటుంది.

**భరణి నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు**

భరణి నక్షత్రాధిపతి శుక్రుడు, రాశ్యధిపతి కుడా కుజుడు. ఈ కారణంగా వీరు అందంగానూ ఆకర్షణీయంగా ఉంటారు. ఇది మానవ గణ నక్షత్రము కనుక లౌక్యం చొరవ ప్రదర్శించే గుణము కూడా ఎక్కువే. ఈ నక్షత్రంలో జన్మించినవారు వేదాంత విషయాలపట్ల, ప్రాచీన సంప్రదాయాలపట్ల ఆసక్తి కలిగి ఉంటారు.

పొగడ్తలంటే గిట్టనివారుగా పైకి కనిపించినా వాటిని బాగా ఆస్వాదిస్తారు. పరిశుభ్రతకు ప్రాధాన్యం ఇస్తారు. పరిస్థితులను తమకు అనుగుణంగా మార్చుకుంటారు. సమయాన్ని, సందర్భాన్ని బట్టి తమ అభిప్రాయాలు మార్చుకుంటుంటారు. ఎదుటి వారిని ఎంత గొప్పగా పొగుడుతారో అదే విధంగా అంతే కఠినంగా విమర్శిస్తారు. రెండు వాదనలను సమర్ధించుకుంటారు. స్వార్ధం కొంత సహజమే. తాము నమ్మిన సిద్ధాంతాలకు త్వరగా తిలోదకాలు ఇవ్వరు. వైఖరిలో మార్పు తెచ్చుకోలేకపోవడంతో అనుకున్న విధంగా అభివృద్ధి సాధించలేరు. వృద్ధాపయంలో సుఖజీవనం చేయడానికి తగిన ఏర్పాట్లు చేసుకుంటారు.

సమాజంలో పేరు, ప్రతిష్ఠ వ్యక్తిగత గౌరవము కలిగి ఉంటారు. సౌందర్యం, విలాసవంతం ఉండే విషయాల్లో ఆసక్తి చూపిస్తారు. సుగంధద్రవ్యాలు, సౌందర్య పోషణ అందు ఆసక్తి అధికం. కళత్రము వలన కలిసి వస్తుంది. విభేదాలు ఉంటాయి. అంతేకాదు వీరు వ్యూహారచన గొప్పగా ఉంటుంది. వీరు సలహాదారులుగానూ రాణిస్తారు.

ఈ నక్షత్రంలో జన్మించిన వారికి బాల్యం సుఖవంతంగా జరుగుతుంది. 28 నుంచి 32 సంవత్సరాల తరువాత కొన్ని చిక్కు సమస్యలను ఎదుర్కొంటారు. ఇందులో జన్మించిన నక్షత్రపాదాలు, జాతక చక్రంలో గ్రహస్థి వలన మార్పులు ఉంటాయి. ఫలితాలు సాధారణంగా అందరికీ సమానమైనా పుట్టిన సమయం గ్రహస్థితులు నవాంశము మొదలైన విషయాల వలన ఫలితాలలో మార్పులు ఉంటాయి. ఇక వీరు వృద్ధాప్య దశలో సుఖవంతంగానే ఉంటారు.

వీరి తమ వ్యక్తిత్వ తీరువల్ల అనుకున్న స్థాయిలో అభివృద్ధి సాధించడానికి ఆటంకాలు ఎదురవుతాయి. అందుకే నిత్యం భరణీ నక్షత్రములో పుట్టిన జాతకులు మహాలక్ష్మీదేవి పూజించడం ద్వారా శుభ ఫలితాలుంటాయి. ఇంకా సంవత్సరానికి ఒక్కసారైనా ఇంద్రాణీ హోమం చేయించడం వల్ల మంచి జరుగుతుందని శాస్త్రం చెబుతోంది.

భరణి నక్షత్రంలో పుట్టిన జాతకులకు 9 అనే సంఖ్య అనుకూలిస్తుంది. 9తో పాటు 18, 27, 36, 45, 54, 63, 72 అనే సంఖ్యలు కూడా శుభ ఫలితాలనిస్తాయి. అలాగే ఈ జాతకులకు ఎరుపు, తెలుపు రంగులు అదృష్టానిస్తాయి. ఇందులో ఎరుపు రంగు చేతి రుమాలును వాడటం ద్వారా శుభ ఫలితాలు చేకూరుతాయి.

భరణి నక్షత్ర జాతకులకు కుజ గ్రహ ప్రభావం ఉండటంతో వీరికి మంగళవారం కలిసివస్తుంది. బుధ, ఆదివారాలు సామాన్య ఫలితాలనిస్తాయి. అయితే గురువారం మాత్రం ఎలాంటి శుభకార్యాలు ప్రారంభించడం మంచిది కాదని శాస్త్రం చెబుతోంది.

*కృత్తిక నక్షత్రం - గుణగణాలు, ఫలితాలు*

కృత్తిక నక్షత్రంలో జన్మించిన వారు మంచి వర్చస్సుతో కనిపిస్తారు. వీరు అమితమైన సాహసాన్ని ప్రదర్శిస్తుంటారు. పాలనారంగంలో ఆసక్తి చూపిస్తారు. ఇతరుల వస్తువులను ఆక్రమించేందుకు ప్రయత్నిస్తుంటారు. వీరిది అహంకార స్వభావమనే చెప్పాలి. వీరిలో విచారం, సంతోషం ఒకేలా ఉండవు. తమలోని సంఘర్షణను సైతం బయటకు కనబడనీయరు. ఎదుటి వ్యక్తి కష్టాలలో ఆపేక్ష ఉంటుంది. కానీ తన గురించి కూడా ఆలోచించుకుంటారు. విచక్షణతో గుర్తెరిగి ప్రవర్తిస్తుంటారు. ఈ నక్షత్రంవారు మేడి లేక అత్తి చెట్టును పెంచుకోవాలి.

కృత్తిక నక్షత్రం మొదటి పాదంమాత్రమే మేష రాశిలోనే ఉంది. మిగిలిన మూడు పాదాలు వృషభ రాశిలో చేరాయి.

కృత్తిక మొదటి పాదము

కృత్తిక మొదటి పాదములో జన్మించిన వారు శారీరక బలంతోపాటు విద్యావంతులు. సామర్థ్యానికి మించి తలపడి చిక్కుల్లో పడుతుంటారు. అయితే ప్రయత్నపూర్వకంగా నిదానంగా ఫలితాలు సాధించడం వీరి సానుకూల లక్షణం. గంభీర స్వభావులై ప్రజాపాలనలో ఆసక్తి కలిగి ఉంటారు.

కృత్తిక మొదటి పాదములో గ్రహ దశలు

వీరికి ముందుగా రవి మహర్దశ 6 సంవత్సరాలు. అటు తర్వాత చంద్ర మహాదశ పదేళ్లు. కుజ దశ 7 ఏళ్లు, రాహు దశ 18 సంవత్సరాలు, గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ పందొమ్మిది సంవత్సరాలు ఉంటుంది.

కృత్తిక రెండో పాదము

కృత్తిక రెండో పాదములో జన్మించిన వారది గంభీర స్వభావం. సంస్కృతి, సాంప్రదాయాలకు, ఆచారాలకు దూరం. తనకుమాలిన ధర్మం మొదలు చెడ్డ బేరం అన్నది వీరి నమ్మకం. వ్యక్తిగత విషయాల గురించి ఆలోచిస్తారు. ఇతరులపట్ల ఆదరణ ఉంటుంది కానీ పరిమితమే. పంతం పట్టకుండా వ్యవహరిస్తే మేలు జరుగుతుంది.

కృత్తిక రెండో పాదములో గ్రహ దశలు

ముందుగా రవి మహర్దశ నాలుగున్నర సంవత్సరాలు. ఆ తర్వాత చంద్ర మహాదశ పదేళ్లు. కుజ దశ 7 ఏళ్లు, రాహు దశ 18 సంవత్సరాలు, గురు మహర్దశ 18 సంవత్సరాలు, శని మహర్దశ పందొమ్మిది సంవత్సరాలు ఉంటుంది.

కృత్తిక మూడో పాదము

కృత్తిక మూడో పాదములో జన్మించిన వారు శక్తివంతులుగా మెలుగుతారు. ఎల్లప్పుడు ధైర్యంతో ఉంటారు. గంభీర వదనంతో కనిపిస్తారు. అయితే, లాభ నష్టాలపై అతిగా ఆలోచిస్తుంటారు. పనికి రాని విషయాల్లోనూ అనవసరపు ఆసక్తి చూపిస్తారు. పైకి మాత్రం ఏమీ పట్టనట్టు, ఏదీ పట్టించుకోనట్టుగా నటిస్తారు. అనవసరపు లెక్కలతో వారి అభివృద్ధికి కూడా ఆటంకం కలుగుతుంది.

కృత్తిక మూడో పాదములో గ్రహ దశలు

ముందుగా రవి మహర్దశ మూడు సంవత్సరాలు, ఆ తర్వాత వరుసగా చంద్ర మహాదశ పదేళ్లు. కుజ దశ 7 ఏళ్లు, రాహు దశ 18 సంవత్సరాలు, గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు ఉంటుంది.

కృత్తిక నాలుగో పాదము

కృత్తిక మూడో పాదములో జాగ్రత్తలు అవసరం. తన తీరుతో, రకరకాల వాఖ్యలతో చిత్రమైన ప్రవర్తనను కలిగి ఉంటారు. భగవదారాధన, సత్సంగ మార్గంలో ఉండడం అవసరం. లేకుంటే వ్యసనాలకు అలవాటు పడే ప్రమాదం ఉంటుంది. అన్నీ తెలిసిన వ్యక్తి మాదిరి హడావుడి చేయడానికి ప్రయత్నిస్తారు. తమకున్న పరిజ్ఞానం పరిమితులు గ్రహించి మసలుకుంటే మంచిది.

కృత్తిక నాలుగో పాదము గ్రహ దశలు

ముందుగా రవి మహర్దశ ఒకటిన్నర సం.లు, తర్వాత వరుసగా చంద్ర మహాదశ పదేళ్లు. కుజ దశ 7 ఏళ్లు, రాహు దశ 18 సంవత్సరాలు, గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు ఉంటుంది.

కృత్తిక నక్షత్రము గుణగణాలు

రవి గ్రహ నక్షత్రమైన కృత్తిక నక్షత్రములో పుట్టిన జాతకులు బాల్యంలో ధనిక జీవితాన్ని గడుపుతారు. స్వశక్తి అనేక స్థిరాస్తులు కొనుగోలు చేస్తారు. సంతానాన్ని సమదృష్టిలో చూస్తారు. కానీ చిన్న విషయాలకే అసత్యాలు పలికే మనస్తత్వం కలిగి వుంటారు. ఈ నక్షత్రములో పుట్టిన జాతకులు చదువు, అన్యభాషల యందు నేర్పరితనము విశేషమైన పోటీ తత్వము కలిగి ఉంటారని శాస్త్రం చెబుతోంది.

తొలి పాదములో పుట్టిన జాతకులకు మంగళవారం అన్ని విధాలా కలిసివస్తుంది. అలాగే బుధ, ఆదివారాలు సామాన్య ఫలితాలనిస్తాయి. కానీ గురువారం మాత్రం ఈ జాతకులు శుభకార్యాన్ని ప్రారంభించకూడదు. అలాగే కృత్తికా నక్షత్రము-తొలి పాదములో పుట్టిన జాతకులకు అదృష్ట సంఖ్యలు 9, 18, 27, 36, 45, 54, 63, 72.

ఈ నక్షత్రం తొలి పాదంలో పుట్టిన జాతకులకు కలిసొచ్చే రంగులు - ఎరుపు, తెలుపు.

ఇదేవిధంగా ఈ నక్షత్రము 2, 3, 4 పాదాల్లో జన్మించిన జాతకులకు బుధవారం అనుకూలిస్తుంది. ఈ జాతకులు బుధవారం చేపట్టే కార్యాలు దిగ్విజయంగా పూర్తవుతాయి. కానీ పౌర్ణమి తిథిలో వచ్చే బుధవారం నాడు ఈ నక్షత్రములో పుట్టిన జాతకులు ఎలాంటి శుభకార్యాన్ని చేపట్టకూడదు.

కృత్తికా నక్షత్రం.. అగ్ని నక్షత్రం, అధిపతి సుర్యుడు, గణం రాక్షసగణము కనుక ఈ నక్షత్రజాతకులు ఆవేశపరులై ఉంటారు. అంతటా ఆధిక్యత ప్రదర్శిస్తారు. ఏ పాదములో జన్మించినా బాల్యంలో ధనిక జీవితాన్ని గడుపుతారు. అధికారము ఇచ్చే చదువు, అన్యభాషల యందు నేర్పరితనం, విశేషమైన పోటీ మనతత్వం ఉంటుంది. చిన్న విషయాలకే అబద్ధాలు ఆడతారు. వీరికి స్త్రీలతో కలిగే విభేదాల వలన జీవితంలో చెప్పుకోదగిన మార్పులు వస్తాయి. ఇతరుల సలహాలను సహించరు. ఇతరుల అభిప్రాయాలను గౌరవించరు. అన్నింటా అధికారము సాగించాలని వీరు చేసే ప్రయత్నము మూడు భాగాలు ఫలించినా ఒక భాగము వికటిస్తుంది.

23 ఏళ్ల తర్వాత కొన్ని సమస్యలు ఎదుర్కొన్నా 36 నుంచి 41 ఏళ్ల తరువాత సమస్యల నుంచి బయటపడి సుఖ జీవితం సాగిస్తారు. ఈ నక్షత్ర జాతకులందరికీ ఇవి సాధారణ ఫలితాలు అయినా జాతక చక్రం, సమయం, గ్రహస్థితి, నవంశను అనుసరించి విశేష మార్పులు ఉంటాయి.

ఈ నక్షత్రమున 2, 3, 4 పాదాల్లో జన్మించిన జాతకులకు నీలం, తెలుపు అన్ని విధాలా కలిసొస్తుంది. ఈ జాతకులు రోజువారీ ధరించే దుస్తుల్లో నీలపు, తెలుపు రంగులు కొంతవరకైనా ఉండేలా చూసుకోవడం మంచిది. ఈ రంగు దుస్తులను ధరించడం వల్ల మనశ్శాంతి, అనుకున్న కార్యాలు దిగ్విజయంగా పూర్తవుతాయి.

ఈ జాతకులకు 6 అనే సంఖ్య అన్నివిధాలా అనుకూలిస్తుంది. 4, 5, 8 అనే సంఖ్యలు కూడా మంచి ఫలితాలనిస్తాయని శాస్త్రం చెబుతోంది.

***రోహిణి నక్షత్రం-గుణగణాలు, ఫలితాలు***

రోహిణీ నక్షత్రానికి అధిదేవత బ్రహ్మ. నక్షత్రాధిపతి చంద్రుడు. ఈ నక్షత్ర జాతకులు మానసిక ధృఢత్వము కలిగి ఉంటారు. మానవ గణము కనుక ధర్మచింతన కలిగి ఉంటుంది. జీవితంలో లౌక్యంగానూ ప్రవర్తిస్తారు. అనుకున్నది నయనా భయానా చెప్పి సాధిస్తారు. అనుకూలంగా నడుచుకుంటూ ఆధిక్యత సాధిస్తారు. సాహస క్రీడలంటే ఇష్టపడతారు. అందులోనూ ప్రావీణ్యత, గుర్తింపు సాధిస్తారు.

రోహిణి నక్షత్రం 4 పాదాలూ వృషభ రాశిలోనే ఉంటాయి.

రోహిణి మొదటి పాదము
రోహిణి మొదటి పాదములో జన్మించిన వారి ప్రధాన బలహీనత అనవసర విషయాలపై దృష్టిపెట్టడం. అవసరం లేని ఇతర విషయాల మీదే ఎక్కువగా ఆలోచిస్తారు. ఆలోచన అంతగా లేకుండానే తొందరపడి పనులు మొదలుపెడతారు. దీనివల్ల ఇబ్బందుల్లో కూరుకుపోతారు. నిదానంగా ప్రవర్తించాల్సిన విషయాల్లో జాగరూకత అవసరం. ఇతర విషయాలవైపు మనసు లాగితే చేసే పనిమీద శ్రద్ధ తగ్గే అవకాశం ఉంటుంది. కాబట్టి, అనవసర విషయాలకు ప్రాధాన్యం తగ్గించాలి. పరిస్థితుల్ని బట్టి సర్దుకోగలగడం ఒక వరం అనుకోవాలి. సానుకూలతను బట్టి మెలగాలి.

రోహిణి మొదటి పాదము గ్రహ దశలు
ఈ నక్షత్రంలో జన్మించిన వారి గ్రహ దశల విషయానికి వస్తే.. ముందుగా చంద్ర మహర్దశ పదేళ్లు, ఆ తర్వాత కుజ మహర్దశ 7 ఏళ్ళు, రాహు మహర్దశ 18 సంవత్సరాలు, ఆపై గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు, బుధ దశ 17సంవత్సరాలు, కేతు దశ 7 సంవత్సరాలు ఉంటుంది.

రోహిణి రెండో పాదము
రోహిణి రెండో పాదములో జన్మించిన వారు అదృష్ట జాతకులు. కలిసివచ్చిన అవకాశాల్ని చక్కగా ఉపయోగించుకునే నేర్పు ఉంటుంది. ఈ విషయంలో మంచి గుర్తింపు తెచ్చుకుంటారు. మాటల్లో పటుత్వం కలిగి ఉంటారు. ఈ ధోరణితో నెగ్గుకొని

రాగలుగుతారు. ఇక జీవితంలో తరచూ తారసపడే అనవసరమైన విషయాల మీద ఆందోళన తగ్గించుకోవాలి. ప్రతిభా సామర్థ్యాలు ఏ స్థాయిలో వినియోగించుకోవాలనే విషయంలో స్పష్టత సాధిస్తే మరింత మెరుగైన ఫలితాలు కనిపిస్తాయి.

రోహిణి రెండో పాదములో గ్రహ దశలు

ఈ పాదములో జన్మించిన వారికి ముందుగా చంద్ర మహర్దశ ఏడున్నర సంవత్సరాలు ఉంటుంది. ఆ తర్వాత కుజ మహర్దశ 7 ఏళ్ళు, రాహు మహర్దశ 18 సంవత్సరాలు, ఆపై గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు, బుధ దశ 17 సంవత్సరాలు, కేతు దశ 7 సంవత్సరాలు ఉంటుంది.

రోహిణి మూడో పాదం

రోహిణి మూడో పాదంలో జన్మించిన వారికి రకరకాల ఆలోచనలు పరిభ్రమిస్తుంటాయి. అయితే ఆ ఆలోచనలు బయటపెట్టకుండా జాగ్రత్త పడతారు. కళలయందు ఆసక్తి ఉంటుంది. కొంచెం పట్టు ఉన్నా ఎక్కువ పట్టు ఉన్నట్లు చూపగల నేర్పు ఉంటుంది. అయితే ఎల్లప్పుడు అనవసరపు ఆందోళనలు తగ్గించుకునేందుకు ప్రయత్నించాలి. భావోద్వేగాలను ప్రకటించే విషయంలో పరిమితి తప్పనిసరి.

గ్రహ దశలు

తొలుత చంద్ర మహర్దశ 5 సంవత్సరాలు, ఆ తర్వాత కుజ మహర్దశ 7 సంవత్సరాలు, రాహు మహర్దశ 18 సంవత్సరాలు, తదుపరి గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు, బుధ దశ 17సంవత్సరాలు, కేతు దశ 7 సంవత్సరాలు ఉంటుంది.

రోహిణి నాలుగో పాదం

రోహిణి నాలుగో పాదంలో జన్మించిన వారు అంది వచ్చిన అవకాశాల్ని పసిగడుతారు. జాగరూకులై ప్రవర్తించడం వీరి సహజసిద్ధ లక్షణం. జాగ్రత్తలో ఉన్నప్పటికీ ఒక్కోసారి ఎదురుదెబ్బలు తగిలే అవకాశం. అటువంటి సందర్భాల్లో సైతం మెరుగైన అవకాశాలకోసం అన్వేషిస్తారు. ముఖ్యమైన సందర్భాల్లో తమను తాము గుర్తెరిగి ప్రవర్తిస్తుంటారు.

గ్రహ దశలు

తొలుత చంద్ర మహర్దశ రెండున్నర సంవత్సరాలు, ఆ తర్వాత కుజ మహర్దశ 7 సంవత్సరాలు, రాహు మహర్దశ 18 సంవత్సరాలు, తదుపరి గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు, అనంతరం బుధ దశ 17సంవత్సరా లు, కేతు దశ 7 సంవత్సరాలు ఉంటుంది.

రోహిణి నక్షత్రము గుణగణాలు

ఈ నక్షత్ర జాతకులు మానసిక ధృఢత్వము కలిగి ఉంటారు. అనుకూలంగా నదచుకుంటూ ఆధిక్యత సాధిస్తారు. త్వరగా కోపం రాదు. చిరునవ్వుతో ఉంటారు. ఎన్ని విమర్సలనైనా ఎదుర్కొని అనుకున్నది సాధిస్తారు. ఎగుమతి, దిగుమతి వ్యాపారం కలసి వస్తుంది. అపనిందలు, ఆరోపనలు జీవితములో ఒక భాగము ఔతాయి. జీవితములో ఒడిదుడుకులు సహజము. వీరు హాస్యప్రియులు, కళ ప్రియులు కనుక కళారంగములో ప్రగతిని సాధిమ్చి అవార్దులు పొందగలరు. సంతానముతో విభేదిస్తారు.

గురు మహర్ధశ, శని మహర్ధశ వీరికి కలసి వస్తుంది. ప్రేమ వివాహాలు కలసి రావు. భార్యా భర్తల నడుమ అన్యోన్యత ఉంటుంది. క్రీడలు, కోర్టు వ్యవహారాలలో విజయము సాధిస్తారు. గజ ఈతగాళ్ళూ ఔతారు.తనకు తాను సుఖపడుతూనేతన వారిని సుఖ పెడతారు. వంశానికి కుటుంబానికి పేరు తెస్తారు. తాము అనుకున్నట్లు సంతానాన్ని తీర్చి దిద్దుతారు.

***మృగశిర నక్షత్రం - గుణగణాలు, ఫలితాలు***

మృగశిరా నక్షత్రము దేవగణ నక్షత్రము. ఈ నక్షత్రానికి అధిపతి కుజుడు, రాశ్యాధిపతులు శుక్రుడు, బుధుడు. అధిదేవత కుమారస్వామి. ఆధిపత్యం చంద్ర దేవతను సూచిస్తోంది. పగడం రాయి పెట్టుకోదగినది. ఈ నక్షత్ర జాతకులు చండ్ర వృక్షాన్ని పెంచుకుంటే మంచిది. హోమం సమయంలోనూ చండ్ర సమిధలు వాడడం మంచిది. తమో గుణంతో ఉండటం వీరి లక్షణం.

మృగశిర  నక్షత్రం తొలి రెండు పాదాలు వృషభ రాశిలోనూ, చివరి రెండు పాదాలు మిథున రాశిలోనూ ఉంటాయి.

మృగశిర మొదటి పాదము

మృగశిర మొదటి పాదములో జన్మించిన వారు తమ సొంత పనుల వల్లే కార్యసిద్ధి పొందుతారు. అదృష్టానికి, దురదృష్టానికి వీరిదే బాధ్యత ఉంటుంది. అదే సమయంలో తమ వైఖరి వల్లనే నష్టపోతారు. మరికొన్ని విషయాల్లో వేచి చూసే ధోరణి ఉంటుంది. దీనివల్ల ఒక్కోసారి పుణ్యకాలం కాస్తా గడచిపోతుంది. విశాల దృక్పథంతో ఆలోచించి నిర్ణయాలు తీసుకుంటారు. పరిస్థితులు తారుమారైతే ప్రభావం పాములా మెడకు చుట్టుకుంటుంది. అటువంటప్పుడు ప్రశాంతంగా ఉండేలా ప్రయత్నించాలి. కోపంతో సమస్యలు మరింత పెరుగుతాయే తప్ప తగ్గవు. ఈ విషయాన్ని గ్రహించాలి.

మృగశిర తొలి పాదము గ్రహ దశలు

ఈ నక్షత్రమున రెండో పాదములో జన్మించిన వారికి ముందుగా.. కుజ మహర్దశ 7 సంవత్సరాలు ఉంటుంది, రాహు మహర్దశ 18 సంవత్సరాలు, తర్వాత గురు 18 సంవత్సరాలు, శని 19 సంవత్సరాలు, అనంతరం బుధ దశ 17సంవత్సరాలు, కేతు దశ 7 సంవత్సరాలు, శుక్ర దశ 10 సంవత్సరాలు ఉంటుంది.

మృగశిర రెండో పాదము

ఈ నక్షత్రములోని రెండో పాదమున జన్మించిన వారు.. చురుకుగా ఉండేలా ప్రయత్నిస్తారు. మొదలు పెట్టే పనులన్నింటిలోను మంచి ఫలితం ఆశిస్తారు. అయితే ఆశించిన ఫలితం అందకపోతే ఆందోళన చెందుతారు. ఆ అనవసర ఆందోళనతో మరిన్ని తప్పుల్లో పడే ఆస్కారం ఏర్పడుతుంది. తెలివితేటలు వినియోగించాల్సినచోట వాడకపోవడంవల్ల ఇబ్బందులు ఏర్పడతాయి. ఇతరులపై ఆధారపడాల్సిన పరిస్థితులు రావచ్చు. ఇటువంటప్పుడు ఇబ్బందులు తలెత్తుతాయి. మెళకువతో వ్యవహరించి పరిస్థితుల్ని చక్కబెట్టుకుంటూ రావాలి.

మృగశిర రెండో పాదములో గ్రహ దశలు

ఈ నక్షత్రమున రెండో పాదమున జన్మించిన వారికి వరుసగా.. కుజ మహర్దశ ఐదేళ్ల తొమ్మిది నెలలు, తర్వాత రాహు 18 సంవత్సరాలు, గురు 16 సంవత్సరాలు, శని 19 సంవత్సరాలు,  అనంతరం బుధ దశ 17 సంవత్సరాలు, కేతు దశ 7 సంవత్సరాలు, శుక్ర దశ 20 సంవత్సరాలు ఉంటుంది.

మృగశిర మూడో పాదము

మృగశిర మూడో పాదమున ఆలోచనలు వేగంగా మారిపోతూ ఉంటాయి. ఏదైనా ఒక నిర్ణయానికి వచ్చే ముందు ఆలోచనల్లో మార్పు కనిపిస్తుంది. వాస్తవానికి దగ్గరి ఆలోచనలు ఉండవు. ఇదే సమయంలో ఆందోళనలు ఎక్కువగా ఉంటాయి. దీంతో నిర్ణయాలు ఆలస్యం అవుతుంటాయి. ఆందోళనలను దాచుకునేందుకు ఇష్టపడతారు. ఆర్థిక లావాదేవీల్లో రహస్యంగా ఉంటారు. దీనివల్ల ఒక్కోసారి ఇబ్బంది ఏర్పడవచ్చు. ఈ నక్షత్ర పాదములో జన్మించినవారికి జన్మతః కుజ మహర్దశ ఉండును.

మృగశిర మూడో పాదములో గ్రహ దశలు

జన్మించిన తర్వాత తొలి మూడున్నర సంవత్సరాలు కుజ మహర్దశ నడుస్తుంది. ఆ తర్వాత రాహు 18 సంవత్సరాలు, గురు 16 సంవత్సరాలు, శని 19 సంవత్సరాలు, బుధ 17 సంవత్సరాలు, కేతు 7 సంవత్సరాలు, శుక్ర మహర్దశ 20 సంవత్సరాలు ఉంటాయి.

మృగశిర నాలుగో  పాదము

మృగశిర నాలుగో పాదములో జన్మించిన వారు సాధు స్వభావంతో ఉంటారు. అయితే పరిస్థితులు అదుపులో ఉండవు. నిర్ణయాలు తారుమారు అవుతూ ఉంటాయి. దీంతో ఆయా వ్యక్తులు ఇబ్బంది పడడమే గాక, మిగిలినవారు సైతం ఇబ్బందులకు లోనవుతూ ఉంటారు. ఓపికతో వేచిచూసే ధోరణి కనిపించదు. దీనివల్ల ఫలితాలు వచ్చే సమయంలో పరిస్థితులను మార్చుకుంటారు. అంతిమంగా అసహనానికి లోనయ్యే స్వభావం ఉంటుంది. నిలకడకోసం ప్రయత్నించే స్వభావం ఏర్పరచుకోవాలి.

మృగశిర నాలుగో పాదమున గ్రహ దశలు

జన్మించినప్పటి నుంచి సుమారుగా 21 నెలల పాటు కుజ మహర్దశ ఉంటుంది. ఆ తర్వాత రాహు 18 సంవత్సరాలు, గురు 16 సంవత్సరాలు, శని 19 సంవత్సరాలు, బుధ 17 సంవత్సరాలు, కేతు 7 సంవత్సరాలు, శుక్ర మహర్దశ 20 సంవత్సరాలు ఉంటాయి.

మృగశిర నక్షత్రం గల వారి గుణగణాలు

ఈ నక్షత్రములో జన్మించిన వారు చురుకుగా ఉంటారు. వంశపారంపర్యంగా వచ్చే స్థిరాస్తులతో మృగశిర నక్షత్ర జాతకులు సకల భోగభాగ్యాలతో విలాసవంతంగా జీవిస్తారని శాస్త్రం చెబుతోంది. సంగీతంలో ప్రఖ్యాతి, ఉన్నత వ్యాపార సంస్థల్లో రాణించే వీరు అదృష్ట జాతకులని చెప్పవచ్చు.
అయితే ఏ విషయంలోనైనా తేలిగ్గా మారిపోయే స్వభావం కనిపిస్తుంది. ఆలోచనలు, నిర్ణయాలు వేగంగా మారిపోతాయి. నాయకత్వ స్థాయిలో ఉండేవారికి అవసరమైన స్థితప్రజ్ఞత ఉండదు. కానీ ఆచరణలో అమలు చేసేటప్పుడు ఎదురయ్యే ఇబ్బందులను లౌక్యంగా అధిగమించగలరు. ప్రతికూలతలను పదే పదే ఊహించుకోవడం మాత్రం ఇబ్బందికరం. పరిస్థితుల ప్రభావాన్ని బట్టి నిర్ణయాలు మారుతూ ఉంటాయి.

దైవభక్తి అధికం కలిగిన వీరికి అనారోగ్యం జీవితానికి ఆటంకం కానేరదు. నరములు, కీళ్ల ఎముకలకు సంబంధించిన వైద్యంలో రాణిస్తారు. దేశ భక్తి, బంధుప్రీతి కలిగిన ఈ జాతకులకు ప్రేమ వివాహాలు లాభిస్తాయి. వస్తు నాణ్యతను చక్కగా

నిర్ణయించే సత్తా వీరికుంటుంది. అయితే ఇతరులు చెప్పే విషయాలను ఏ మాత్రం పట్టించుకోరు. చెప్పుడు మాటలవు విని సజ్జనులను దూరం చేసుకుంటారు.

క్రమశిక్షణ, ప్రణాళిక ప్రకారం కార్యాచరణ చేయడం ద్వారా మృగశిర నక్షత్ర జాతకులు గొప్పగా రాణిస్తారు. దీర్ఘాయుషుతో, కీర్తి ప్రతిష్టలతో జీవించే మృగశిర జాతకులు శ్రీసుబ్రహ్మణ్యస్వామిని అర్చించడం వల్ల ఉన్నత స్థితికి చేరుకుంటారు.

***ఆరుద్ర నక్షత్రం - గుణగణాలు, ఫలితాలు***

ఆరుద్ర నక్షత్రాన్ని పరమేశ్వరుని జన్మ నక్షత్రంగా ప్రతీతి. ఆధిపత్య దేవుడు పరమేశ్వరుడు. ఈ నక్షత్రానికి అధిపతి రాహువు. గోమేధికం రాయి పెట్టుకోదగినది. వీరు వస మొక్కలు పెంచుకోవాలి. దర్భ సమిధలతో హోమం చేస్తే మంచిది.

ఆరుద్ర నక్షత్రం 4 పాదాలు మిథున రాశిలోనే ఉంటాయి.

ఆరుద్ర మొదటి పాదము
ఆరుద్ర మొదటి పాదములో జన్మించిన వారు అదృష్టంపైనే నమ్మకం పెట్టుకుంటారు. అదృష్టంతోనే నెగ్గుకు రావాలనే మనస్తత్వం. వస్తు, విషయ జాగ్రత్తలు ఎక్కువ. ఈ విషయంలో ఒక్కోసారి శృతిమించుతుంటాయి కూడా. దీని వల్ల ఇబ్బందులు తప్పవు. పారదర్శక వైఖరితో కలుపుకునే స్వభావం ఉంటుంది. లోకాన్ని పరిశీలించే స్వభావం ఉండటంతో అవకాశాలపై పట్టు నిలుపుకుంటారు. సంస్కృతి, సాంప్రదాయలపై, ఆచార వ్యవహారాలపై ఆసక్తి, శ్రద్ధ ఉంటుంది.

ఆరుద్ర మొదటి పాదములో గ్రహ దశలు
ఈ పాదములో జన్మించినవారికి ముందుగా రాహు మహర్దశ 18 సంవత్సరాలు ఉంటుంది. తర్వాత గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు, బుధ మహర్దశ 17 సంవత్సరాలు, కేతు మహర్దశ 7 సంవత్సరాలు, శుక్ర మహర్దశ 20 సంవత్సరాలు ఉంటాయి.

ఆరుద్ర రెండో పాదము
ఆరుద్ర రెండో పాదములో జన్మించిన వారిలో పట్టుదల, తీక్షణత ఎక్కువగా ఉంటాయి. అంతిమ లక్ష్యం మీద దృష్టి పెడతారు. ఆలోచనల్లో భిన్నత్వాన్ని గుర్తించలేరు. దీంతో కోరి కష్టాలు తెచ్చుకుంటారు. పలు విషయాలందు ఆసక్తి ఎక్కువ. ఒక్కోసారి చేతులు కాల్చుకుంటారు. సమస్యలను గుర్తించటంలో ఇబ్బంది ఉంటుంది. మధ్యలో ఏర్పడే పరిణామాలతో కొంచెం గందరగోళానికి గురవుతారు.

ఆరుద్ర రెండో పాదములో గ్రహ దశలు
రెండో పాదములో జన్మించినవారికి రాహు మహర్దశ 13 సంవత్సరాల ఆరు నెలలు ఉంటుంది. తర్వాత గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు, బుధ మహర్దశ 17 సంవత్సరాలు, కేతు మహర్దశ 7 సంవత్సరాలు, శుక్ర మహర్దశ 20 సంవత్సరాలు ఉంటాయి.

ఆరుద్ర మూడో పాదము

ఆరుద్ర మూడో పాదములో తరచూ సమస్యలు ఎదుర్కొంటారు. చురుకుదనం వల్ల ఒక్కోసారి హద్దు మీరుతుంది. దీంతో సమస్యలు ఎదుర్కొనక తప్పదు. వేగంతో ముందుకెళ్లబోయి తల బొప్పి కట్టించుకుంటారు. వాయుతత్వ స్వభావం ఉండటంతో నిర్ణయాల్లో నిలకడ లోపిస్తుంటుంది. ఈ సమస్యను అధిగమించేందుకు చిత్తశుద్ధితో కృషి చేయాలి. సర్దుకొనే స్వభావం ఉండటం కలిసి వచ్చే లక్షణం. కానీ సమస్యను నిజాయితీగా అర్థం చేసుకుంటేనే ఫలితముంటుంది.

ఆరుద్ర మూడో పాదములో గ్రహ దశలు

మూడో పాదములో జన్మించినవారికి ముందుగా రాహు మహర్దశ 9సంవత్సరాలు, తర్వాత గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు, బుధ మహర్దశ 17 సంవత్సరాలు, కేతు మహర్దశ 7 సంవత్సరాలు, శుక్ర మహర్దశ 20 సంవత్సరాలు ఉంటాయి.

ఆరుద్ర నాలుగో పాదము

ఆరుద్ర నాలుగో పాదమున జన్మించిన వారు నిదానంగా వ్యవహరించాల్సి ఉంటుంది. ముఖ్యంగా లౌక్యం, చాకచక్యం మిగిలిన లక్షణాలను ప్రభావితం చేస్తాయి. దూరదృష్టితో వ్యవహరించాలి. నిలకడ సాధించడం కూడా ముఖ్యమే. నిదానమే ప్రధానం అన్న సూక్తి వర్తిస్తుంది. అందరిని కలుపుకుపోయే స్వభావం ఉంటుంది. దీంతోపాటు ఫలితాన్ని పంచుకొనే వైఖరికూడా అవసరం. అనవసరపు కోపానికి సంకెళ్లు వేస్తే మంచి ఫలితాలు ఉంటాయి. అన్నింటా గెలిచి రావాలన్న వ్యూహాన్ని సమర్థంగా అమల్లో పెట్టాల్సి ఉంటుంది.

ఆరుద్ర నాలుగో పాదములో గ్రహ దశలు

నాలుగో పాదములో జన్మించిన వారికి ముందుగా రాహు మహర్దశ 4 సంవత్సరాల 6 నెలలు ఉంటుంది. తర్వాత గురు మహర్దశ 16 సంవత్సరాలు, శని మహర్దశ 19 సంవత్సరాలు, బుధ మహర్దశ 17 సంవత్సరాలు, కేతు మహర్దశ 7 సంవత్సరాలు, శుక్ర మహర్దశ 20 సంవత్సరాలు ఉంటాయి.

ఆరుద్ర నక్షత్రము - గుణగణాలు

ఈ నక్షత్రములో జన్మించిన వారిది అనుకొన్న దానిని సాధించేదాకా నిద్రపోని తత్వం. మాటల్లో నేర్పరితనమును, మంచి జ్ఞాపకశక్తి ఉంటుంది. పట్టుదల కూడా ఉంటుంది. కార్యసాధనలో ఎన్నిసార్లు జారిపడినా పట్టు వదలక ఉన్నత స్థితికి వస్తారు. కీర్తియోగము వీరిని ఎప్పుడూ వెన్నంటి ఉంటుంది. డబ్బుల విషయంలో నిర్ణయాలు సరిగా ఉండవు. తప్పుడు సలహాలు, శక్తిసామర్థ్యాలు, పగ తీర్చుకోవాలనే కోరిక, మొండి పట్టుదల జీవితంలో ఒడిదుడుకులకు దారి తీయవచ్చును. తొందరపాటుతో ముందు వెనుక మంచి-చెడు అనేవి చూడకుండనే నిర్ణయాలను వెంటనే అమలు పరుస్తారు. అవమానాన్ని ఓర్చుకొనలేరు.

ఆయుస్సు కూడా ఎక్కువే. ఆడవారిపట్ల గౌరవ భావం కలిగి ఉంటారు. మూకలని నమ్మించ కలిగిన ఆకట్టుకొనగలిగిన శక్తిని వీరు కలిగి ఉంటారు. ఎంత మంది వీడి వెళ్ళినా ఎనలేని శక్తి సామర్థ్యాలతో మరల వీరు ఉన్నత స్థాయి సాధిస్తారు. వీరి వీరి బ్రతుకులలో ఏభై రెండు నుంచి 26 సంవత్సరాల వరకు చిక్కులు తక్కువగానే ఉంటాయి.

ఈ నక్షత్రము వారు ఆలోచనలు, నిర్ణయాలు చకచకా మార్చేసుకుంటారు. క్రయ విక్రయాలయందు ఆసక్తి ఉంటుంది. దీంతో వ్యాపారమందు దూసుకెళ్లే స్వభావం కనిపిస్తుంది. జాగ్రత్తగా వ్యవహరించకపోతే వీరితో పాటు వెంట ఉన్నవారికికూడా ఇబ్బంది తప్పదు.

**పునర్వసు నక్షత్రము-గుణగణాలు, ఫలితాలు**

పునర్వసు గురు గ్రహ నక్షత్రం, దేవగణ నక్షత్రం, రాశ్యాధిపతులు బుధుడు, చంద్రుడు. అధిదేవత అధితి, పురుష జాతి. పునర్వసు నక్షత్రం మొదటి మూడు పాదాలు మిధున రాశిలోనే ఉంటాయి. నాలుగవ పాదము కర్కాటక రాశిలో ఉంటాయి.

పునర్వసు నక్షత్రమున ఏ పాదంలో జన్మించినా దోషమనేది లేదు. ఎక్కువ శాతం శుభకరమనే చెప్పాలి. ఈ నక్షత్రంలో అమ్మాయి జన్మిస్తే.. ఆమె శాంత స్వభావంతో, బంధువులయందు అమితమైన అభిమానం చూపుతుంది. ఓర్పు ఉంటుంది. ధర్మకార్యాలు చేసేదిగా అవుతుంది. క్రమంగా ఆమె ధనవంతురాలు అవుతుంది. ఇక అబ్బాయి జన్మిస్తే సౌందర్యవంతుడు. శ్రమకు ఓర్చుకునేవాడు అయి ఉంటాడు. అయితే అతడు అల్పసంతోషి, తొందర పాటు ప్రవర్తన కలిగి ఉంటాడు.

ఈ నక్షత్ర జాతకులకు సాధారణ ఫలితాలు ఉంటాయి. సువర్ణం, ఆయుర్వేదం, ఎగుమతి వ్యాపారాలు కలసి వస్తాయి. సౌకర్యవంతమైన ఉద్యోగాలలో స్థిరపడతారు.

పునర్వసు నక్షత్రము గుణాగణాలు

జీవితంలో ఎదురయ్యే సమస్యలను పరిష్కరించగలిగిన వ్యక్తిగా, వ్యక్తిత్వం కలిగిన వ్యక్తిగా, స్వయం శక్తి కలిగిన వ్యక్తిగా సమాజంలో మంచి గుర్తింపు తెచ్చుకుంటారు.

ఇక ఈ నక్షత్ర జాతకులు ఇతరుల విషయాలలో జోక్యం చేసుకోరు. అయితే అత్యవసర సమయంలో ఇతరులను ఆదుకునే తత్వం ఉంటుంది. సొంత పనులకంటే ఇతరుల పనులకు సహాయపడే పనికే అధిక ప్రాధాన్యం ఇస్తారు. ధనుర్విద్య, తుపాకితో కాల్చడం వంటి అలసట కలిగించే విద్యలయందు ఆసక్తి అధికం. అభిప్రాయాలు, మటలు స్పష్టంగా ఉంటాయి. పరపతి బాగా ఉంటుంది. సమాజంలో ఉన్నత వర్గానికి నాయకత్వం వహిస్తారు. పరపతి బాగా ఉపయోగపడుతుంది. పరిచయాలను కార్య సిద్ధికి ఉపయోగించుకుంటారు.

వివాహ జీవితములో తలెత్తిన భేదాభిప్రాయాలను ప్రాధమిక దశలోనే సర్దుబాటు చేసుకోవడం వల్ల ప్రయోజనం ఉంటుంది. చెప్పిందే పదే పదే చెప్పడం, అతి జాగ్రత్తలు, ఇతరులను అధికంగా నమ్మి కార్యభారము అప్పగించ లేని స్థితి వీరిని పిరికి వారుగా భావించే అవకాశం ఉంది.

బాల్యం సుఖవంతంగానే గడుస్తుంది. అయితే క్రమంగా సమస్యల వలయములో చిక్కుకుంటారు. 40 నుండి 70 సంవత్సరాల తరువాత సమస్యల నుంచి బయట పడి సుఖ జీవితం కొనసాగించే అవకాశము ఉంది.

*పుష్యమి నక్షత్రం - గుణగణాలు, ఫలితాలు*

నక్షత్రములలో పుష్యమి 8వ నక్షత్రము. పుష్యమి నక్షత్రాధిపతి శని. గణము దేవగణము. అధిదేవత బృహస్పతి.

పుష్యమి నక్షత్రము మొదటి పాదము

పుష్యమి నక్షత్రము మొదటి పాదములో జన్మించిన జాతకులు నవరత్నాల్లో నీల రత్నాన్ని ధరించాలి. పుష్యమి తొలి పాదములో జన్మించిన జాతకులకు 19 సంవత్సరాల కాలం పాటు శని మహర్దశ జరగడంతో నీలమును వెండితో పొదిగించుకుని మధ్య వేలుకు ధరించాలి. 36 సంవత్సరాల నుంచి 43 సంవత్సరాల వరకు కేతు మహర్దశ కావున వైఢూర్యమును వెండితో చిటికెన వేలుకు ధరించడం మంచిది. అలాగే 43 సంవత్సరాల నుంచి 63 సంవత్సరాల వరకు ఈ జాతకులకు శుక్ర మహర్దశ. వజ్రమును బంగారంతో ఉంగరపు వ్రేలుకు ధరించడం ద్వారా వ్యాపారాభివృద్ధి, ఈతిబాధలు తొలగిపోవడం వంటి శుభ ఫలితాలుంటాయి.

63 నుంచి 69 సంవత్సరాల వరకు ఈ జాతకులకు రవి మహర్దశ.. కాబట్టి కెంపును వెండిలో పొదిగించుకుని ఉంగరపు వేలుకు ధరించడం మంచిది. ఇదేవిధంగా 69 నుంచి 79 సంవత్సరాల వరకు చంద్ర మహర్దశ ఉంటుంది కాబట్టి ముత్యమును వెండితో పొదిగించుకుని ఉంగరపు వేలుకు ధరించాలి. అలాగే 79 సంవత్సరాల నుంచి 86 సంవత్సరాల వరకు ఈ జాతకులకు కుజ మహర్దశ కావడంతో పగడమును బంగారముతో ఉంగరపు వ్రేలికి ధరించడం ద్వారా శుభ ఫలితాలుంటాయి.

ఈ జాతకులు సత్ప్రవర్తన కలిగి ఉంటారు. వీరికి హైస్కూలు వరకు చదువు మందకొడిగా సాగుతుంది. అయినా ప్రయత్నా పూర్వకంగా పైచదువులు కొనసాగిస్తే చక్కని ఫలితాలు సాధిస్తారు. ఉన్నత ఉద్యోగాలు చేసే అవకాశాలు ఉన్నాయి. జీవితంలో ఉన్నత స్థితికి చేరుకుంటారు. 35 ఏళ్ల అనంతరం వచ్చే కేతు దశలో వీరికి సమస్యలు ఉన్నా కేతువు అనుకూలంగా ఉన్నట్లయితే విదేశాలలో ఉద్యోగం చేసే అవకాశం కూడా ఇస్తుంది. కేతు దశ 7 సంవత్సరాల అనంతరం వచ్చే 42 సంవత్సరాలలో వచ్చే శుక్ర దశలో వీరు అత్యున్నత స్థానానికి చేరుకుంటారు. ఇనుము, అగ్ని సంబంధిత వృత్తి ఉద్యోగ వ్యాపారాలు వీరికి అనుకూలిస్తాయి. అంతేకాదు వీరికి ప్రభుత్వ ఉద్యోగాలు కూడా అనుకూలిస్తాయి. శుక్ర దశ నుంచి వీరికి సౌఖ్యవంతమైన జీవితం కొనసాగుతుంది.

పుష్యమి నక్షత్ర రెండవ పాదము

పుష్యమి నక్షత్ర 2 వ పాదం లోని జాతకుల జీవితం సాఫీగా సాగిపోతుంది. సకాలంలోనే జీవితంలో స్థిరపడతారు. వివాహం కూడా సకాలంలో జరుగుతుంది. 30 సంవత్సరాల వయసులో కేతుదశలో కొన్ని సమస్యలు ఎదురు కావచ్చు. కేతువు అనుకూలంగా ఉంటే విదేశాలలో ఉద్యోగావకాశాలు కలుగవచ్చు. శుక్ర దశ వీరికి సౌఖ్యవంతమైన జీవితం ఇస్తుంది. మిగిలిన జీవితం సాఫీగా జరుగుతుంది. ఇంజనీరు, లాయరు వంటి వృత్తి ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి. విద్యలో ప్రతిభ సాధించి జీవితంలో సకాలంలో ఉన్నత స్థితి చేరుకుంటారు. మేధస్సును ఉపయోగించే ఉద్యోగావ్యాపారాలు చేస్తారు. ఉన్నత ఉద్యోగాలు కూడా వీరికి అనుకూలం. ఇనుము, భూమి సంబంధిత ఉద్యోగం, వ్యాపారం, వృత్తులు వీరికి అనుకూలం.

పుష్యమి నక్షత్ర మూడవ పాదము

పుష్యమి నక్షత్రము 3 వ పాదం నక్షత్ర అధిపతి శని. కనుక వీరి మీద శుక్ర శని గ్రహ ప్రభావం అధికంగా ఉంటుంది. వీరు దేవ గుణ ప్రధానులు కనుక సత్ప్రవర్తన కలిగి ఉంటారు. 6 సంవత్సరాల వరకు విద్యారంభం కొంచెం మందకొడిగా ఆరంభం అయినా తరువాత వచ్చే బుధ దశ 17 సంవత్సరాల కాలంలో విద్యలో అభివృద్ధి సాధిస్తారు. విద్య నిరాటంకంగా విజయవంతంగా సాగుతుంది. విద్య ముగియగానే జీవితంలో స్థిరపడవచ్చు. 23 సంవత్సరాలకు వచ్చే 7 సంవత్సరాల కేతు దశ కారణంగా వివాహంలో కొన్ని ఆటంకాలు ఎదురైనా వివాహానంతరం 30 సంవత్సరాలలో వచ్చే శుక్రదశ కారణంగా సౌఖ్యమైన జీవితం ఆరంభం అవుతుంది. జీవితంలో ఉన్నత స్థితి సాధిస్తారు. జీవితం సాఫీగా జరిగి పోతుంది. కేతుదశ అనుకూలంగా ఉంటే వీరికి విదేశాలలో ఉద్యోగావకాశాలు వచ్చే అవకాశాలు ఉంటాయి. మిగిలిన జీవితం వీరికి సాఫీగా సాగిపోతుంది. సముద్ర సంబంధిత, నుకా సంబంధిత, జల సంబంధిత వృత్తి ఉద్యోగాలు వీరికి అనుకూలం. ఇనుము, ముత్యం, తెల్లని వస్తువుల వ్యాపారం వీరికి అనుకూలం. న్యాయవాదులుగా వీరు రాణిస్తారు. నౌకా సంబంధిత ఉద్యోగాలు కూడా వీరికి అనుకూలమే.

పుష్యమి నక్షత్ర నాలుగవ పాదము

పుష్యమి నక్షత్ర 4 వ పాదం నక్షత్ర అధిపతి శని. వీరి మీద కుజ శనిగ్రహ ప్రభావం ఉంటుంది. వీరు అనుకుది పట్టుదలతో సాధిస్తారు. వీరికి ధైర్యసాహసాలు అధికంగా ఉంటాయి. ఉద్యమాలు వంటి వాటిలో వీరు ముందుంటారు. రెండు సంవత్సరాల తరువాత 17 సంవత్సరాల కాలం బుధదశ వస్తుంది కనుక వీరు ఉన్నత విద్యాభ్యాసం వరకు చదువులో రాణిస్తారు. తరువాత 7 సంవత్సరాల కేతదశ కారణంగా ఉన్నత విద్యను కొన్నిఆటంకాలను ఎదుర్కొంటూ ప్రయత్నపూర్వకంగా పూర్తి చేయవలసిన అవసరం ఉంది. ప్రయత్నిస్తే తప్పక ఆటంకాలను అధిగమించవచ్చు.

కేతువు అనుకూలంగా ఉన్న వారు బయట ఊర్లలో లేక విదేశాలలో విద్యాభ్యాసం చేయగలుగుతారు. విద్య పూర్తి చేయగానే జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో స్వల్పంగా జాప్యం ఉంటుంది. వైమానిక దళంలో ఉద్యోగాలు చేయడంలో ఆసక్తి ఉంటుంది. వ్యవసాయం వంటి వృత్తులు చేయడంలో ఆసక్తి కలిగి ఉంటారు. 28 సంవత్సరాలలో శుక్రదశ వస్తుంది కనుక జీవితంలో త్వరగానే అభివృద్ధి సాధిస్తారు. తరువాత వీరికి జీవితం ఒడిదుడుకులు లేకుండా జరిగిపోతుంది. సైనిక, భూమి, ఇనుము సంబంధించిన ఉద్యోగ, వ్యాపారాలు వీరికి అనుకూలం.

పుష్యమి నక్షత్రము గుణగణాలు

శనిగ్రహ నక్షత్రమైన పుష్యమిలో జన్మించిన జాతకులు బాల్యం నుంచి యవ్వనం వరకు కష్టపడి జీవితంలో అభివృద్ధి సాధిస్తారు. తక్కువ వ్యవధిలో ఎక్కువ ఆలోచనలు చేయకుండా ముఖ్యమైన నిర్ణయాలు తీసుకోవడం ఈ జాతకుల ప్రత్యేక లక్షణం. మంచి విషయాలకు ప్రాధాన్యమిచ్చి, ఇతరుల చెడు ప్రవర్తనను ముక్కుసూటిగా, నిర్మొహమాటంగా మాట్లాడేతత్వం కలిగి ఉంటారు. వీరికి ఎగుమతి, దిగుమతి వ్యాపారాలు లాభిస్తాయి.

యవ్వనం నుంచి వీరి జాతకం అదృష్టానికి దగ్గరగా ఉంటుంది. యవ్వనం వచ్చినప్పటి నుంచి వృత్తి ఉద్యోగాలకు ఎంపికకవుతారు. వీరి జీవితం వివాహ అనంతరం గాడిలో పడుతుంది. మంచి అభివృద్ధిని సాధిస్తారు. సమాజంలో మంచి గుర్తింపు సంపాదించుకుంటారు. స్వార్జితముగా వృద్ధిలోకి రాగలరు. కుటుంబ విషయములో ఇతర కుటుంబ సభ్యుల

ప్రోత్సాహము తక్కువగా ఉంటుంది . స్నేహితులు మరియు సన్నిహితుల ప్రోత్సాహము , సహకారము వలన వీరు జీవితమున అత్యున్నత స్థాయికి చేరుకొంటారు .

వీరి వైవాహిక జీవితం ఎటువంటి ఒడిదుడుకులు లేకుండా సాగిపోతుంది. అయితే వ్యాపారంలో తలెత్తే ఇబ్బందులు తొలగిపోవాలంటే, శనీశ్వరునికి నెలకోసారి తైలాభిషేకం చేయించాల్సి ఉంటుంది. ప్రతి శనివారం నువ్వులతో దీపమెలిగించడం ద్వారా ఈతి బాధలు తొలగిపోతాయి.

ఇక సోమవారం, బుధవారం, ఆదివారాల్లో ఈ జాతకులు చేపట్టే కార్యములన్ని విజయవంతమవుతాయి. అయితే గురువారంలో కొత్త పనులు ప్రారంభించకూడదు.

వీరి అదృష్ట సంఖ్యలు: 2, 7.

***అశ్లేష నక్షత్రం - గుణగణాలు, ఫలితాలు***

ఆశ్లేష నక్షత్రం గణము రాక్షస గణము. అధిదేవత పాము. రాశ్యాధిపతి చంద్రుడు. నక్షత్రాధిపతి బుధుడు.
ఆశ్లేష నక్షత్ర మొదటి పాదము
ఆశ్లేష నక్షత్ర మొదటి పాదం అధిపతి బుధుడు.అంసాదిపతి గురుడు కనుక వీరి మీద గురు, బుధగ్రహ ప్రభావం ఉంటుంది. ఈ నక్షత్ర జాతకులకు విద్యా సంబంధిత ఉద్యోగాలలో వీరికి ఆసక్తి ఉంటుంది. మేధా సంబంధిత ఉద్యోగాలలోనూ వీరు బాగా రాణించగలరు. విద్యాసంస్థలు స్థాపన, నిర్వహణలో వీరు సమర్ధులు. వీరికి నిర్వహణ సామర్ధ్యం అధికంగా ఉంటుంది. వీరు విద్యారంభంలోనే ప్రతిభను ప్రదర్శిస్తారు. 15 సంవత్సరాల సమయంలో హైస్కూల్ చదువు పూర్తి చేసే సమయంలో ఏడు సంవత్సరాల కేతుదశ కొన్ని అడ్డంకులు ఎదురవుతాయి. అయినప్పటికీ ప్రయత్నపూర్వకంగా వాటిని అధిగమిస్తే తప్పక విజయం సాధిస్తారు.

కేతువు అనుకూలంగా ఉన్న వారు సొంత ఊరికి దూరంగా (బయట ఊర్లలో లేక విదేశాలలో) విద్యాభ్యాసం చేయగలుగుతారు. తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కారణంగా విద్య పూర్తి కాగానే జీవితంలో స్థిరపడతారు. వీరు చిన్న వయసులోనే జీవితంలో స్థిరపడతారు. భూ, విద్యా, ఆభరణ సంబంధిత ఉద్యోగం, వ్యాపారం, వృత్తులు వీరికి అనుకూలిస్తాయి. తరువాత వీరికి జీవితం సాఫీగా జరిగిపోతుంది.

ఆశ్లేష నక్షత్ర రెండవ పాదము
ఆశ్లేష నక్షత్ర రెండవ పాదము అధిపతి బుధుడు. అంసాదిపతి శని కనుక వీరి మీద బుధ,శని గ్రహ ప్రభావం ఉంటుంది. వీరువ్యాపారం అంటే ఇష్టపడతారు. బుధ గ్రహ ప్రభావం కారణంగా మేధో సంబంధిత ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి. ఇనుము సంబంధిత ఉద్యోగ వ్యాపారాలు కూడా అనుకూలిస్తాయి. 11 సంవత్సరాల వయసులో హైస్కులు విద్య ముందే వచ్చే 7 సంవత్సరాల కేతుదశ కారణంగా వీరికి కొన్ని ఆటంకాలు ఎదురౌతాయి. ప్రయత్నా పూర్వకంగా వాటిని అధిగమించి విజయం సాధించవచ్చు.

18 సంవత్సరాల వయసులో శుక్ర దశ మొదలవుతుంది. ఉన్నత విద్యాభ్యాస కాలంలో మనసు విలాసాల వైపు మళ్లే అవకాశం.. కనుక ప్రయత్నా పూర్వకంగా మనసును విద్య వైపు మళ్ళించి విజయం సాధించాలి. విద్య పూర్తికాగానే జీవితంలో స్థిరపడతారు. వివాహం సకాలంలో జరుగుతుంది. మిగిలిన జీవితం 51 సంవత్సరం వరకు వీరికి సాఫీగా జరుగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల కలం సాగే రాహుదశ కాలంలో కొన్ని సమస్యలు ఎదురౌతాయి. రాహువు అనుకూలంగా ఉంటే విదేశీవాసం, విదేశీయాత్ర చేయడానికి అవకాశం కూడా ఉంది. వృద్ధాప్యం ఇబ్బందులు లేకుండా సాఫీగా జరుగుతుంది.

ఆశ్లేష నక్షత్ర మూడవ పాదము

ఆశ్లేష నక్షత్ర మూడవ పాదము అధిపతి బుధుడు. అంసాదిపతి శని కనుక వీరి మీద బుధ శని గ్రహ ప్రభావం ఉంటుంది. వీరికి వ్యాపారం అంటే ఇష్టం. బుధగ్రహ ప్రభావం కారణంగా మేధో సంబంధిత ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి. వీరు స్థిరమైన అభిప్రాయాలు కలిగి ఉంటారు. శ్రమించి పనిచేసే గుణం కలిగి ఉంటారు. వీరికి వృత్తి, వ్యాపారం, ఉద్యోగాల మీద సమానంగా ఆసక్తి ఉంటుంది. మేధో సంబంధిత ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి. ఇనుము సంబంధిత ఉద్యోగ వ్యాపారాలు కూడా వీరికి అనుకూలిస్తాయి. విద్యా ఆరంభంలోనే ఆటంకాలు ఎదురౌతాయి. వాటిని అధిగమించి ముందుకు సాగవలసిన అవసరం ఉంది.

ఏడు సంవత్సరాల వయసులో వచ్చే ఏడు సంవత్సరాల కేతుదశ కారణంగా విద్య లో ఆటంకాలు ఎదురయ్యే అవకాశాలు ఉన్నాయి. 14 సంవత్సరాలకే శుక్రదశ వస్తుంది కనుక కళాశాల చదువుల కాలంలో విద్య కంటే అలకరణ అంటేనే ఇష్టముంటుంది. కనుక ప్రయత్నా పూర్వకంగా మనసును విద్య వైపు మనసును మళ్ళించి విద్యాభ్యాసం పూర్తి చేయాలి. విద్యాభ్యాసం పూర్తి కాగానే జీవితంలో స్థిరపడతారు. సకాలంలో పెళ్లి జరిగే అవకాశాలు ఉంటాయి. 34 సంవత్సరాల వరకు సాగిన సౌఖ్యవంతమైన జీవితంలో తరువాత కొంత సౌఖ్యం తగ్గినా జీవితం సాఫీగా జరిగిపోతుంది.

ఆశ్లేష నక్షత్ర నాలుగవ పాదము

ఆశ్లేష నక్షత్ర నాలుగవ పాదం అధిపతి బుధుడు. అంసాదిపతి గురువు. ఆశ్లేష నక్షత్ర బుధుడు. వీరి మీద గురు బుధ గ్రహ ప్రభావం ఉంటుంది. విద్యాసంబంధిత ఉద్యోగాలలో వీరికి ఆసక్తి ఉంటుంది. మేధా సంబంధిత ఉద్యోగాలలో రాణించగలరు. విద్యా సంస్థలు స్థాపన, నిర్వహణ వీరు సమర్ధవంతంగా చేస్తారు. వీరికి నిర్వహణ సామర్ధ్యం అధికంగా ఉంటుంది. వీరు విద్యారంభంలోనే మూడు సంవత్సరాల నుండి వచ్చే ఏడు సంవత్సరాల కేతుదశ కారణంగా విద్యారంభంలో ఆటంకాలను ఎదుర్కొంటారు. వాటిని అధిగమించి ముందుకు సాగవలసిన అవసరం ఉంది. తరువాత 10 సంవత్సరాలకు వచ్చే శుక్రదశ కారణంగా విద్య కంటే అలకరణ అంటే మక్కువ ఎక్కువగా ఉంటుంది. కనుక ప్రయత్నా పూర్వకంగా మనసును విద్య వైపు మనసును మళ్ళించి విద్యాభ్యాసం పూర్తి చేసి విజయం సాధించవలసిన అవసరం ఉంది.

నాలుగవ పాదములో జన్మించిన వారు కూడా విద్యాభ్యాసం పూర్తికాగానే జీవితంలో స్థిరపడతారు. సకాలంలో వివాహం జరిగే అవకాశాలు ఉంటాయి. 30 సంవత్సరాల వరకు సాగిన సౌఖ్యవంతమైన జీవితంలో తరువాత కొంత సౌఖ్యం తగ్గినా జీవితం సాఫీగా జరిగి పోతుంది. 53 సంవత్సరాల అనంతరం వచ్చే రాహు దశ కాలమో కొన్ని సమస్యలను ఎదుర్కోనవలసిన అవసరం ఉంది. రాహు దశ అనుకూలిస్తే విదేశీయానం చేసే అవకాశం ఉంటుంది. వృద్ధాప్యం సౌఖ్యవంతంగా జరిగిపోతుంది.

ఆశ్లేష నక్షత్ర జాతకుల గుణగణాలు

ఆశ్లేష నక్షత్ర జాతకులు ఏ విషయంలోనైననూ పట్టుదల కలిగి ఉంటారు. వీరి పట్టుదల వీరిని ఉన్నత స్థితికి తీసికొని పోతుంది. శత్రువుల విషయంలో పగతో ఉంటారు. వీరికి రాజకీయాలపై ఆసక్తి ఉంటుంది. వర్గ రాజకీయాలను సమర్ధతతో నడపగలరు. ప్రజా జీవితములో మంచి పేరు తెచ్చుకుంటారు. అడ్డంకుల నడుమ వీరి చదువులు కొనసాగుతాయి, ఏది ఏమి అయిన సరే వీరు ఆయా అడ్డగింపులని దాటి పై చదువులను పూర్తి చేస్తారు. న్యాయపరమైన చిక్కులను అధిగమిస్తారు. వీరు ఉద్యోగ, వ్యాపార రంగాలలో రాణించగలరు. కష్టపడి సుఖజీవితాన్ని అలవరచుకున్నా పొరపాటుగా ఉండే ఊహాల వల్ల సమస్యలు ఎదుర్కొంటారు. స్త్రీల వలన పెద్దల వలన జీవితములో ఇబ్బందులకు గురవుతారు.

నమ్మకము లేని వ్యక్తులతో సహజీవనము సాగిస్తారు. ఉద్యోగములో నిపుణత సాధిస్తారు. ఉన్నతాధికారుల వలన, ఉన్నత స్థాయిలో ఉన్న వారి వలన ఇబ్బందులు ఎదురౌతాయి. అనుకున్న లక్ష్యాన్ని చేరుకోవడానికి ఎంతో ఓర్పు వహిస్తారు. లక్ష్యసాధన కొరకు ఎంత కాలమైనా ఎదురు చూస్తారు. వయసు గడిచే కొద్దీ సుఖమయ జీవితానికి చేరువవుతారు. నమ్మకద్రోహులు స్నేహితులుగా ఉండడం దురదృష్టముగా పరిణమిస్తుంది. స్థిరాస్థులు దక్కించుకోగలుగుతారు. వీరికి ఆయుర్వేద మందులు, బియ్యం, పాల వ్యాపారం, పెట్రోలు బంకులు, బట్టల వ్యాపారము లాభిస్తాయి. వివాదాలకు దూరంగా ఉంటారు.

***చిత్త నక్షత్రం - గుణగణాలు, ఫలితాలు***

నక్షత్రములలో చిత్త నక్షత్రము 14వది. చిత్తా నక్షత్రముకు అధిపతి కుజుడు. గణము రాక్షస. జంతువు పులి. వృక్షము తాటి చెట్టు. రాశ్యధిపతులు బుధుడు, శుక్రుడు. అధిదేవత త్వష్ట. చిత్తానక్షత్రము నవాంశ విషయానికి వస్తే.. మొదటి పాదము - సింహరాశి, రెండవ పాదము - కన్యారాశి, మూడవ పాదము - తులారాశి, నాలుగవ పాదము - వృశ్చికరాశిలో ఉంటాయి.

చిత్త నక్షత్రము మొదటి పాదము

చిత్తా నక్షత్ర అధిపతి కుజుడు. వీరు రాక్షసగణ ప్రధానులు. ఆవేశం, అతిశయం, పట్టుదల, మొండితనం వీరి లక్షణాలు. ఈ జాతకులకు ఆరు సంవత్సరాలకు రాహుదశ వస్తుంది.. కనుక 18 సంవత్సరాల రాహుదశ కాలంలో విద్యలో ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయత్న పూర్వకంగా విద్యలో విజయం సాధించాలి. రాహుదశలో ఉన్న ఉరుకు దూరంగా విద్యాభ్యాసం చేసే అవకాశాలు అధికం. 24 సంవత్సరాలకు గురుదశ వస్తుంది కనుక జీవితంలో త్వరగా స్థిరపడతారు. సకాలంలో వివాహం జరుగుతుంది. సంపాదించినది జాగ్రత్తగా కాపాడుకోవాలి. లేకుంటే 40 సంవత్సరాలకు వచ్చే 19 సంవత్సరాల శనిదశలో ఖర్చులు అధికమవుతాయి. 59 సంవత్సరాలకు వచ్చే 17 సంవత్సరాల బుధ దశ తరువాత కొంత ఉపశమనం ఉంటుంది. మిగిలిన జీవితం సాఫీగా కొనసాగుతుంది.
ఇక వీరికి విద్యుత్, అగ్ని, భూ సంబంధిత ప్రభుత్వ ఉద్యోగాలు అనుకూలంగా ఉంటాయి. యునియన్ లీడర్లుగా ఉండడమంటే వీరు ఆసక్తి. కార్య సాధకులుగా ఉంటారు. అధికారులుగా రాణించడానికి అవకాశాలు ఉంటాయి. నిర్వహణ సామర్ధ్యం కూడా అధికమే.

చిత్త నక్షత్రము రెండవ పాదము

చిత్తా నక్షత్ర రెండవ పాదము వీరు ఆవేశం, పట్టుదల వీరికి అత్యధికం. నాలుగు సంవత్సరాలకు రాహుదశ వస్తుంది కనుక 18 సంవత్సరాల రాహుదశ కాలంలో విద్యలో ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయత్నపూర్వకంగా విద్యలో విజయం సాధించాలి. రాహు దశలో ఉన్న సొంత ఊరుకు దూరంగా విద్యాభ్యాసం చేసే అవకాశాలు అధికం. 22 సంవత్సరాలకు గురుదశ వస్తుంది కనుక జీవితంలో త్వరగా స్థిరపడతారు. సకాలంలో వివాహం జరుగుతుంది. సంపాదించినది జాగ్రత్తగా పోది చేసుకోవాలి. లేదంటే 38 సంవత్సరాలకు వచ్చే శని దశ కాలంలో ఖర్చులు అధికమవుతాయి. దీంతో ఇబ్బందులకు లోనయ్యే అవకాశం ఉంది. 57 సంవత్సరాలకు వచ్చే 17 సంవత్సరాల బుధదశ తరువాత కొంత ఉపశమనం ఉంటుంది మిగిలిన జీవితం సాఫీగా జరుగుతుంది.

ఇక ఈ నక్షత్ర జాతకులకు భూ సంబంధిత వృత్తులు, వ్యాపారాలు, ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి. రియల్ ఎస్టేట్ వ్యాపారం వీరికి అనుకులిస్తుంది. వీరు మేధావంతులు, ఆవేశపూరితులుగా ఉంటారు. కనుక సైనిక పరమైన వృత్తులు వీరికి అనుకూలిస్తాయి.

చిత్త నక్షత్రము మూడవ పాదము

చిత్త నక్షత్ర మూడవ పాదము వీరు వీర విద్యలు నేర్చుకోవడంలో ఆసక్తి చూపిస్తారు. అంతేకాదు కళా రంగంలో ప్రవేశించే అవకాశం ఉంది. స్టంట్ ఆర్టిస్ట్ స్థిరపడే అవకాశాలు ఉన్నాయి. వీరు విద్యా శిక్షకులుగా రాణించగల అవకాశం ఉంది. వీరికి పట్టుదల అధికం. ధైర్య సాహసాలతో కూడిన ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి. 3 సంవత్సరాలకు రాహు దశ వస్తుంది. కనుక 18 సంవత్సరాల రాహుదశ కాలంలో విద్యలో ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయత్న పూర్వకంగా విద్యలో విజయం సాధించాలి.

వీరికి కూడా రాహుదశలో సొంత ఊరికి దూరంగా విద్యాభ్యాసం చేసే అవకాశాలున్నాయి. 21 సంవత్సరాలకు గురు దశ వస్తుంది. కనుక జీవితంలో త్వరగా స్థిరపడతారు. సకాలంలో వివాహం అవుతుంది. సంపాదించినది దాచుకోవాల్సిన అవసరం ఎంతో ఉంది. లేకుంటే 37 సంవత్సరాలకు వచ్చే శనిదశ లో ఖర్చులు అధికమవుతాయి. ఈ కారణాల వల్ల ఇబ్బందులకు లోనయ్యే అవకాశం ఉంది. 56 సంవత్సరాలకు వచ్చే 17 సంవత్సరాల బుధ దశ తరువాత కొంత ఉపశమనం ఉంటుంది మిగిలిన జీవితం సుఖంగా సాగుతుంది.

చిత్త నక్షత్ర నాలువ పాదము

వీరు రాక్షసగణ ప్రధానులు. విరు ఆవేశాన్ని అదుపులో పెట్టుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది. వీరు సైనిక పరమైన ఉద్యోగాలమతే బాగా రాణించగల అవకాశం బాగా ఉంది. భూ సంబంధిత సంబంధిత వృత్తులు, వ్యాపారాలు, ఉద్యోగాలు వీరికి అత్యధికంగా అనుకూలిస్తాయి. ధైర్య సాహసాలు వీరికి అధికమే. మొదటి ఏడాది తరువాత రాహుదశ వస్తుంది కనుక 18 సంవత్సరాల రాహుదశ కాలంలో విద్యలో ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయత్న పూర్వకంగా విద్యలో విజయం సాధించాలి.

19 సంవత్సరాలకు గురుదశ వస్తుంది కనుక జీవితంలో త్వరగా స్థిరపడతారు. సకాలంలో వివాహం జరుగుతుంది. సంపాదించినది జాగ్రత్తగా దాచుకోవాల్సిన పరిస్థితి. లేకుంటే 36 సంవత్సరాలకు వచ్చే శని దశలో ఖర్చులు

అధికమవుతాయి కనుక ఇబ్బందులకు లోనయ్యే అవకాశం ఉంది. 55 సంవత్సరాలకు వచ్చే 17 సంవత్సరాల బుధ దశ తరువాత కొంత ఉపశమనం ఉంటుంది. మిగిలిన జీవితం సాఫీగా సాగిపోతుంది.

చిత్త నక్షత్రము జాతకుల గుణగణాలు:
కుజ గ్రహాధిపత్య నక్షత్రమైన చిత్త నక్షత్రంలో జన్మించిన జాతకులు తాము పట్టిన కుందేలుకు మూడే కాళ్లు అనే తరహా. తన నిర్ణయమే సరైనదని వాదిస్తారు. ఇతరుల ద్వారా సహాయంను పొందే వీరు.. ఇతరులకు సహాయం చేసే విషయంలో మాత్రం వెనుకడుగు వేస్తారు. ప్రయోజనము లేని చర్చలు, కోపతాపాలు జీవితంలో చేదు అనుభవాలకు దారి తీస్తాయి. తాను చేసిన సహాయాన్ని భూతద్దంలో చూపించేందుకు ప్రతిసారి ప్రయత్నిస్తారు. భార్య, లేక ఓ స్త్రీ సహకారం లేనిదే జీవితంలో రాణించలేరు.

స్థిరాస్థులు వంశపారంపర్యంగా లభించినా.. సొంతంగా అంతకంటే ఎక్కువ కూడబెడతారు. రాజకీయంలో ప్రవేశిస్తే ఉన్నత పదవులను అలంకరించవచ్చే అవకాశం. అంతేకాకుండా సాంకేతిక, వైద్య రంగాల్లో ఆర్థిక పరమైన వ్యాపారాల్లో మంచి పట్టు సాధిస్తారు. మంచి సలహాదారులు చెంతనే ఉండటం ద్వారా అధిక లాభాలు పొందుతారు.
ఇక ఈ నక్షత్రంలో జన్మించిన మహిళలు కారణాలు లేకుండా ఆవేశానికి గురవుతారు. ఇతరులు తప్పు చేస్తే వారు ఎంత ఉన్నత స్థాయిలో ఉన్నా ప్రశ్నించడానికి ఏ మాత్రం వెనుకాడరు. అలాగే చిత్తా నక్షత్రంలో జన్మించిన మహిళా జాతకులు మధ్య వయస్సు వరకు సుఖ భోగాలను అనుభవిస్తారు. ఆ తర్వాత ఈ జాతకులకు మితమైన భోగభాగ్యాలు చేకూరుతాయి.

***స్వాతి నక్షత్రం - గుణగణాలు, ఫలితాలు***

నక్షత్రములలో స్వాతి నక్షత్రము 15వది. స్వాతి నక్షత్రాధిపతి రాహువు. రాజ్యాధిపతి శుక్రుడు, నక్షత్రాధిపతి రాహువు, ఆధిదేవత వాయువు, జంతువు మహిషము, జాతి పురుష, దేవగణాధిపతి(దేవగణము) ఇంద్రుడు.

స్వాతి నక్షత్రము మొదటి పాదము
స్వాతి నక్షత్ర అధిపతి రాహువు. దేవగణ ప్రధానులు కాబట్టి వీరు సాత్విక ప్రవృత్తి  కలిగి ఉంటారు. వీరి మీద గురు రాహు గ్రహ ప్రభావం ఉంటుంది. ఈ నక్షత్ర జాతకులు ముఖ్యంగా రచయితలు కావడానికి అవకాశం ఉంది. ఆధ్యాత్మిక గ్రంధ రచన చేసే అవకాశం కూడా కలదు. ఉపాధ్యాయులుగా మరే అవకాశం కూడా లేకపోలేదు.

ఈ నక్షత్ర జాతకులు రాహుదశలో జన్మించడంవల్ల కొన్ని సమస్యలు ఎదురైనా తల్లితండ్రుల చాటున కష్టం తెలియకుండా సాగిపోతుంది. వీరికి హైస్కులు తరువాత గురు దశ కాలంలో కాలేజి విద్యలో అభివృద్ధి కనిపిస్తుంది. 16 సంవత్సరాలకే గురు దశ వస్తుంది కనుక సౌఖ్యవంతమైన జీవితం మొదలవుతుంది. విద్యలో చక్కని అభివృద్ధి సాధించి ఉద్యోగాలలో స్థిరపడతారు. ఇక సకాలంలోనే వివాహం జరుగుతుంది. సంపాదించినది దాచుకోవాల్సిన అవసరం వీరికి అత్యవసరం. లేకుంటే 32 సంవత్సరాలకు వచ్చే 19 సంవత్సరాల శని దశలో ఖర్చులు అధికమవుతాయి. దీంతో అనేక ఇబ్బందులకు గురవుతారు. 51 సంవత్సరాలకు వచ్చే 17 సంవత్సరాల బుధదశ కాలంలో కొంత ఉపశమనం ఉంటుంది. ఇక మిగిలిన జీవితం సాఫీగా సాగిపోతుంది.

స్వాతి నక్షత్రము రెండవ పాదము

స్వాతి నక్షత్రము దేవగణ ప్రధానులు కనుక రెండో పాదములోని జన్మనక్షత్రలు సాత్విక ప్రవృత్తి కలిగి ఉంటారు. వీరి మీద శని రాహు గ్రహ ప్రభావం ఉంటుంది. వీరికి బద్ధకం కొంచం ఎక్కువ. అయినప్పటికీ పని ఆరంభించారంటే బాగా శ్రమించి పని పూర్తి చేస్తారు. పరిసరాలను అంతగా పట్టించుకోరు.

వీరికి రాహుదశ దాదాపు 11 సంవత్సరాల కాలం ఉంటుంది. కనుక రాహుదశ కాలంలో చదువులో మందకొడితనం కొనసాగుతుంది. అయినప్పటికీ తరువాత వచ్చే 16 సంవత్సరాల గురుదశ కాలంలో చదువులో అభివృద్ధి ఉంటుంది. జీవితంలో త్వరగా స్థిరపడతారు. సకాలంలో వివాహం జరుగుతుంది. 27 సంవత్సరాల నుండి ఉండే 19 సంవత్సరాల శనిదశ కాలంలో ఆదాయం కంటే ఖర్చులు అధికంగా ఉంటాయి కనుక సంపాదించుకున్నది జాగ్రత్త చేసుకోవలసిన అవసరం ఎంతో ఉంది. 46 సంవత్సరాల తరువాత 17 సంవత్సరాల బుధ దశ కాలంలో పరిస్థితులు కొంచం కుదుట పడతాయి. తర్వాత 63 సంవత్సరాల తరువాత వచ్చే కేతుదశలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతువు అనుకూలంగా ఉంటే విదేశీయానం అనుకులిస్తుంది. ఇక వృద్ధాప్యం సౌఖ్యంగా సాగుతుంది.

వీరికి కర్మాగారాలు, పరిశ్రమలు స్థాపించి నిర్వహించగల సామర్ధ్యం ఉంటుంది. కర్మాగారాలలో, పరిశ్రమలలో వృత్తి, ఉద్యోగం, వ్యాపారం వీరికి అనుకూలిస్తాయి. అయితే వీరు దత్తు పోయే అవకాశం ఉంది. ఇతరుల గృహాలలో వీరు ఆదరాభిమానాలు పొందగలరు.

స్వాతి నక్షత్రము మూడవ పాదము

వీరు సాత్విక ప్రవృత్తి కలిగి ఉంటారు. వీరి మీద గురు రాహు గ్రహ ప్రభావం ఉంటుంది. అయినప్పటికీ పని మొదలు పెట్టారంటే బాగా శ్రమించి పని చేస్తారు. పరిసరాలను అంతగా పట్టించుకోరు. కర్మాగారాలు, పరిశ్రమలు స్థాపించి నిర్వహించగలరు. కర్మాగారాలలో, పరిశ్రమలలో వృత్తి, ఉద్యోగం, వ్యాపారం వీరికి అనుకూలిస్తాయి. వీరికి పట్టుదల అధికంగా ఉంటుంది. స్థిరమైన అభిప్రాయలు ఉంటాయి. వీరు దత్తు పోవడానికి అవకాశం ఉంది. ఇతరుల గృహాలలో వీరు ఆదరాభిమానాలు పొందగలరు.

వీరికి రాహుదశ దాదాపు 7 సంవత్సరాల కాలం ఉంటుంది. కనుక ఆరంభంలో రాహుదశ కాలంలో చదువులో మందకొడితనం కొనసాగుతుంది. అయినప్పటికీ తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో చదువులో అభివృద్ధి ఉంటుంది. జీవితంలో త్వరగా స్థిరపడతారు. వివాహంలో జాప్యం జరుగుతుంది. 23 సంవత్సరాల నుంచి ఉండే 19 సంవత్సరాల శనిదశ కాలంలో ఆదాయం కంటే ఖర్చులు అధికంగా ఉంటాయి. 42 సంవత్సరాల తరువాత 17 సంవత్సరాల బుధ దశ కాలంలో పరిస్థితులు కాస్త కుదుటపడతాయి. తరువాత 59 సంవత్సరాల తరువాత వచ్చే 7 సంవత్సరాల కేతుదశలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతువు అనుకూలంగా ఉంటే విదేశీయానం ఉంటుంది. 66 సంవత్సరాల తరువాత పరిస్థితులు చక్కబడతాయి. వృద్ధాప్య దశ కూడా సాఫీగా సాగిపోతుంది.

స్వాతి నక్షత్రము నాలుగవ పాదము

వీరు సాత్విక ప్రవృత్తి  కలిగి  వీరి మీద గురు రాహు గ్రహ ప్రభావం ఉంటుంది. వీరు కూడా రచయితలు అయ్యే అవకాశం కలదు. ఆధ్యాత్మిక గ్రంధ రచన చేసే అవకాశం ఉంది. ఉపాధ్యాయులుగా పని చేసే అవకాశం కూడా ఉండవచ్చు. వీరు దత్తు పోవడానికి అవకాశం ఉంది. ఇతరుల గృహాలలో వీరు ఆదరాభిమానాలు పొందగలరు.

ఈ నక్షత్ర జాతకులకు రాహుదశ దాదాపు మూడు సంవత్సరాల కాలం ఉంటుంది. చదువు నిరాటంకంగా కొనసాగుతుంది. 16 సంవత్సరాల గురుదశ కాలంలో చదువులో అభివృద్ధి ఉంటుంది. ఉన్నత చదువులలో కొంత మందకొడితనం ఉంటుంది. ప్రయత్నంతో విజయం సాధించ వచ్చు. జీవితంలో త్వరగా స్థిరపడతారు. వివాహం జాప్యం జరుగుతుంది. 19 సంవత్సరాల నుంచి 19 సంవత్సరాల శని దశ కాలం ఉంటుంది.. కాబట్టి ఆ సమయంలో ఆదాయం కంటే ఖర్చులు అధికంగా ఉంటాయి. 38 సంవత్సరాల తరువాత 17 సంవత్సరాల బుధ దశ కాలంలో పరిస్థితులు కాస్త కుదుటపడతాయి. తరువాత 55 సంవత్సరాల తరువాత వచ్చే ఏడు సంవత్సరాల కేతు దశలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతువు అనుకూలంగా ఉంటే విదేశీయానం ఉంటుంది. 62 సంవత్సరాల తరువాత పరిస్థితులు చక్కబడతాయి. వృద్ధాప్యం సౌఖ్యంగా సాగిపోతుంది.

స్వాతి నక్షత్ర జాతకుల గుణగణాలు

రాహుగ్రహ అధిదేవత నక్షత్రమైన స్వాతి నక్షత్రంలో జన్మించిన జాతకులు ముఖ్యంగా పరిశోధకులుగా రాణిస్తారు. బుద్ధికుశలతలతో పలు రంగాల్లో ఉన్నత అధికారులుగా విధులు నిర్వహిస్తారు. ఈ నక్షత్రంలో జన్మించిన వాళ్ళు రాహు ప్రభావంతో కల్పనా శక్తి శుక్ర ప్రభావంతో సౌందర్య ఆరాధనాశక్తి కలిగి కళారంగంలో ప్రభావం చూపగలిగి ఉంటారు. శాస్త్రవెత్తలుగా, అధికారులుగా, మేధావులుగా రాణిస్తారు. స్వాతి నక్షత్రం దేవగణం కనుక ధార్మికత, సాత్విక గుణం కలిగి ప్రవర్తిస్తారు. శుక్రుడి ప్రభావ కారణము వల్ల కళలను ఆరాధిస్తారు.

ఈ నక్షత్ర జాతకులు సాహిత్యాన్ని, సంగీతాన్ని, సౌందర్యాన్ని ఆరాధించే మనస్తత్వాన్ని కలిగి ఉంటారు. ఆకస్మిక రాజకీయ జీవితం, ఉద్యోగం, విద్య, ఆర్థిక రంగంలో అత్యధిక అభివృద్ధి చెందుతారు. ప్రతి రంగంలోనూ స్వయం కృషి మంచి అభివృద్ధినిస్తుంది. సినిమా రంగంతో కూడిన ఏ కళారంగంలోనైనా ప్రవేశం రాణింపునిస్తుంది.

నమ్మిన వారి చెంత విశ్వాసంతో ప్రవర్తిస్తారు. అంతర్గత, బహిర్గత శత్రువులు వీరికి అధికంగా ఉంటారు. అంతేకాకుండా కొన్ని ఆరోపణలను కూడా ఎదుర్కొనే అవకాశం ఉంటుంది. వాటిలో ఏ మాత్రం సత్యముండదు. అంతేకాదు ఇతరులకు దానం చేయడంలో ముందు వరుసలో ఉండే ఈ జాతకులు సామాజిక స్పృహ కలిగి ఉంటారు. ఆర్థికంగా ముందడుగు వేయడంతో పాటు, కీర్తి ప్రతిష్టలు సంపాదించడాన్నే లక్ష్యంగా భావిస్తారు. కొన్ని విషయాల్లో సామాజిక విలువల్ని పట్టించుకోరు. ఈ లక్షణంతో ఈ జాతకుల నుంచి బంధువులు, సన్నిహితులు దూరమయ్యే అవకాశం లేకపోలేదు. జల కారకుడైన శుక్రుడి ప్రభావితం వల్ల ఈ జాతకులకు విదేశీ యానం, విదేశీ ధనార్జన కలిగిస్తుంది.

ఇక ఈ జాతకులు అడపాదడపా ఎదురయ్యే సమస్యల నుంచి బయటపడాలంటే ప్రతి సోమవారం రాహుగ్రహ శాంతికి నవగ్రహ ప్రదక్షిణ చేయడం మంచిది. నవగ్రహ ప్రదక్షిణతో పాటు ఐదుగురికి అన్నదానం చేయడం ద్వారా అనుకున్న కార్యాలు విజయవంతంగా పూర్తవుతాయి.

***విశాఖ నక్షత్రము -గుణగణాలు, ఫలితాలు***

నక్షత్రములలో ఇది 16వ నక్షత్రము. ఇది గురు గ్రహ నక్షత్రము, రాక్షస గణము, అధిదేవతలు, ఇంద్రుడు, అగ్ని. జంతువు పులి, రాజ్యాధిపతి కుజుడు. గురు దశతో జీవితం ఆరంభం అవుతుంది.

విశాఖ నక్షత్ర మొదటి పాదము

విశాఖ నక్షత్ర అధిపతి గురువు. విశాఖ రాక్షసగణ నక్షత్రం కనుక వీరు పట్టుదల గల వ్యక్తులై ఉంటారు. వీరు ఆవేశపూరిత స్వభావం కలిగి ఉంటారు. వీరు ధర్మపక్షపాతం కలిగి ఉంటారు. ఆధ్యాత్మిక చింతన కూడా ఉంటుంది.

ఇక విద్యాభ్యాసం కొంత వరకు బాగానే సాగుతుంది. కళాశాల చదువులలో కాస్త మందకొడితనం నెలకొంటుంది. ప్రయత్నపూర్వకంగా విజయం సాధించవలసిన అవసరం ఉంది. 14 సంవత్సరాల వయసు వరకు సౌఖ్యంగా జీవితం గడుస్తుంది. తల్లిదండ్రుల ఆదరాభిమానాలకు పాత్రులవుతారు. తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కారణంగా సుఖం కాస్త తగ్గవచ్చు. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో కాస్త జాప్యం కలుగే అవకాశం ఉంది. సంపాదించినా దానికంటే ఖర్చులు అధికంగా ఉంటాయి. కనుక ఈ విషయంలో జాగ్రత్త అవసరం. స్థిరాస్తులు ఏర్పరచు కోవడం జీవితకాలం సహకరిస్తుంది.

ఉపాధ్యాయ వంటి వృత్తులు వీరికి అనుకూలం. అలాగే విద్యుత్, అగ్ని భూ సంబంధిత ఉద్యోగాలు వీరికి అనుకూలంగా ఉంటాయి.

33 సంవత్సరాలకు వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపశమనం కలుగుతుంది. 50 సంవత్సరాల నుంచి 7 సంవత్సరాల కేతు దశ కారణంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటన అనుకులిస్తుంది. తీర్థ యాత్రలకు ఇది అనుకూల సమయం. 57 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కారణంగా జీవితంలో తిరిగి సుఖం నెలకొంటుంది. మిగిలిన జీవితం సౌఖ్యంగా కొనసాగుతుంది.

విశాఖ నక్షత్ర రెండవ పాదము

ఈ జాతకులు పట్టుదల గల వ్యక్తులై ఉంటారు. వీరు ధర్మపక్షపాతం కలిగి ఉంటారు. స్థిరమైన అభిప్రాయాలు కల్గి ఉంటారు. నిర్వహణ సామర్ధ్యం అధికంగా ఉంటుంది. ఆపాధ్యాయులు రంగ వృత్తులు వీరికి అనుకూలిస్తాయి. ఆధ్యాత్మిక గురువులుగా కూడా వీరు రాణించగలరు. ఆధ్యాత్మిక విశ్వాసం అధికంగా ఉంటుంది. పసుపు వర్ణ వస్తువులు, శ్వేత వర్ణ వస్తువులకు సంబంధించిన, జలసంబంధిత వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు అనుకూలిస్తాయి.

విద్యా ఆరంభ దశలో బాగానే ఉంటుంది. మాధ్యమిక విద్యాకాలంలో విద్యలో మందకొడితనం నెలకొంటుంది. ప్రయత్న పూర్వకంగా విజయం సాధించవలసిన అవసరం ఉంది. పదేళ్ల వయసు వరకు జీవితం సాఫీగా గడుస్తుంది. తల్లిదండ్రుల ఆదరాభిమానాలకు పాత్రులవుతారు. తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కారణంగా కాస్త సుఖం తగ్గుతుంది. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో జాప్యం కలుగవచ్చు.

ఇక సంపాదించిన దానికంటే ఖర్చులు అధికంగా ఉంటాయి. కనుక జాగ్రత్త వహించాలి. స్థిరాస్తులు ఏర్పరచుకోవడం తరువాత వచ్చే జీవితకాలానికి సహకరిస్తుంది. 29 సంవత్సరాలకు వచ్చే 17 సంవత్సరాల బుధదశ కాలంలో కొంత ఉపశమనం కలుగుతుంది. 46 సంవత్సరాల నుంచి 7 సంవత్సరాల కేతుదశ కారణంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతుదశ అనుకూలిస్తే విదేశీ పర్యటన అనుకూలిస్తుంది. తీర్ధ యాత్రలకు ఇది అనుకూల సమయం. 53 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కారణంగా జీవితంలో తిరిగి సుఖం నెలకొంటుంది. మిగిలిన జీవితం సౌఖ్యంగా కొనసాగుతుంది.

విశాఖ నక్షత్ర మూడవ పాదము

వీరికి పనుల యందు పట్టుదల ఉంటుంది. కార్య నిర్వహణ సామర్ధ్యం అధికంగా ఉంటుంది. వీరు ధర్మపక్షపాతం కలిగి ఉంటారు. విచక్షణా జ్ఞానం అధికంగా ఉంటుంది. వీరికి వ్యాపారం అంటే ఇష్టం. వీరు విద్యా సంస్థలను స్థాపించి నిర్వహించాలన్న ఆసక్తి కలిగి ఉంటారు. మేధా సంబంధిత, విద్యా సంబంధిత, భూ సంబంధిత ఉద్యోగం, వ్యాపారం, వృత్తులు వీరికి అనుకూలిస్తాయి.

ఈ నక్షత్ర జాతకులకు తొలి నుంచి విద్య మందకొడిగా ఆరంభమవుతుంది. పట్టుదలతో విజయం సాధించాల్సి ఉంటుంది. 6 సంవత్సరాల వయసు వరకు జీవితం సుఖంగా గడుస్తుంది. తల్లిదండ్రుల ఆదరాభిమానాలకు పాత్రులవుతారు. తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కారణంగా కాస్త సుఖం తగ్గుతుంది. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. 25 సంవత్సరాలకు వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కారణంగా జీవితం సాఫీగా సాగుతుంది. సకాలంలోనే వైవాహిక జీవితంలోకి అడుగుపెడతారు. 42 సంవత్సరాల నుంచి 7 సంవత్సరాల కేతు దశ కారణంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలిస్తే విదేశీపర్యటన అనుకూలిస్తుంది. తీర్ధ యాత్రలకు ఇది అనుకూల సమయం. 49 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కారణంగా జీవితంలో తిరిగి సుఖం నెలకొంటుంది. ఇక మిగిలిన జీవితం సౌఖ్యంగా కొనసాగుతుంది.

విశాఖ నక్షత్ర నాలుగవ పాదము

వీరు ధర్మపక్షపాతం కలిగి ఉంటారు. నిర్వహణ సామర్ధ్యం అధికంగా ఉంటుంది. ఆధ్యాత్మిక విషయాలలో కూడా వీరికి ఆసక్తి మెండు. కోపతాపాలు, ప్రేమాభిమానాలు మార్చిమార్చి ప్రదర్శిస్తారు. ఉపాధ్యాయ రంగ వృత్తులు వీరికి అనుకూలం. ఔషధ సంబంధిత, శ్వేత వర్ణ సంబంధిత వస్తువుల వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు వీరికి అనుకూలిస్తాయి. తల్లిదండ్రుల ఆదరాభిమానాలకు పాత్రులవుతారు.

జన్మించిన తర్వాత కొంత కాలం మాత్రమే సౌఖ్యంగా ఉంటారు. తరువాత కొంత సుఖం తగ్గుతుంది. ఆరు సంవత్సరాల వయసు వరకు సౌఖ్యంగా జీవితం గడుస్తుంది. 2 తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కారణంగా కాస్త సుఖం తగ్గుతుంది. విద్యాభ్యాసం మందకొడిగా సాగుతుంది. 21 సంవత్సరాలకు వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కారణంగా జీవితం ఉన్నత విద్యలో అభివృద్ధి ఉంటుంది. సకాలంలో వివాహం జరుగుతుంది. 38 సంవత్సరాల నుంచి 7 సంవత్సరాల కేతు దశ కారణంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటన ఉంటుంది. తీర్ధ యాత్రలకు ఇది అనుకూల సమయం. 45 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కారణంగా జీవితంలో తిరిగి సుఖం నెలకొంటుంది. మిగిలిన జీవితం సాఫీగా సాగిపోతుంది.

విశాఖ నక్షత్రము గుణగణాలు - ఫలితాలు

ఈ నక్షత్ర జాతకులకు గురు దశతో జీవితం ఆరంభం అవుతుంది. కాబట్టి బాల్యం సుఖంగానే ఆరంభమవుతుంది. తల్లిదండ్రులు కుటుంబ సభ్యుల మధ్య గారాబంగా జీవితం మొదలవుతుంది. గురు గ్రహ నక్షత్రమైన విశాఖలో జన్మించిన ఈ జాతకులకు పట్టుదల, మొండితనం ఉంటుంది. అనుకున్నది అమలు చేసే మనస్తత్వం.

భార్య లేక ఓ స్త్రీ సహాయము లేనిదే వీరు రాణించలేరు. వైద్య, వ్యాపార, సాంకేతిక రంగాలలో, అర్ధికపరమైన వ్యాపారాలలో పట్టు సాధిస్తారు. రాజకియ ప్రవేశము చేస్తే ఉన్నత పదవులు వస్తాయి. మంచి సలహాదారుల వలన ప్రయోజనాలు ఉంటాయి. వంశాపారంపర్య ఆస్తులు సంక్రమిస్తాయి. సొంతంగా అంతకంటే అధికమైన ఆస్తులు సంపాదిస్తారు. సంతానం వల్ల ఖ్యాతి లభిస్తుంది. అన్యభాషలు నేర్చుకునే ప్రయత్నం చేస్తారు. శాస్త్ర సాంకేతిక రంగం ఆధారంగా ఇతర రంగాలలో ప్రవేశించి ఆ రంగములో కూడా విజయం సాధించి ప్రాముఖ్యత సాధిస్తారు. చదివిన చదువుకు చేసే ఉద్యోగానికి సంబంధం ఉండదు.

ఇక ఉద్యోగములో బదిలీలు పొంచి ఉంటాయి. అవినీతి ఆరోపణలకు ఆస్కారమూ లేకపోలేదు. రాజకీయ నాయకులతో జాగ్రత్తగా వ్యవహరించాల్సి ఉంటుంది. వారి వలన నష్టము, లాభము సమానంగా ఉంటాయి. కఠినమైన మనస్తత్వం ఉంటుంది. విదేశీ పౌరసత్వము లభిస్తుంది. జీవితంలో కనీస అవసరాలను తీర్చుకుంటారు. భయము, పొదుపు, జాగ్రత్త, విజ్ఞానము జివితములో సమపాళ్ళలో ఉంటాయి. 50 సంవత్సరాల అనంతరము జీవితం సుఖవంతం. కనుక కనుక వృద్ధాప్యము సుఖవంతమే.

విశాఖ నక్షత్రము 1, 2, 3 పాదాల్లో జన్మించిన జాతకులకు నీలం రంగు అన్ని విధాలా అనుకూలం. కాబట్టి నీలపు రంగు చేతి రుమాలును అధికంగా వాడటం మంచిది. అలాగే విశాఖ నక్షత్ర జాతకులకు 6 సంఖ్య అన్ని విధాలా సహకరిస్తుంది. అలాగే 4, 5, 8 అనే సంఖ్యలు కూడా శుభ ఫలితాలనిస్తాయి. అయితే 1, 2 అనే సంఖ్యలు ఏ మాత్రం కలిసి రావు. ఇక గురువారం తలపెట్టే కార్యాలు ఈ జాతకులకు దిగ్విజయంగా పూర్తవుతాయి.

విశాఖ నక్షత్రము నాలుగో పాదంలో పుట్టిన జాతకులకు మంగళవారం, సోమవారం, బుధవారం అన్ని విధాలా కలిసొస్తుంది. అయితే చంద్రాష్టమందినాల్లో ఈ జాతకులు ఎలాంటి శుభకార్యాలను ప్రారంభించకూడదదు. నాలుగో పాదంలో జన్మించిన జాతకులకు 9 అదృష్ట సంఖ్య. ఇంకా 9, 18, 36 అనే సంఖ్యలు శుభ ఫలితాలనిస్తాయి. అయితే 6, 8 సామాన్య ఫలితాలనివ్వగా, 4, 5, 6, అనే సంఖ్యలు వీరికి అశుభ ఫలితాలిస్తాయి. ఇక పసుపు, ముదురు పచ్చ రంగు వీరికి అదృష్టానిస్తాయి.

ఇక ఈ నక్షత్ర జాతకులు వ్యాపారాభివృద్ధి కోసం ప్రతి శుక్రవారం నేతితో సుబ్రహ్మణ్య స్వామికి దీపమెలిగించడం మంచిది. ఇలా 9 వారాలు ఆలయాల్లో సుబ్రహ్మణ్యేశ్వరునికి దీపమెలిగిస్తే అనుకున్న కార్యాలు ఫలప్రదమవుతాయి.

***అనురాధ నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు***

నక్షత్రములలో 17వది అనురాధ నక్షత్రము. అనురాధ నక్షత్రాధిపతి శని, ఆధిదేవతలు సూర్యుడు, రాజ్యాధిపతి కుజుడు, ఇది దేవగణ నక్షత్రము, జంతువు మహిషి, రత్నం గోమేధికం.

అనురాధ నక్షత్ర మొదటి పాదము

అనురాధ నక్షత్ర అధిపతి శని. ఇది దేవగణ నక్షత్రం కావడం వల్ల వీరు సాత్విక గుణం, ధర్మ పక్షపాతం కలిగి ఉంటారు. ఈ నక్షత్ర జాతకులకు స్వభావ రీత్యా బద్ధకం ఉన్నా చేయాలనుకున్న పనిని శ్రమకు ఓర్చి పనిచేస్తారు. అన్యాయాన్ని సహించలేరు. మంచిపే అయిన తమ అభిప్రాయాలను సూటిగా తెలియజేస్తారు. తండ్రితో అభిప్రాయభేదాలు కలుగ వచ్చు. తల్లితో ఏకీభవిస్తారు. వీరికి ఆత్మవిశ్వాసం ఎక్కువ.

ఈ నక్షత్ర జాతకులకు తొలి 17 సంవత్సరాల జీవితం సాధారణంగానే జరుగుతుంది. విద్యలో కాస్త మందకొడితనం ఉంటుంది. తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధద శ కారణంగా కళాశాల చదువులలో అభివృద్ధి ఉంటుంది. జీవితంలో త్వరగా స్థిరపడతారు. వివాహం సకాలంలో జరుగుతుంది. 34 సంవత్సరాల అనంతరం వచ్చే 7 సంవత్సరాల కేతు దశ కారణంగా జీవితంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలిస్తే విదేశీ ఉద్యోగాలు అనుకూలిస్తాయి. 41 సంవత్సరాల కాలంలో వచ్చే శుక్ర దశ కారణంగా జీవితంలో అభివృద్ధి ఉంటుంది. జీవితం సౌఖ్యంగా జరుగుతుంది. మిగిలిన జీవితం సాఫీగా జరుగుతుంది.

వీరికి ప్రభుత్వపరమైన కర్మాగారాలు, పరిశ్రమలలో పని చేసే అవకాశాలు ఉంటాయి. అగ్ని సంబంధిత, వాయు సంబంధిత ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి.

అనురాధ నక్షత్ర రెండవ పాదము

వీరు సాత్విక గుణం, ధర్మ పక్షపాతం కలిగి ఉంటారు. వీరికి బద్ధకం ఉన్నా చేయాలనుకున్న పనిని శ్రమకు ఓర్చి పనిచేస్తారు. అన్యాయాన్ని ప్రతిఘటిస్తారు. వీరికి మేధో సంబంధమైన వృ త్తి ఉద్యోగాలు అనుకూలిస్తాయి.

వీరికి బుధ దశ అనుకూలించడం వల్ల విద్యలో ఉన్నతిని సాధించగలరు. 13 సంవత్సరాల కాలం జీవితం సాధారణంగానే జరుగుతుంది. విద్యలో మందకొడితనం ఉంటుంది. తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కారణంగా మాధ్యమిక తరగతి నుంచి చదువులలో మంచి అభివృద్ధి ఉంటుంది. జీవితంలో తొందరగానే స్థిరపడతారు. వివాహం సకాలంలో జరుగుతుంది. 34 సంవత్సరాల అనంతరం వచ్చే 7 సంవత్సరాల కేతుదశ కారణంగా జీవితంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతుదశ అనుకూలిస్తే విదేశీ ఉద్యోగాలు అనుకూలిస్తాయి. 37 సంవత్సరాల కాలంలో వచ్చే శుక్ర దశ కారణంగా జీవితంలో అభివృద్ధి ఉంటుంది. ఆ తర్వాత జీవితం సౌఖ్యంగా, సాఫీగా కొనసాగుతుంది.

అనురాధ నక్షత్ర మూడవ పాదము

వీరు ప్రజాకర్షణ కలిగి ఉంటారు. తమ అభిప్రాయాలను సూటిగా, ఆకర్షణీయంగా చెప్పగలరు. కనుక సాత్విక గుణం, ధర్మ పక్షపాతం కలిగి ఉంటారు. వీరికి బద్ధకం ఉన్నా చేయాలనుకున్న పనిని శ్రమించి పూర్తి చేస్తారు. సమాజంలో జరిగే అన్యాయాన్ని సహించలేరు. కళాత్మకమైన వస్తువులను సేకరించడానికి ఆసక్తి కలిగి ఉంటారు. పరిశుభ్రమైన వాతావరణంలో ఉండడానికి ఆసక్తి కలిగి ఉంటారు.

వీరికి బుధ దశ బాగా అనుకులించడం వల్ల విద్యావంతులై ఉన్నత స్థితికి చేరుకుంటారు. 8 సంవత్సరాల వరకు మందకొడిగా సాగే విద్యాభ్యాసం తరువాత వచ్చే సంవత్సరాల 17 సంవత్సరాల బుధ దశ కాలంలో బాగా రాణిస్తుంది. కనుక వీరు ఉన్నత ఉద్యోగాలలో స్థిరపడతారు. 25 సంవత్సరాల తరువాత వచ్చే 7 సంవత్సరాల కేతు దశ కారణంగా

కొన్ని సమస్యలను ఎదుర్కొంటారు. కేతుదశ అనుకూలిస్తే విదేశీ ఉద్యోగ అవకాశాలు అనుకూలిస్తాయి. 32 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కారణంగా జీవితంలో చక్కని అభివృద్ధి ఉంటుంది. 75 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగిపోతుంది.

ఈ నక్షత్ర జాతకులకు ఇనుము, వెండి, ముత్యం సంబంధిత ఉద్యోగ వ్యాపారాలు అనుకూలం. పరిశ్రమలు, కర్మాగారం, విమానాశ్రయాలు.. వంటి వాటిలో పనిచేసే అవకాశాలు ఉంటాయి.

అనూరాధ నక్షత్రము నాలుగో పాదము

ఆరంభములో కొన్ని సమస్యలను ఎదుర్కొన్నా తరువాత కాలంలో నిరాటంకముగా విద్యలను అభ్యసిస్తారు. ఉద్యోగ జీవితములో మొదట ఒడిదుడుకులను ఎదుర్కొన్నా తరువాత నిలదొక్కుకుని ముందుకు విజయవంతంగా సాగిపోతారు.

4 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో బాగా రాణిస్తుంది. 21 సంవత్సరాల తరువాత వచ్చే 7 సంవత్సరాల కేతుదశ కారణంగా ఉన్నత విద్యాభ్యాసంలో కొన్ని సమస్యలను ఎదుర్కొంటారు. ప్రయత్న పూర్వకంగా విద్యలో విజయం సాధించవలసిన అవసరం ఉంది. కేతు దశ అనుకూలిస్తే విదేశీ విద్య, ఉద్యోగ అవకాశాలు అనుకూలిస్తాయి. 28 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కారణంగా జీవితంలో చక్కని అభివృద్ధి ఉంటుంది. 71 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగిపోతుంది.

అనురాధ నక్షత్రము గుణగణాలు

ఇది దేవగణ నక్షత్రము కావడం వల్ల ఈ నక్షత్ర జాతకులు సాత్విక గుణం, ధర్మ పక్షపాతం కలిగి ఉంటారు. పని పూర్తి చేయడంలో బద్ధకం ఉన్నా చేయాలనుకున్న పనిని శ్రమకు ఓర్చి పనిచేస్తారు. ప్రేమ వివాహాలు చేసుకుంటారు. గుర్తింపు పత్రాలు లేకున్నా కొన్ని ఇతర విద్యలలో పురోగతి సాధిస్తారు. విద్యలపట్ల ఆసక్తి కలిగి ఉంటారు. ఉన్నత విద్యలు అభ్యసించి ఉన్నత పదవులు అధిరోహిస్తారు.

పెద్దల ద్వారా స్వల్పంగా అయినా ఆస్తులు లభిస్తాయి. కుటుంబ శ్రేయస్సు కొరకు కొన్ని పదవులు చేపడతారు. కీలక సమయంలో బంధు వర్గం నుంచి నమ్మక ద్రోహం ఎదురవుతుంది. తండ్రి వ్యవహార తీరు నచ్చదు. తల్లి మీద విశేషమైన అనురాగం ఉంటుంది.

***జ్యేష్ఠ నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు***

నక్షత్రములలో ఇది 18వ నక్షత్రము. జ్యేష్టా నక్షత్రమునకు అధిపతి బుధుడు. ఇది రాక్షసగణ నక్షత్రము, అధిదేవత ఇంద్రుడు, జంతువు లేడి, స్త్రీ జాతి. జ్యేష్ఠ నక్షత్రము కలిగిన వధూవరులిద్దరూ జ్యేష్ఠులైనచో వారికి వివాహము నిశ్చయించరాదని శాస్త్రం చెబుతోంది.

జ్యేష్ఠ నక్షత్ర మొదటి పాదము

ఈ నక్షత్రము మీద గురు బుధ గ్రహ ఆధిక్యత ఉంటుంది. ఇది రాక్షసగణ నక్షత్రము. వీరికి పట్టుదల అధికం. వీరు మేధా సంపన్నులుగా ఉంటారు. అందువల్ల వీరికి మేధోసంబందిత వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు అనుకూలిస్తాయి. వీరు

విద్యాసంస్థలు స్థాపించి నిర్వహించగలరు. అధికార పదవులను సమర్ధవంతగా నిర్వహించగలరు. ఉన్నత స్థాయి ఉద్యోగావకాశాలు కూడా అందివస్తాయి.

14 సంవత్సరాల వరకు బుధ దశ ఉండటం వల్ల వీరు విద్యారంభం నుంచి విద్యలో ప్రతిభ చూపిస్తారు. తరువాత వచ్చే 7 సంవత్సరాల కేతు దశ కారణంగా విద్యలో అడ్డంకులు ఎదుర్కొంటారు. ప్రయత్నపూర్వకంగా వాటిని అధిగమించి విద్యలో విజయం సాధించాలి. కేతుదశ అనుకూలంగా ఉంటే ఆటంకాలు ఉండవు. 21 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కారణంగా కాస్త ఉపశమనం కలుగుతుంది. ఈ సమయంలో విద్య కంటే అలంకరణ, విలాసాల మీదకు మనసు మళ్లుతుంది కనుక మనసును ప్రయత్నపూర్వకంగా విద్యపైపు మళ్ళించి విజయం సాధించాలి. జీవితంలో త్వరగా స్థిరపడతారు. సకాలంలో వివాహం జరుగుతుంది.

41 సంవత్సరాల వరకు అభివృద్ధి బాగా కొనసాగుతుంది. సంపాదించినది జాగ్రత్త చేసుకోవాల్సిన అవసరం ఉంది. తరువాత కొంత సుఖం తగ్గినా 64 వయసు వరకు జీవితం సాఫీగా కొనసాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదురవ్వచ్చు. రాహు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు సాధ్యమవుతాయి.

జ్యేష్ఠ నక్షత్ర రెండవ పాదము

వీరికి పట్టుదల అధికం. వీరు శ్రమకు ఓర్చి పని చేయగలరు. బుద్ధి కుశలత కలిగి ఉంటారు. వీరికి వ్యాపారం అంటే కూడా ఇష్టమే. వీరికి పరిశ్రమలు, కర్మాగారాలు, మెకానిక్ షెడ్ వంటి ఉద్యోగ వ్యాపారాలు అనుకూలిస్తాయి. భూ సంబంధిత, విద్య సంబంధిత ఉద్యోగాలు కూడా అనుకూలిస్తాయి. న్యాయవాద వృత్తి వీరికి అనుకూలిస్తుంది. జీవితంలో ఉన్నత స్థాయికి చేరగల అవకాశాలు మెండుగా ఉంటాయి.

ఈ జాతకులకు పదేళ్ల వరకు బుధ దశ ఉంటుంది కాబట్టి విద్యారంభం బాగుంటుంది. తరువాత వచ్చే 7 సంవత్సరాల కేతు దశ కాలంలో కొన్ని అడ్డంకులు ఎదురవుతాయి. ప్రయత్నపూర్వకంగా వాటిని అధిగమించి విద్యలో విజయం సాధించాల్సి ఉంటుంది. కేతు దశ అనుకూలంగా ఉంటే ఆటంకాలు ఎదురుకావు. 17 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కారణంగా కొంత ఉపశమనం కలుగుతుంది. ఉన్నత విద్య సుగమంగా సాగుతుంది. ఈ సమయంలో విద్యకంటే అలంకరణ, విలాసాల మీద మనసు ఉంటుంది కనుక మనసును ప్రయత్నపూర్వకంగా విద్యపైపు మళ్ళించి విజయం సాధించాలి.

ఈ నక్షత్ర జాతకులు జీవితంలో త్వరగానే స్థిరపడతారు. సకాలంలో వివాహం అవుతుంది. 37 సంవత్సరాల వరకు అభివృద్ధి బాగా కొనసాగుతుంది. సంపాదించినది జాగ్రత్త చేసుకోవాల్సిన అవసరం ఉంది. తరువాత కొంత సుఖం తగ్గినా 60 వయసు వరకు జీవితం సాఫీగా కొనసాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కాలంలో కొన్ని సమస్యలు ఉండవచ్చు. రాహు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు సాధ్యమవుతాయి.

జ్యేష్ఠ నక్షత్ర మూడవ పాదము

వీరు తమ అభిప్రాయాలను అంత సులువుగా మార్చుకోరు. వీరికి వ్యాపారం అంటే కూడా ఆసక్తి అధికంగానే ఉంటుంది. వీరికి పరిశ్రమలు, కర్మాగారాలు, మెకానిక్ షెడ్ వంటి ఉద్యోగ వ్యాపారాలు అనుకూలిస్తాయి. భూ సంబంధిత, విద్య సంబంధిత ఉద్యోగాలు కూడా అనుకూలిస్తాయి. న్యాయవాద వృత్తి వీరికి అనుకులిస్తుంది.

ఆరు సంవత్సరాల వరకు బుధ దశ ఉండటం వల్ల విద్యారంభం బాగుంటుంది. తరువాత వచ్చే 7 సంవత్సరాల కేతుదశ కారణగా విద్యారంభంలోనే కొన్ని అడ్డంకులు ఎదురవుతాయి. ప్రయత్న పూర్వకంగా వాటిని అధిగమించి విద్యలో విజయం సాధించాలి. కేతు దశ అనుకూలంగా ఉంటే ఆటంకాలు ఎదురవ్వవు. 13 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్రదశ కారణంగా కొంత ఉపశమనం కలుగుతుంది. మాధ్యమిక విద్య నుంచి సుగమంగా సాగుతుంది. అయితే ఈ సమయంలో విద్యకంటే అలంకరణ, విలాసాల మీదికి మనసు మళ్లుతుంది కాబట్టి.. ప్రయత్నపూర్వకంగా విద్య వైపు వెళ్లి విజయం సాధించాలి.

ఈ నక్షత్ర జాతకులు జీవితంలో త్వరగా స్థిరపడతారు. సకాలంలో వివాహం జరుగుతుంది. 33 సంవత్సరాల వరకు అభివృద్ధి బాగా కొనసాగుతుంది. సంపాదించినది జాగ్రత్త చేసుకోవాల్సి ఉంటుంది. తరువాత కొంత సుఖం తగ్గినా 56 వయసు వరకు జీవితం సాఫీగా కొనసాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కాలంలో కొన్ని సమస్యలు ఉండవచ్చు. రాహు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు సాధ్యమవుతాయి. 74 సంవత్సరాల తరువాత వచ్చే 18 సంవత్సరాల గురు దశ కారణంగా తిరిగి సుఖమైన జీవితం మొదలవుతుంది. వృద్ధాప్యం సౌఖ్యంగా కొనసాగుతుంది.

జ్యేష్ఠ నక్షత్ర నాలుగవ పాదము

వీరి మీద గురు బుధ గ్రహ ఆధిక్యత ఉంటుంది. ఇది రాక్షసగణ నక్షత్రం కనుక వీరికి పట్టుదల అధికం. వీరు మేధాసంపన్నులుగా ఉంటారు. మేధోసంబందిత వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు వీరికి అనుకూలిస్తాయి. వీరు విద్యాసంస్థలు స్థాపించి నిర్వహించగలరు. అధికార పదవులను సమర్ధవంతగా నిర్వహించగలరు. వీరికి ఆధ్యాత్మిక విశ్వాసం ఉంటుంది. వీరికి ప్రభుత్వ ఉద్యోగావకాశాలు కలుగవచ్చు.

రెండు సంవత్సరాల వరకు బుధ దశ ఉంటుంది. తరువాత వచ్చే 7 సంవత్సరాల కేతు దశ కారణంగా విద్యలో అడ్డంకులు ఎదురవుతాయి. ప్రయత్నపూర్వకంగా వాటిని అధిగమించి విద్యను ప్రారంభం చేయాలి . 4వ తరగతి నుండి విద్యలో అభివృద్ధి ఉంటుంది. కేతుదశ అనుకూలంగా ఉంటే ఆటంకాలు ఉండవు. 11 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్రదశ కారణంగా కొంత ఉపశమనం కలుగుతుంది. ఈ సమయంలో విద్యకంటే అలంకరణ, విలాసాల మీద మనసు మళ్లే అవకాశం ఉంటుంది కనుక.. ప్రయత్నపూర్వకంగా విద్య వైపు మళ్ళించి విజయం సాధించాలి. జీవితంలో తొందరగానే స్థిరపడతారు. సకాలంలో వివాహం జరుగుతుంది. 31 సంవత్సరాల వరకు అభివృద్ధి బాగా కొనసాగుతుంది. సంపాదించినది జాగ్రత్త చేసుకోవాల్సిన అవసరం చాలా ఉంది. తరువాత కొంత సుఖం తగ్గినా 54 వయసు వరకు జీవితం సాఫీగా కొనసాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కాలంలో కొన్ని సమస్యలు ఉండవచ్చు. రాహుదశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు ఉంటాయి.

జ్యేష్ట నక్షత్రము గుణగణాలు

జ్యేష్ట నక్షత్రంలో పుట్టిన జాతకులు సందర్భానుసారంగా అభిప్రాయాలు మార్చుకుంటారు. తమ రహస్యాలను కాపాడుకోవడానికి ఇతరుల రహస్యాలను తెలుసుకుంటారు. చిన్న విషయాలను కూడా సూక్ష్మంగా పరిశీలించి, లోపాలను ఎంచుకుంటారు. ఇతరులలో చిన్న విషయాలను కూడా పరిశీలించి లోపాలను ఎత్తి చూపుతారు. తగాదాలు పెట్టడమే ధ్యేయంగా ఉన్న వారిలా పేరు తెచ్చుకుంటారు. తమకు శక్తి లేకున్నా అనుకున్న పనులు సాధించడానికి ప్రయత్నిస్తారు. ఇతరుల సహాయాన్ని తమ హక్కులుగా వాడుకుంటారు. ఇక ఇతరుల నుంచి వచ్చే విమర్శలు సహించ లేరు.

ఆత్మన్యూన్యతా భావం కలిగి ఉంటారు. ఎదుటి వారు సరదాగా చేసే వ్యాఖ్యలు తమను అపహాస్యం చేయడానికే చేసారని భావిస్తారు.

వీరికి శాశ్వత మిత్రత్వం, శాశ్వత స్నేహం ఉండదు. సాంకేతిక రంగంలో ప్రత్యేక విభాగంలో నిపుణత ఉంటుంది. విదేశాల మీద మోజు, విహారయాత్రల మీద ఆసక్తి ఉంటుంది. వ్యసనాలకు దూరంగా ఉంటే జీవితం సాఫీగా సాగుతుంది. బాల్యం నుంచి విద్యలో ప్రకాశిస్తారు. కాని ఉన్నత విద్యలకు కొంత ఆటంకం కలిగినా అడ్డంకులను అధిగమిస్తే అభివృద్ధి సాధించగలరు. తగిన వయసులో సంపాదన మొదలవుతుంది. సంపాదించిన ధనాన్ని భవిష్యత్తుకు జాగ్రత్త పరచుకోవాలసిన అవసరం ఉంటుంది. వృద్ధాప్యంలో కొన్ని సమస్యలను ఎదుర్కొంటారు. ఇవి ఈ నక్షత్ర జాతకులు అందరికీ జరిగే సాధారణ ఫలితాలు మాత్రమే. జాతక చక్రంలో గ్రహ పరిస్థితులను అనుసరించి ఫలితాలలో మార్పులు ఉంటాయి.

ఈ నక్షత్ర జాతకులకు పసుపు, నలుపు రంగులు కలిసివస్తాయి. ఇంకా మంగళవారం వీరికి అన్ని విధాలా అనుకూలిస్తుంది. అలాగే సోమ, బుధవారాలు సామాన్య ఫలితాలనిస్తాయి. జ్యేష్ట నక్షత్రంలో పుట్టిన జాతకులకు 9వ సంఖ్య అన్ని విధాలా కలిసివస్తుంది. అలాగే 9, 18, 36, 1, 2, 3 అనే సంఖ్యలు కూడా అన్ని విధాలా అనుకూలిస్తాయి. కానీ 4, 5, 6 అనే సంఖ్యలు ఈ జాతకులకు కలిసిరావు.

***మూల నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు***

నక్షత్రములలో ఇది 19వ నక్షత్రము. మూలానక్షత్ర అధిదేవత నిరుతి, ఇది రాక్షసగణ నక్షత్రం, రాశ్యధిపతి గురువు, జంతువు శునకం, పురుష జాతి.

మూల నక్షత్రము మొదటి పాదము

మూల నక్షత్ర అధిపతి కేతువు. ఈ ప్రభావం వల్ల ఈ నక్షత్ర జాతకుల మీద కుజ కేతు గ్రహ ప్రభావం ఉంటుంది. వీరు రాక్షసగుణ ప్రధానులు. కనుక పట్టుదల అధికంగా ఉంటుంది. వీరికి కేతుగ్రహ ప్రభావం కారణంగా భక్తి అధికంగా ఉంటుంది. ఆధ్యాత్మిక ఉద్యమాలలో వీరు ముందు ఉంటారు. వీరికి ఆత్మవిశ్వాసం, ధైర్య సాహసాలు అధికం. సైనిక పరమైన ఉద్యోగాలంటే వీరికి ఆసక్తి ఉంటుంది. పోలీస్ శాఖ కూడా వీరికి అనుకూలమే. అగ్ని, విద్యుత్, భూసంబంధిత వృత్తులు ఉద్యోగ వ్యాపారాలు కూడా ఈ జాతకులకు అనుకూలిస్తాయి.

ఆరు సంవత్సరాల తరువాత వీరికి 20 సంవత్సరాల శుక్ర దశ వస్తుంది. కనుక విద్యారంభం బాగానే ఉంటుంది. చదువు సమయంలోనే విలాసాల వైపు మనసు మళ్ళే అవకాశం ఉంది కాబట్టి, గట్టి ప్రయత్నంతో విద్యలో విజయం సాధించాల్సి ఉంటుంది. ఉన్నత విద్యాభ్యాసం వీరికి అనుకూలిస్తుంది. సకాలంలో జీవితంలో స్థిరపడతారు. సకాలంలో వివాహం జరుగుతుంది. 49 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. రాహు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు అనుకూలిస్తాయి. 67 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కారణంగా సమస్యలు తగ్గుముఖం పట్టి సుఖం మొదలవుతుంది. మిగిలిన జీవితం.. వృద్ధాప్యం సాఫీగా సాగుతుంది.

మూల నక్షత్రము రెండవ పాదము

వీరు రాక్షసగుణ ప్రధానులు కనుక పట్టుదల అధికంగా ఉంటుంది. వీరు స్థిరమైన అభిప్రాయాలను కలిగి ఉంటారు. అకర్షణీయంగా మాట్లాడగల నేర్పు ఉంటుంది. వీరికి కేతు గ్రహ ప్రభావం కారణంగా భక్తి అధికంగా ఉంటుంది. అకర్షణీయమైన వస్తుసేకరణ అంటే ఆసక్తి కలిగి ఉంటారు. వీరికి జలసంబందిత, పర్యాటక సంబంధిత వృత్తి ఉద్యోగాలు అనుకూలిస్తాయి.

ఈ జాతకులు చిన్న వయసు నుంచే కళారంగంలో ప్రకాశించగలరు. వీరు దత్తు పోగల అవకాశాలు కూడా ఉంటాయి. ఇతరుల గృహాలలో ఆదరాభిమానాలకు పాత్రులవుతారు. 4 సంవత్సరాల వరకు కేతుదశ ఉంటుంది. కనుక విద్య ఆరంభం నుంచి ఆటంకం లేకుండా సాగుతుంది. అయినప్పటికీ 4 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్రదశ కారణంగా విద్య కంటే అలంకరణ, విలాసాలు అంటే ఆసక్తి ఉంటుంది కనుక ప్రయత్నా పూర్వకంగా మనసును విద్య వైపు మళ్ళించాలి.. విజయం సాధించాలి. ఇక వీరు జీవితంలో త్వరగా స్థిరపడతారు. సకాలంలోనే వివాహం జరుగుతుంది. 47 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా జరుగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కారణగా కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. అయినప్పటికీ రాహుదశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు అనుకూలిస్తాయి. 65 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కారణంగా సమస్యలు తగ్గి జీవితంలో తిరిగి అభివృద్ధి, సుఖం మొదలవుతుంది. అనంతరం వృద్ధాప్య దశ సాఫీగా సాగుతుంది.

మూల నక్షత్రము మూడవ పాదము

ఈ జాతకుల మీద బుధ కేతు గ్రహ ప్రభావం ఉంటుంది. వీరు రాక్షస గుణ ప్రధానులు.. కనుక పట్టుదల అధికంగా ఉంటుంది. వీరు తమ అభిప్రాయాలను బుద్ధి కుశలతతో ప్రదర్శిస్తారు. వీరికి కేతుగ్రహ ప్రభావం కారణంగా భక్తి అధికంగా ఉంటుంది. వీరికి వ్యాపారం చేయడమంటే అధిక ఆసక్తి. అలాగే వృత్తులు, ఉద్యోగం కూడా వీరికి అనుకులిస్తాయి. అకర్షణీయమైన వస్తు సేకరణ అంటే ఆసక్తి కలిగి ఉంటారు. వీరికి జల సంబంధిత, పర్యాటక సంబందిత వృత్తి ఉద్యోగాలు, వ్యాపారాలు అనుకూలిస్తాయి. ఈ జాతకులు చిన్న వయసు నండుచే కళారంగంలో ప్రావీణ్యత సాధిస్తారు. అయితే వీరికి దత్తుపోగల అవకాశాలు ఉంటాయి. అలాగే ఇతరుల గృహాలలో ఆదరాభిమానాలకు పాత్రులవుతారు.

మూడు సంవత్సరాల వరకు కేతు దశ ఉండే కారణంగా.. విద్య ఆరంభం నుంచి ఆటంకం లేకుండా సాగుతుంది. అయినప్పటికీ మూడు సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కారణంగా విద్య కంటే అలంకరణ, విలాసాలు వైపు మనసు మళ్ళుతుంది. కాబట్టి పట్టుదలతో మనసును విద్య వైపు మళ్ళించాలి. ఈ నక్షత్ర జాతకులు జీవితంలో తొందరగానే స్థిరపడతారు. సకాలంలోనే వివాహం అవుతుంది. 46 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కారణగా కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. అయినప్పటికీ రాహుదశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు అనుకూలిస్తాయి. 64 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కారణంగా సమస్యలు తగ్గుముఖం పట్టి జీవితంలో తిరిగి అభివృద్ధి మొదలవుతుంది. ఆ తర్వాత వృద్ధాప్య దశ సాఫీగా సాగుతుంది.

మూల నక్షత్రము నాలుగవ పాదము

ఈ జాతకుల మీద చంద్ర కేతు గ్రహ ప్రభావం ఉంటుంది. వీరు రాక్షసగుణ ప్రధానులు. దీంతో పట్టుదల గత వ్యక్తులై ఉంటారు. వీరు తమ అభిప్రాయాలను ఎప్పటికప్పుడు మార్చుకుంటూ ఉంటారు. అంతేకాదు వీరు తమ భావోద్వేగాలను మార్చి మార్చి ప్రదర్శిస్తారు. వీరికి భక్తి భావం ఎక్కువే. వీరికి శ్వేతవర్ణ వసువుల సంబంధిత వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు అనుకూలిస్తాయి. ఔషధ సంబంధిత వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు అనుకూలిస్తాయి. వీరు బాల్యం నుంచి కళారంగంలో ప్రతిభాపాటవాలు చూపిస్తారు. వీరు దత్తుపోగల అవకాశాలు కూడా ఉంటాయి. ఇతరుల ఆదరాభిమానాలకు పాత్రులవుతారు.

వీరికి విద్య నిరాటంకంగా కొనసాగుతుంది. రెండు సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కారణంగా విద్య కంటే అలంకరణ, విలాసాలపైకి దృష్టి మరలుతుంది. కాబట్టి పట్టుదలతో మనసును విద్య వైపు మళ్ళించి విజయం సాధించాల్సి ఉంటుంది. వీరు జీవితంలో త్వరగానే స్థిరపడతారు. వివాహం కూడా సకాలంలో అవుతుంది. 45 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా జరుగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కారణంగా కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. అయినప్పటికీ రాహు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు సులభమవుతాయి. 63 సంవత్సర తరువాత వచ్చే 16 సంవత్సరాల గురుదశ కారణంగా సమస్యలు తగ్గుముఖం పట్టి జీవితంలో తిరిగి అభివృద్ధి, సుఖం కొన సాగుతుంది. వృద్ధాప్యం కూడా సాఫీగా సాగిపోతుంది.

మూల నక్షత్రము గుణగణాలు - ఫలితాలు

ఈ నక్షత్ర జాతకులు శక్తిమంతులై ఉంటారు. అసాధారణ ప్రతిభాపాటవాలు ఉంటాయి. దైవజ్ఞానము గలవారై ఉంటారు. భవిష్యత్ ను వాస్తవానికి దగ్గరగా ఊహించి చెప్పగలరు. అనర్గలముగా మాట్లాడే ప్రతిభా ఉంటుంది. ఏ విషయములనైనా విడ మరచి చెప్పగల నేర్పరులు. తాము నమ్మిన సిద్ధాంతములకు కట్టుబడి ఉంటారు. అన్యాయము, అక్రమాలను సహించలేరు. అయితే వీరు కాస్త గర్వం, అహంభావం కలవారు. వీరు తమ జీవితంలో రెండు లేక మూడు వృత్తులను చేపట్టగలరు. కుటుంబం, బంధువులు, స్నేహితుల పట్ల మంచి అభిప్రాయం కలిగి ఉంటారు .అందరూ నీతిగా ఉండాలని కోరుకొంటారు.

పట్టుదలతో, స్వయంకృషితో జీవితంలో ఎదిగే ప్రయత్నం చేస్తారు. ఒక్కొక్క మెట్టు ఎక్కుతూ అభివృద్ధి వైపు సాగిపోతారు. అభివృద్ధి, ఆధిపత్యమే ఈ జాతకుల లక్ష్యం. ఆర్థిక వ్యవహారాలు నిర్మొహమాటంగా నడిపిస్తారు. తాము అనుభవించిన కష్టాలు ఇతరులు అనుభవిస్తున్నప్పుడు సాయం చేయరు. తనకు తెలిసినా మంచి మార్గాలు, సూచనలు వేరొకరికి చెప్పరు.

రవి, చంద్ర, కుజ దశలు యోగిస్తాయి. స్త్రీ సంతానం పట్ల అభిమానం ఎక్కువ. సంతానం అభివృద్ధిలోకి వస్తారు. శుభకార్యాలు చేయడం కష్టతరమైన యజ్ఞం అవుతుంది. కీలక సమయాలలో బంధువర్గ అండదండలు నయనో భయానో సాధిస్తారు. ప్రయాణాలలో జాగ్రత్తలు అవసరం. భాగస్వాములు మోసగిస్తారు. 60 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగి పోతుంది.

*పూర్వాషాఢ నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు*

నక్షత్రములలో ఇది 20వ నక్షత్రము. పూర్వాషాఢ నక్షత్రముకు అధిపతి శుక్రుడు. అది దేవత - గంగ. మనుష్య - గణం. జంతువు - వానరం. రాశి - అధిపతి గురువు.

పూర్వాషాఢ నక్షత్రము మొదటి పాదము
పూర్వాషాఢ ఒకటవ పాదము సింహరాశిలో ఉంటుంది. సింహరాశి సూర్యుడు. పూర్వాషాఢ నక్షత్ర అధిపతి శుక్రుడు. ఈ నక్షత్ర జాతకుల మీద సూర్య, శుక్ర గ్రహ ప్రభావం ఉంటుంది. వీరు మానవ గణ ప్రధానులు కాబట్టి వీరికి సమయానుకూలంగా వ్యవహరించే నేర్పు ఉంటుంది. వీరికి అతిశయభావం, నిర్వహణ సామర్థ్యం ఉంటుంది. విలాసాల మీద, సౌందర్యపోషణ మీద అంతులేని ఆసక్తి ఉంటుంది. కళాత్మకమైన వృత్తులు, వ్యాపారం, ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి.

ఈ జాతలకులు చిన్న వయసు నుంచే కళాత్మక రంగంలో ప్రతిభాపాటవాలు చూపిస్తారు. విద్య ఆరంభం నుంచి బాగా సాగుతుంది. శుక్ర దశ కారణంగా విలాసాలు సౌందర్య పోషణ అంటే ఆసక్తి ఉంటుంది. అయితే పట్టుదలతో మనసును విద్య వైపు మళ్ళించాలి. 18 సంవత్సరాల వరకు వీరికి శుక్ర దశ ఉంటుంది. అప్పటి వరకు సాఫీగా సాగే జీవితంలో తరువాత కాస్త సుఖం తగ్గినా 41 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కారణంగా జీవితంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. రాహు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు అనుకూలిస్తాయి. 59 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో సంపద సంపాదనలో అభివృద్ధి ఉంటుంది. వృద్ధాప్యం సాఫీగా, ప్రశాంతంగా సాగుతుంది.

పూర్వాషాఢ నక్షత్రము రెండవ పాదము
వీరి మీద శుక్ర, బుధ గ్రహ ప్రభావం ఉంటుంది. వీరు బుద్ధి కుశలత కలిగి ప్రవర్తిస్తారు. ఈ జాతకులు మానవగణ ప్రధానులు కనుక వీరికి సమయానుకూలంగా వ్యవహరించగల నేర్పు ఉంటుంది. అంతేకాదు కళాత్మక వస్తువుల మీద ఆసక్తి అధికం.
చిన్న వయసు నుంచే కళాత్మక రంగంలో ప్రకాశించగలుగుతారు. పర్యాటక ప్రదేశాలలో వీరికి ఉద్యోగావకాశాలు అనుకూలిస్తాయి. భూ సంబంధిత , కళా సంబంధిత వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు వీరికి అనుకూలిస్తాయి. విద్య ఆరంభం నుంచే బాగా సాగుతుంది. శుక్ర దశ కారణంగా విలాసాల మీద, సౌందర్య పోషణ అంటే ఆసక్తి ఉంటుంది. పట్టుదలతో మనసును విద్య వైపు మళ్ళించి విజయం సాధించాలి.

14 సంవత్సరాల వరకు వీరికి శుక్ర దశ ఉంటుంది. అప్పటి వరకు సుఖంగా సాగే జీవితంలో తరువాత కొంత సౌఖ్యం తగ్గినా 37 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కారణంగా జీవితంలో అనుకోని కొన్ని సమస్యలు ఎదురవుతాయి. ఇక రాహుదశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు అనుకూలిస్తాయి. 55 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురుదశ కాలంలో సంపద సంపాదనలో అభివృద్ధి ఉంటుంది. వృద్ధాప్యం సాఫీగా సాగుతుంది.

పూర్వాషాఢ నక్షత్రము మూడవ పాదము

వీరికి సమయానుకూలంగా వ్యవహరించే నేర్పు ఉంటుంది. అంతేకాదు వీరి మీద పరిపూర్ణంగా శుక్రుడి ప్రభావం ఉంటుంది కనుక వీరు కళారంగంలో విశేషంగా ప్రకాశిస్తారు. వీరికి కళాపిపాస అత్యధికంగా ఉంటుంది. కళాత్మక వస్తుసేకరణ అంటే ఆసక్తి అధికం. పరిశుభ్రమైన వాతావరణం అంటే ఇష్టపడతారు. అటువంటి చోటే నివసిస్తారు. పర్యాటక ప్రదేశాలలో, విహార ప్రదేశాలలో, విలాస ప్రదేశాలలో వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు వీరికి అనుకూలం.
ఇక ఈ జాతకులు చిన్న వయసులోనే కళారంగంలో ప్రకాశిస్తారు. విద్య ఆరంభం నుంచి బాగా అబ్బుతుంది. శుక్ర దశ కారణంగా విలాసాల మీద, సౌందర్య పోషణ అంటే అధిక ఆసక్తి. కాబట్టి పట్టుదలతో మనసును విద్య వైపు మళ్ళించి విజయం సాధించాలి. 9 సంవత్సరాల వరకు వీరికి శుక్ర దశ ఉంటుంది. అప్పటి వరకు సుఖంగా సాగే జీవితంలో తరువాత కొంత సుఖం తగ్గినా 32 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగుతుంది. సకాలంలోనే స్థిరపడతారు. సకాలంలోనే వివాహం కూడా జరుగుతుంది.

తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కారణంగా జీవితంలో కొన్ని అనుకోని అవంతరాలు ఏర్పడతాయి. రాహు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు అనుకూలిస్తాయి. 50 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో సంపద సంపాదనలో అభివృద్ధి ఉంటుంది. 66 సంవత్సరాల కాలంలో 19 సంవత్సరాల శని దశ కాలంలో వృద్ధాప్యం సాఫీగా సాగుతుంది.

పూర్వాషాఢ నక్షత్ర నాలుగవ పాదము

వీరికి సమయానుకూలంగా వ్యవహరించే నేర్పు స్వభావ రీత్య ఉంటుంది. వీరు భావ తీవ్రత కలిగి ఉంటారు. అయినా కూడా తమ భావాల మీద నియంత్రత కలిగి ఉంటారు. ఈ జాతకులకు భూ సంబంధిత , కళా సంబంధిత, పర్యాటక సంబంధిత, జలసంబంధిత వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు అనుకూలిస్తాయి.

ఈ జాతకులు బాల్యం నుంచే కళారంగంలో ప్రకాశిస్తారు. విద్య ఆరంభం నుంచే బాగా సాగుతుంది. శుక్ర దశ కారణంగా విలాసాల మీద, సౌందర్య పోషణ అంటే ఆసక్తి అధికంగా ఉంటుంది. కాబట్టి పట్టుదలతో మనసును విద్య వైపు మళ్ళించాలి. 5 సంవత్సరాల వరకు వీరికి శుక్ర దశ ఉంటుంది. అప్పటి వరకు సౌఖ్యంగా సాగే జీవితంలో తరువాత కొంత సుఖం తగ్గినా… 28 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కారణంగా జీవితంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. రాహు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు అనుకూలిస్తాయి. 45 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో సంపద సంపాదనలో అభివృద్ధి ఉంటుంది. 61 సంవత్సరాల కాలంలో 19 సంవత్సరాల శని దశ కాలంలో అనుకోని ఖర్చులు ఉంటాయి. మిగిలిన జీవితం.. వృద్ధాప్య దశ సాఫీగా సాగుతుంది.

పూర్వాషాఢ నక్షత్రము గుణగణాలు, ఫలితాలు

ఈ నక్షత్ర జాతకులు ప్రత్యేక ఆకర్షణ కలిగి ఉంటారు. ఇతరులను ఆకట్టుకునే వాక్చాతుర్యత, అందం వీరి సొంతం. విలాసమంతమైన జీవితాన్ని కోరుకుని సాధిస్తారు. ముఖ్యంగా స్నేహితులతో ఉమ్మడిగా జీవితంలో చెప్పుకోదగిన విజయాలు సాధిస్తారు. జన్మించిన ప్రాంతానికి దూరంగా రాణిస్తారు. నాయకత్వ లక్షణాలు ఉంటాయి. జీవితంలో

అనుభవాలను చూసి పాఠాలు నేర్చుకుంటారు. విద్యా, వ్యాపార, రాజకీయ రంగాల్లో రాణిస్తారు. నాయకత్వ లక్షణాలు ఉంటాయి.

విదేశీయానం, విదేశీ వ్యాపారము, వ్యవహారము లాభిస్తాయి. సంతానం మీద ఎవరి నీడ పడకుండా కాపాడతారు. వ్యక్తిగతమైన వృత్తి సంబంధిత వ్యవహారాల నీడలు కూడా కుటుంబం మీద పడకుండా జాగ్రత్త వహిస్తారు. సహోదరుల వలన అపఖ్యాతి వస్తుంది.

ఇకపోతే.. బుధవారం వీరికి అదృష్టమైన రోజు. ఆది, సోమ, మంగళ, బుధ, గురు, శనివారాల్లో ఎలాంటి పనులు చేపట్టినా ఆశించిన ఫలితాలుండవు. నలుపు, సిల్వర్ రంగులు గల దుస్తులను ధరించడం మంచిది. నలుపు చేతి రుమాలును వాడటం ద్వారా కొన్ని సమస్యల నుంచి తప్పించుకునే ఆస్కారం ఉంది. ఇంకా శుక్ర గ్రహ శాంతి కోసం శనివారాల్లో నేతి దీపమెలిగించడం ద్వారా సుఖసంతోషాలు చేకూరుతాయి. వీరి అదృష్ట సంఖ్య 3. ఇక 5, 6 సంఖ్యలు కలిసి రావు.

***ఉత్తరాషాఢ నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు***

నక్షత్రములలో ఇది 21వ నక్షత్రము. ఇది రవి గ్రహ నక్షత్రము, మానవ గణము, అధిదేవతలు విశ్వదేవతలు, జంతువు ముంగిస, రాశ్యాధిపతులు మొదటి పాదానికి గురువు, మిగిలిన పాదాలు మూడింటికి శని.

ఉత్తరాషాఢ నక్షత్రము మొదటి పాదము
ఉత్తరాషాఢ నక్షత్ర అధిపతి సూర్యుడు. వీరి మీద సూర్య గురు గ్రహ ప్రభావం ఉంటుంది. వీరు మానవ గణానికి చెందిన వారు. కాబట్టి వీరు సమయానికి తగ్గ రీతిలో ప్రవర్తించ గల్గిగే చాకచక్యం కలిగి ఉంటారు. ఇక వీరికి ఆత్మవిశ్వాసం, అతిశయం కలగలుపుగా ఉంటాయి. ప్రభుత్వపరమైన సంస్థలలో ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి. ఉపాధ్యాయ ఉద్యోగాలు కూడా అనుకూలిస్తాయి. ప్రజానాయకులుగా, ప్రజాఅధికారులుగా రాణించగల నేర్పు వీరికి ఉంటుంది. అగ్ని సంబంధిత, పసుపు వర్ణ వస్తువులకు చెందిన వృత్తులు ఉద్యోగాలు వ్యాపారాలు కూడా వీరికి అనుకూలిస్తాయి.

ఈ జాతకులకు ఆటంకం లేకుండా విద్య సాగుతుంది. వీరికి ఐదు సంవత్సరముల వరకు రవిద శ ఉంటుంది. తరువాత పదేళ్ళ వరకు చంద్ర దశ ఉంటుంది. ఈ సమయంలో వీరికి చిన్న చిన్న ఆరోగ్య సమస్యలు ఎదురు కావచ్చు. 15 సంవత్సరాలకు వచ్చే 7 సంవత్సరాల కుజ దశ కాలం వరకు సాఫీగా జరిగిపోతుంది. 22 సంవత్సరాల తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కారణంగా ఉన్నత విద్యాభ్యాసంలో కొంత ఆటంకం జరగవచ్చు. రాహువు అనుకూలంగా ఉంటే, ఉన్నత విద్య విదేశాలలో కొనసాగవచ్చు. విదేశాలలో ఉద్యోగావకాశాలు కూడా ఉండే అవకాశాలు. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో జాప్యం జరగవచ్చు.

40 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కారణంగా సమస్యలు క్రమంగా తగ్గుతాయి. సంపాదనలో అభివృద్ధి కనిపిస్తుంది. సుఖం మళ్లీ మొదలవుతుంది. 56 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కాలంలో ఖర్చులు అధికమవుతాయి. 75 సంవత్సరాల తరువాత వచ్చే బుధదశ కాలంలో కొంత ఉపశమనం కలుగుతుంది. వృద్ధాప్యం సాఫీగా జరుగుతుంది.

ఉత్తరాషాఢ నక్షత్రము రెండవ పాదము

ఈ జాతకులు మానవ గణానికి చెందిన వారు కనుక సమయానికి తగ్గ రీతిలో ప్రవర్తించ గల నేర్పు కలిగి ఉంటారు. ఇక వీరు తండ్రి పట్ల కొంత విముఖత కలిగి ఉంటారు. తల్లి పట్ల సఖ్యత కలిగి ఉంటారు. వీరికి అంతర్గతంగా పట్టుదల, అతిశయం ఉంటుంది. ప్రభుత్వ పరిశ్రమలు, కర్మాగాలలో ఉద్యోగాలు అనుకూలంగా ఉంటాయి. వీరికి శ్రమించి పట్టుదలతో పని చేయగలరు. వీరు నిర్వహకులుగా చక్కగా పని చేయగలరు. పరిశ్రమలను స్థాపించి నిర్వహించగల సామర్ధ్యం ఉంటుంది.

ఇక ఈ జాతకులకు విద్య ఆటంకం లేకుండా సాగుతుంది. వీరికి 4 సంవత్సరముల వరకు రవి దశ ఉంటుంది. తరువాత 10 సంవత్సరముల చంద్ర దశ ఉంటుంది. ఈ సమయంలో వీరికి చిన్నచిన్న ఆరోగ్య సమస్యలు ఎదురు కావచ్చు. 14 సంవత్సరాలకు వచ్చే 7 సంవత్సరాల కుజ దశ కాలం వరకు సాఫీగా జరిగిపోతుంది. 21 సంవత్సరాల తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కారణంగా ఉన్నత విద్యాభ్యాసంలో కొంత ఆటంకం జరగవచ్చు. రాహువు అనుకూలంగా ఉంటే ఉన్నత విద్య విదేశాలలో కొనసాగవచ్చు. విదేశాలలో ఉద్యోగావకాశాలు కూడా ఉంటాయి. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో కాస్త జాప్యం అయ్యే అవకాశం.

39 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురుదశ కారణంగా సమస్యలు తగ్గుముఖం పడతాయి. సంపాదనలో అభివృద్ధి కనిపిస్తుంది. సుఖం మళ్లీ మొదలవుతుంది. 55 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శనిదశ కాలంలో ఖర్చులు అధికమవుతాయి. 74 సంవత్సరాల తరువాత వచ్చే బుధ దశ కాలంలో కొంత ఉపశమనం కలుగుతుంది. వృద్ధాప్యం సాఫీగా జరుగుతుంది.

ఉత్తరాషాఢ నక్షత్రము మూడవ పాదము

వీరు తండ్రి మీద కొంత విముఖత కలిగి ఉంటారు. అయితే తల్లి పట్ల సఖ్యత కలిగి ఉంటారు. వీరికి అంతర్గతంగా పట్టుదల మెండుగా ఉంటుంది. వీరికి ప్రభుత్వ పరిశ్రమలు, కర్మాగాలల్లోని ఉద్యోగాలు అనుకూలంగా ఉంటాయి. శ్రమించి పని చేయగల నేర్పు ఉంటుంది. వీరు నిర్వహకులుగా చక్కగా పని చేయగలరు. పరిశ్రమలను స్థాపించి నిర్వహించగల నేర్పు ఉంటుంది. ఈ జాతకులకు స్థిరమైన అభిప్రాయాలు ఉంటాయి.

వీరికి విద్య ఆటంకం లేకుండా సాగుతుంది. వీరికి రెండు సంవత్సరముల వరకు రవి దశ ఉంటుంది. తరువాత 10 సంవత్సరముల చంద్ర దశ ఉంటుంది. అందువల్ల ఈ సమయంలో వీరికి చిన్నచిన్న ఆరోగ్య సమస్యలు ఎదురుకావచ్చు. 12 సంవత్సరాలకు వచ్చే 7 సంవత్సరాల కుజ దశ కాలం వరకు సాఫీగానే సాగిపోతుంది. 19 సంవత్సరాల తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కారణంగా ఉన్నత విద్యాభ్యాసంలో కొంత ఆటంకం జరగవచ్చు. రాహువు అనుకూలంగా ఉంటే ఉన్నత విద్య విదేశాలలో కొనసాగవచ్చు. విదేశాలలో ఉద్యోగావకాశాలు కూడా ఉంటాయి. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. అయితే వివాహం విషయంలో జాప్యం జరిగే అవకాశం.

37 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కారణంగా సమస్యలు తగ్గుముఖం పడతాయి. సంపాదనలో అభివృద్ధి కనిపిస్తుంది. సుఖం తిరిగి మొదలవుతుంది. 53 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ సమయంలో ఖర్చులు అధికమవుతాయి. 72 సంవత్సరాల తరువాత వచ్చే బుధ దశ కాలంలో కొంత ఉపశమనం కలుగుతుంది. వృద్ధాప్యం సాఫీగా జరుగుతుంది.

ఉత్తరాషాఢ నక్షత్రము నాలుగవ పాదము

వీరి మీద సూర్య గురు గ్రహ ప్రభావం ఉంటుంది. మానవ గణానికి చెందిన జాతకులు కనుక వీరికి సమయానుకూలంగా ప్రవర్తించగలిగే నేర్పు ఉంటుంది. ఇక వీరికి ఆత్మవిశ్వాసం, అతిశయం కలగలుపుగా ఉంటాయి. ప్రభుత్వపరమైన సంస్థలలో ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి. ఉపాధ్యాయ రంగంలో పని చేయడం వీరికి అనుకూలం. ప్రజానాయకులుగా, ప్రజా అధికారులుగా వీరు సమర్ధతో పని చేయగలరు. మధ్యవర్తులుగా కూడా నేర్పుతో వ్యవహరించగలరు. అగ్ని సంబంధిత, పసుపు వర్ణ వస్తువులకు చెందిన వృత్తులు, ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి.

ఇక ఈ జాతకులకు విద్య ఆటంకం లేకుండా సాగుతుంది. వీరికి ఒక సంవత్సరముల వరకు రవిదశ ఉంటుంది. తరువాత 10 సంవత్సరముల చంద్రదశ ఉంటుంది. ఈ సమయంలో వీరికి చిన్న చిన్న ఆరోగ్య సమస్యలు ఎదురుకావచ్చు. 11 సంవత్సరాలకు వచ్చే 7 సంవత్సరాల కుజ దశ కాలం వరకు సాఫీగా జరిగిపోతుంది. 18 సంవత్సరాల తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కారణంగా ఉన్నత విద్యాభ్యాసంలో కొంత ఆటంకం జరగవచ్చు. రాహువు అనుకూలంగా ఉంటే ఉన్నత విద్య విదేశాలలో కొనసాగే అవకాశం. విదేశాలలో ఉద్యోగావకాశాలు కూడా ఉంటాయి. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. అయితే వివాహం విషయంలో జాప్యం జరిగే అవకాశం.

36 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కారణంగా సమస్యలు క్రమంగా తగ్గుముఖం పడతాయి. సంపాదనలో అభివృద్ధి కనిపిస్తుంది. సుఖం మళ్ళీ ఆరంభమవుతుంది. 52 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శనిదశ కాలంలో ఖర్చులు అధికమవుతాయి. 71 సంవత్సరాల తరువాత వచ్చే బుధ దశ కాలంలో కొంత ఉపశమనం కలుగుతుంది. వృద్ధాప్య దశ సాఫీగా సాగుతుంది.

ఉత్తరాషాఢ నక్షత్రము గుణగణాలు

రవిగ్రహ నక్షత్రమైన ఈ ఉత్తరాషాఢలో జన్మించిన జాతకులు ప్రలోభాలకు లొంగరు. వీరు సాధారణ స్థాయి నుంచి కష్టపడి ఉన్నత స్థాయికి చేరుకుంటారు. లక్ష మందిలో ఒకరికి లభించే అరుదైన అవకాశం ఈ జాతకులకు లభిస్తుంది. చదువు, విజ్ఞానంలో తల్లిదండ్రుల కంటే మించిపోతారు. ఇక ఆర్థిక వ్యవహారాలు దాచుకోవడంలో వీరికి వీరే సాటి. తెలిసిన వాళ్ళకు అప్పు కూడా ఇవ్వరు. స్నేహాలు, పరిచయాలు వినోదంగా భావిస్తారు. సెంటిమెంట్స్‌ను కీలక సమయంలో లెక్కచేయరు.

మితంగా వ్యవహరించడం, ఇతరుల పట్ల వినయ విధేయతను కలిగి ఉండటం ఈ నక్షత్ర జాతకుల వ్యక్తిత్వం. బంధుత్వ బంధానికి కట్టుబడి ఉంటారు. బంధువుల కోసం కొన్ని నిందలు తమపై వేసుకుని కష్టనష్టాలు అనుభవిస్తారు. ఒక సమయంలో వీరు నేర ప్రవృత్తి నడవడిక కలిగిన వారికి అండగా నిలువవలసి వస్తుంది. తప్పించుకోవడానికి వీలు కాని పలు సందర్భాలు ఇందుకు కారణమవుతాయి. ఉన్నత చదువులు వీరికి కలసి వస్తాయి. వ్యాపారంలో ఊహించని ఫలితాలను సాధిస్తారు.

**శ్రవణం నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు**

నక్షత్రములలో శ్రవణ నక్షత్రము 22వది. శ్రవణానక్షత్ర అధిపతి చంద్రుడు. అధిదేవత మహా విష్ణువు, గణము దేవగణము, రాశ్యాధిపతి శని, జంతువు వానరం.

శ్రవణం నక్షత్రము మొదటి పాదము

శ్రవణ నక్షత్ర అధిపతి చంద్రుడు. వీరి మీద కుజ చంద్ర గ్రహ ప్రభావం అధికంగా ఉంటుంది. వీరు దేవగణ ప్రధానులు. కనుక వీరు సౌమ్యంగా వ్యవహరిస్తారు. మరికొన్ని సమయాల్లో ఆవేశపూరిత స్వభావం కలిగి ఉంటారు. అయినప్పటికీ తమ భావాల మీద నియంత్రత కలిగి ఉంటారు. ప్రేమాభిమానాలను, కోపతాపాలను మార్చుతుంటారు. వీరు ధైర్యసాహసాలు కలిగి ఉంటారు. శ్వేతవర్ణ, రక్త వర్ణ వస్తువులకు సంబంధించిన వృత్తి వ్యాపార ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి. సైనిక, ఔషధ సంబంధిత ఉద్యోగాలు కూడా అనుకూలమే. విద్యుత్, అగ్ని సంబంధిత ఉద్యోగాలు అనుకూలిస్తాయి.

ఈ నక్షత్ర జాతకులకు ఎనిమిది సంవత్సరాల వరకు చంద్ర దశ ఉంటుంది. చంద్ర దశ కాలంలో వీరికి బాల్యంలో ఆరోగ్య సమస్యలు ఎదురవుతుంటాయి. తరువాత వచ్చే ఏడు సంవత్సరాల కుజదశ కాలంలో ఆరోగ్య సమస్యలు తగ్గుతాయి. 15 సంవత్సాలకు వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కాలంలో ఉన్నత విద్యకు ఆటంకాలు ఎదురవుతుంటాయి. కనుక పట్టుదలతో వీటిని అధిగమించి విద్యలో విజయం సాధించాలి. రాహు దశ అనుకూలిస్తే విదేశాలలో విద్యాభ్యాసం కొనసాగించే అవకాశం ఉంటుంది. జీవితంలో స్థిరపడడానికి కొంత జాప్యం జరగవచ్చు. వివాహంలో కూడా కొంత ఆలస్యం జరిగే అవకాశం ఉంటుంది.

ఇక 33 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో సమస్యలు క్రమంగా తగ్గుతాయి. సంపదనలో కూడా మంచి అభివృద్ధి కలుగుతుంది. సంపాదించినది పదిలపరచుకోవాలి. 49 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కాలంలో అభివృద్ధి కొంత తగ్గినా సాఫీగా జరిగి పోతుంది. అయినప్పటికీ అనుకోని ఖర్చులు అధికమవుతాయి. ఇక 68 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపసమనం కలిగి మిగిలిన జీవితం సాఫీగా సాగిపోతుంది. వృద్ధాప్య దశ సమస్యారహితంగా సాగిపోతుంది.

శ్రవణం నక్షత్రము రెండవ పాదము

వీరు సౌమ్యంగా ప్రవర్తిస్తారు. వీరికి ధర్మం అంటే ఆసక్తి . ధర్మంపక్షం వహిస్తారు. వీరికి కొంత స్థిర స్వభావం ఉంటుంది. ఇక వీరు కళాత్మక వస్తువులను సేకరించడానికి ఆసక్తి చూపుతారు. విలాస జీవితం పట్ల వీరికి ఆసక్తి ఉంటుంది. వీరికి శ్వేతవర్ణ సంబంధిత వృత్తి , ఉద్యోగ, వ్యాపారాలు అనుకూలిస్తాయి. జల సంబందిత, పర్యాటక సంబంధిత, ఔషధ సంబంధిత వృత్తి , ఉద్యోగ, వ్యాపారాలు కూడా వీరికి అనుకూలం.

ఇక ఈ జాతకులకు ఆరు సంవత్సరాల వరకు వీరికి చంద్రదశ ఉంటుంది. చంద్రదశలో వరకు వీరికి బాల్యంలో ఆరోగ్య సమస్యలు ఎదురవుతాయి. తరువాత వచ్చే ఏడు సంవత్సరాల కుజ దశ కాలంలో ఆరోగ్య సమస్యలు తగ్గుముఖం పడతాయి. 13 సంవత్సాలకు వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కాలంలో మాధ్యమిక విద్యలోఆటంకాలు ఎదురవుతాయి. ప్రయత్నపూర్వకంగా వీటిని అధిగమించి విద్యలో విజయం సాధించవచ్చు. రాహు దశ అనుకూలిస్తే విదేశాలలో విద్యాభ్యాసం కొనసాగించే అవకాశం. జీవితంలో స్థిరపడడానికి కొన్ని ఆటంకాలు ఎదురవుతాయి. ఇక వివాహంలో కొంత ఆలస్యం అవుతుంది.

ఇక 31 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురుదశ కాలంలో సమస్యలు తగ్గుముఖం పట్టడమే కాక సంపదలో, సంపాదనలో మంచి అభివృద్ధి కలుగుతుంది. సంపాదించింది పదిలపరచుకుని ఇబ్బందులను ఎదుర్కొవాలి. 47

సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శనిదశ కాలంలో అభివృద్ధి కొంత తగ్గినా సాఫీగా జరిగి పోతుంది. అయినప్పటికీ అనుకోని ఖర్చులు అధికమవుతాయి. సంపాదనకు మించిన ఖర్చులు ఉంటాయి. 66 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపసమనం కలిగి మిగిలిన జీవితం సాఫీగా జరిగి పోతుంది. ఇక వృద్ధాప్య దశ సమస్యారహితంగా సాగిపోతుంది.

శ్రవణం నక్షత్రము మూడవ పాదము

వీరు సౌమ్యంగా ప్రవర్తిస్తారు. ఇక జాతకులకు ధర్మం అంటే ఆసక్తి ఉంటుంది. ధర్మం పక్షం వహిస్తారు. వీరు బుద్ధి కుశలత కలిగి ఉంటారు. వీరికి వ్యాపారం అంటే ఆసక్తి. వీరు ఔషధ తయారీ సంస్థను స్థాపించి నిర్వహించగలరు. వీరికి విద్యా సంబంధిత, భూ సంబంధిత, ఔషధ సంబంధిత వ్యాపారం, ఉద్యోగం, వృత్తులు అనుకూలిస్తాయి.

ఇక ఈ జాతకులకు నాలుగు సంవత్సరాల వరకు చంద్ర దశ ఉంటుంది. చంద్రదశలో వరకు వీరికి బాల్యంలో ఆరోగ్య సమస్యలు ఉంటాయి. తరువాత వచ్చే ఏడు సంవత్సరాల కుజ దశ కాలంలో ఆరోగ్య సమస్యలు తగ్గుతాయి. 11 సంవత్సరాలకు వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కాలంలో విద్యలో ఆటంకాలు ఎదురవుతాయి. ప్రయత్నపూర్వకంగా వీటిని అధిగమించి విద్యలో విజయం సాధించవచ్చు. రాహు దశ అనుకూలిస్తే విదేశాలలో విద్యాభ్యాసం కొనసాగుతుంది. ఇక జీవితంలో స్థిరపడడానికి ఆలస్యమయ్యే అవకాశం. వివాహం విషయంలోనూ కొంత జాప్యం ఉంటుంది. 29 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో సమస్యలు తగ్గుముఖం పట్టడమే కాక సంపదలో, సంపాదనలో మంచి అభివృద్ధి కలుగుతుంది. సంపాదించింది పదిలపరుచువలసిన అవసరం ఎంతో ఉంది. 45 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కాలంలో అభివృద్ధి కొంత తగ్గినా సాఫీగా జరిగిపోతుంది. అయినప్పటికీ అనుకోని ఖర్చులు అధికమవుతాయి. సంపాదనకు మించిన ఖర్చులు ఉంటాయి. 64 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపశమనం కలిగి మిగిలిన జీవితం సాఫీగా జరిగి పోతుంది. వృద్ధాప్యం సమస్యారహితంగా సాగిపోతుంది.

శ్రవణం నక్షత్రము నాలుగవ పాదము

వీరు సౌమ్యంగా ప్రవర్తిస్తారు. వీరికి ధర్మం అంటే ఆసక్తి ఉంటుంది. ధర్మం పక్షం వహిస్తారు. వీరికి తల్లితో అనుబంధం అధికం. వీరు తరచూ భావోద్రేకాలకు లోనయ్యే అవకాశం ఉంటుంది. వీరి భావాలు తరచూ మారుతూ ఉంటాయి. ఈ నక్షత్ర జాతకులు భావోద్వేగాలను (ప్రేమ, అభిమానం, కోపతాపాలు) మార్చిమార్చి ప్రదర్శిస్తారు. శ్వేతవర్ణ వస్తువులకు సంబంధించిన వృత్తులు, వ్యాపారం , ఉద్యోగం వీరికి అనుకూలం. ఔషధ రంగానికి సంబంధించిన వృత్తులు ఉద్యోగాలు వ్యాపారాలు వీరికి అనుకూలిస్తాయి.

ఈ నక్షత్రంలో జన్మించిన వారికి రెండు సంవత్సరాల వరకు వీరికి చంద్రదశ ఉంటుంది. చంద్రదశలో వరకు వీరికి బాలారిష్టాలు సమస్యలు ఉంటాయి. తరువాత వచ్చే 7 సంవత్సరాల కుజ దశ కాలంలో ఆరోగ్య సమస్యలు తగ్గుముఖం పడతాయి. 9 సంవత్సరాలకు వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కాలంలో విద్యలోఆటంకాలు ఉంటాయి. ప్రయత్నపూర్వకంగా వీటిని అధిగమించి విద్యలో విజయం సాధించవచ్చు. రాహు దశ అనుకూలిస్తే విదేశాలలో విద్యాభ్యాసం కొనసాగించే అవకాశం ఉంటుంది. జీవితంలో స్థిరపడడానికి కొంత జాప్యం జరగవచ్చు.వివాహంలో కొంత జాప్యం ఉంటుంది.

ఇక 27 సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో సమస్యలు తగ్గుముఖం పట్టడమే కాక సంపదలో, సంపాదనలో మంచి అభివృద్ధి కలుగుతుంది. సంపాదించినది పదిల పరచుకుని ఇబ్బందులను ఎదుర్కొనవలసిన అవసరం ఎంతో ఉంది. 43 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కాలంలో అభివృద్ధి కొంత తగ్గినా సాఫీగా జరిగిపోతుంది. అయినప్పటికీ అనుకోని ఖర్చులు అధికమవుతాయి. సంపాదనకు మించిన ఖర్చులు ఉంటాయి. 62 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపసమనం కలిగి మిగిలిన జీవితం సాఫీగా జరిగిపోతుంది. వృద్ధాప్యం సమస్యారహితంగా సాగిపోతుంది.

శ్రవణం నక్షత్ర జాతకుల గుణగణాలు

ఈ నక్షత్ర జాతకులు వీలైనంత తక్కువగా మాట్లాడే స్వభావాన్ని కలిగి ఉంటారు. కోపతాపాలు, మొండి వైఖరి, అల్లరితనం ఉన్నా వీరు ధర్మంతో జీవితం సాగిస్తారు. చదువు పట్ల శ్రద్ధ.. సమాజంలో ఉన్నత స్థితి.. అవకాశాలను సద్వినియోగపరచుకొనుట.. సందర్భాను సారము వ్యూహం చేయుట వీరి సహజ లక్షణములు.

వీరు చక్కని తీర్పులు చెప్పగలరు. వీరి అంతర్గత ఆలోచన, మేధస్సు ఎవరికి అర్ధం కాదు. ఓర్పు ఉంటుంది కాని దానికి హద్దులు ఉంటాయి. ఎవరికి ఎటువంటి మర్యాద ఇవ్వాలో ఎవరిని ఎక్కడ ఉంచాలో వీరిని చుసి నేర్చుకోవాలి. ఆభరణాలు, స్థిరాస్థులు, వస్తువులు స్థిరాస్థులుగా లభించిన దాని కంటే స్వార్జితము ఎక్కువగా ఉంటుంది. మనోధైర్యంతో సాహస నిర్ణయాలు తీసుకుంటారు. విజయం సాధించి అఖండమైన ఖ్యాతి గడిస్తారు. చనువుగా మాట్లాడే స్వభావం ఉన్నా ఎవరిని నెత్తికి ఎక్కించుకోరు. ఊహ తెలిసిన నాటి నుంచి ధనానికి లోటు ఉండదు. అంచెలు అంచెలుగా పైకి వస్తారు. జీవితంలో ఊహించని స్థాయికి చేరుకునే అవకాశాలు ఉంటాయి.

శత్రువర్గం అడుగడుగునా ఇబ్బందులు పెడుతుంది. ఒక వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తారు. బంధుప్రీతి ఎక్కువ. అందరు వీరిని మొండి వాళ్ళు అని భావించినా వీరికి ఉండే విశాల హృదయం, సున్నిత మనస్తత్వం ఎవరికి అర్ధం కాదు. వ్యాపారంలో ముందుగా భాగస్వాముల వలన నష్టపోయినా తరువాత మంచి లాభాలు గడిస్తారు. ఏ విషయాన్నైనా అంతర్గత ఆలోచించే వీరికి ఓర్పు కాస్త ఎక్కువ. అయితే కొన్నిసార్లు సహనం కోల్పోతారు. వీరికి ధైర్యం, మనోనిబ్బరం ఎక్కువగా ఉంటుంది. జీవితంలో అంచెలంచెలుగా పైకి వస్తారు.

**ధనిష్ఠ నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు**

నక్షత్రములలో ధనిష్ఠ 23వ నక్షత్రము. ధనిష్ఠా నక్షత్ర అధిపతి కుజుడు, ఇది రాక్షస గణము, పురుష జాతి, రాశ్యాధిపతి శని, జంతువు సింహము.

ధనిష్ఠ నక్షత్రము మొదటి పాదము

ధనిష్ఠ నక్షత్ర అధిపతి కుజుడు. ఈ జాతకుల మీద సూర్య కుజ గ్రహ ప్రభావం ఉంటుంది. ఇది రాక్షసగణ ప్రధాన నక్షత్రము. కనుక వీరు ఏదైనా కార్యము యందు పట్టుదల గల వ్యక్తులై ఉంటారు. వీరికి ఆవేశం పాలు అధికమే. వీరికి యునియన్ నాయకులుగా ఉండే అవకాశం ఉంది. ఆత్మవిశ్వాసం, ధైర్యసాహసాలు, అతిశయం అధికంగా ఉంటాయి. వీరికి తండ్రితో

అనుబంధం కాస్త అధికంగానే ఉంటుంది. సైనికపరమైన, విద్యుత్ సంబంధిత, అగ్ని సంబంధిత, భూ సంబంధిత వృత్తులు, ఉద్యోగం, వ్యాపారం వీరికి అనుకూలిస్తాయి. ముఖ్యంగా ప్రభుత్వ ఉద్యోగాలు అనుకూలిస్తాయి.

వీరికి ఆరు సంవత్సరముల వరకు కుజ దశ ఉంటుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కారణంగా కొన్ని సమస్యలు తలెత్తుతాయి. విద్యలో అడ్డంకులు ఎదురు కావచ్చు. వీరికి రాహు దశ కాలం తల్లిదండ్రుల నీడలో జరిగి పోతుంది కనుక కష్టం తెలియకుండా గడిచిపోతుంది. రాహు దశ అనుకూలిస్తే సమస్యలు తగ్గే అవకాశం ఉంటుంది. 24 సంవత్సరాల వయసులో వచ్చే 16 సంవత్సరాల గురుదశ కారణంగా సమస్యలు కాస్త తగ్గి సుఖం మొదలవుతుంది. ఈ దశలో సంపాదనలో అభివృద్ధి ఉంటుంది. సంపాదించింది జాగ్రత్త చేయాల్సిందే. లేదంటే తరువాత వచ్చే శని దశ కాలంలో ఇబ్బందులు ఎదురవుతాయి. 40 తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కాలంలో సంపాదన కంటే ఖర్చులు అధికమవుతాయి. 59 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపశమనం కలుగుతుంది. మిగిలిన జీవితం ఆటంకాలు లేకుండా సాగిపోతుంది.

ధనిష్ఠ నక్షత్రము రెండవ పాదము

ఈ జాతకులకు ఆవేశం, బుద్ధి కుశలత అధికంగా ఉంటుంది. వ్యాపారం చేయడమంటే అంటే ఆసక్తి కనబరుస్తారు. భూ సంబంధిత వృత్తులు, వ్యాపారాలు, ఉద్యోగాలు అనుకూలం. సైనిక పరమైన వృత్తులు, వ్యాపారాలు, ఉద్యోగాలు అనుకూలం.

ఈ నక్షత్ర జాతకులకు నాలుగు సంవత్సరముల వరకు కుజ దశ ఉంటుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కారణంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. విద్యలో అడ్డంకులు ఉంటాయి. వీరికి రాహు దశ కాలంలో తల్లిదండ్రుల నీడలో జరిగిపోతుంది కనుక అప్పుడు కష్టాలు తెలియకుండా జరిగిపోతుంది. రాహు దశ అనుకూలిస్తే సమస్యలు తగ్గే అవకాశం ఉంటుంది. 22 సంవత్సరాల వయసులో వచ్చే 16 సంవత్సరాల కారణంగా సమస్యలు క్రమంగా తగ్గి సుఖం మొదలవుతుంది. ఈ దశలో సంపాదనలో అభివృద్ధి ఉంటుంది. సంపాదించింది జాగ్రత్త చేయాల్సిన అవసరం ఉంటుంది. లేదంటే తరువాత వచ్చే శని దశ కాలంలో ఆర్థిక సమస్యలు వస్తాయి. 38 తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కాలంలో సంపాదన కంటే ఖర్చులే అధికమవుతాయి. 57 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కాస్త ఉపశమనం కలుగుతుంది. మిగిలిన జీవితం సుఖంగా సాగిపోతుంది.

ధనిష్ఠ నక్షత్రము మూడవ పాదము

వీరికి పట్టుదల గల వ్యక్తులై ఉంటారు. ఆవేశమూ అధికమే. వీరు పరిశుభ్రమైన వాతావరణంలో నివసించడానికి ఆసక్తులై ఉంటారు. వీరు కళాత్మకమైన వస్తు సేకరణ చేయడానికి ఆసక్తులై ఉంటారు. వీరికి జల విద్యుత్, జల, భూ సంబంధిత వృత్తులు, ఉద్యోగం, వ్యాపారం అనుకూలిస్తుంది. సైనిక సంబంధిత, కళా సంబంధిత ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి.

ఈ జాతకులకు రెండు సంవత్సరముల వరకు కుజ దశ ఉంటుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కారణంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. విద్యలో అడ్డంకులు ఉంటాయి. రాహుదశ కాలం తల్లిదండ్రుల నీడలో జరిగిపోవడం వల్ల వీరికి కష్టం తెలియకుండా జరిగిపోతుంది. రాహు దశ అనుకూలిస్తే సమస్యలు తగ్గడానికి అవకాశం. 20 సంవత్సరాల వయసులో వచ్చే 16 సంవత్సరాల కారణంగా సమస్యలు తగ్గి సుఖం మొదలవుతుంది. ఈ దశలో సంపాదనలో అభివృద్ధి

ఉంటుంది. సంపాదించింది జాగ్రత్త చేయవాల్సిందే. లేదంటే తరువాత వచ్చే శని దశ కాలంలో ఇబ్బందులు తప్పవు. 36 తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కాలంలో సంపాదన కంటే ఖర్చులు అధికమవుతాయి. 55 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపశమనం కలుగుతుంది. 72 సంవత్సరాల కాలంలో వచ్చే కేతు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదురుకావచ్చు. కేతు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటన, తీర్థ యాత్రలు అనుకూలిస్తాయి. మిగిలిన జీవితం సాఫీగా జరిగి పోతుంది.

ధనిష్ఠ నక్షత్రము నాలుగవ పాదము

వీరి మీద పరిపూర్ణ కుజ ప్రభావం ఉంటుంది. ఈ జాతకులకు ధైర్యసాహసాలు, ఆవేశం అధికంగా ఉంటాయి. ప్రజా ఉద్యమాలలో వీరు ముందుంటారు. వీరికి సైనిక సంబంధమైన ఉద్యోగాలు, ధైర్య సహసాలు అవసరమైన ఉద్యోగాలు అనుకూలిస్తాయి.

ఈ జాతకులకు ఒక సంవత్సరమువరకు కుజ దశ ఉంటుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కారణంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. విద్యలో అడ్డంకులు ఉంటాయి. రాహు దశ అనుకూలిస్తే సమస్యలు తగ్గే అవకాశం. రాహు దశ కాలంలో తల్లిదండ్రుల నీడలో ఉంటారు కనుక కష్టాలు లేకుండా జరిగిపోతుంది. 19 సంవత్సరాల వయసులో వచ్చే 16 సంవత్సరాల కారణంగా సమస్యలు తగ్గి సుఖం మొదలవుతుంది. ఈ దశలో సంపాదనలో అభివృద్ధి ఉంటుంది. అయితే సంపాదించింది జాగ్రత్త చేసుకోవాల్సిందే. లేదంటే తరువాత వచ్చే శని దశ కాలంలో ఇబ్బందులు ఎదురవుతాయి. 35 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కాలంలో సంపాదన కంటే ఖర్చులు అధికంగా ఉంటాయి. 54 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపశమనం. మిగిలిన జీవితం సాఫీగా సాగిపోతుంది.

ధనిష్ఠా నక్షత్రము ఫలితాలు

ఈ నక్షత్రంలో జన్మించిన వారు మంచి బుద్ధికుశలత కలిగి ఉంటారు. వీరి సరైన తెలివితేటలను ఉపయోగిస్తే శాశ్వత కీర్తి లభిస్తుంది. జీవితంలో ఉన్నత శిఖరాలను అందుకుంటారు. అండగా నిలబడే శక్తివంతమైన వ్యక్తులు జీవితంలో ప్రతి సంఘటనలో ఆదుకుంటారు. అధికారులుగా, రాజకీయ నాయకులుగా, వ్యాపారవేత్తలుగా రాణిస్తారు. చదువు, సంస్కారం ఉపయోగపడే మంచి అధికారిగా రాణిస్తారు. అయితే వీరి అధికార పైఖరి, మొండితనం వల్ల ఇతరుల నుంచి విమర్శలను ఎదుర్కొనవలసిన పరిస్థితి ఎదురవుతుంది.

అనవసరమైన విషయాలను గోప్యంగా ఉంచే ఆత్మీయులను దూరం చేసుకుంటారు. సొమ్ము పొదుపు చేయాలని ప్రయత్నిస్తారు. కాని అది ఆచరణ సాధ్యం కాదు. అందరికీ సాయం చేస్తారు. డబ్బు చేతిలో నిలవదు. స్థిరాస్థుల రుపంలోనే నిలబడతాయి. మేధావులుగా భావిస్తారు కాని ఆత్మీయులకు చెప్పకుండా చేసే పనులు నష్టం కలిగిస్తాయి. దుష్టులకు భాగస్వామ్యం అప్పచెబుతారు. అందువలన నష్టపోతారు. అనవసర వ్యక్తులను నెత్తికి ఎక్కించుకుని అందలం ఎక్కించి కష్టాలు కొని తెచ్చుకుంటారు.

ఈ జాతకులకు గురు, శని, బుధ, మహర్దశలు, శుక్రదశ యోగిస్తాయి. వీరు జమ్మిచెట్టును పెంచడం, పూజించడం వల్ల మెదడుకి సంబంధించిన సమస్యలు తలెత్తవు. అలాగే వీరికి తెలివితేటలు, మంచి వాక్చాతుర్యం, ధైర్యం కలగడానికి, కుటుంబ సభ్యుల అండదండల కొరకు, సంతానాభివృద్ధి కొరకు ఉపయోగపడుతుంది.

**శతభిష నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు**

నక్షత్రములలో ఇది 24వ నక్షత్రము. శతభిషము రాహుగ్రహ నక్షత్రం, అధిదేవత వరుణ దేవుడు, రాక్షసగణము, జంతువు గుర్రం, రాశ్యాధిపతి శని.

శతభిష నక్షత్రము మొదటి పాదము

శతభిషా నక్షత్ర అధిపతి రాహువు. ఈ నక్షత్ర జాతకుల మీద రాహు గ్రహ ప్రభావం అధికంగా ఉంటుంది. ఇది రాక్షసగణ ప్రధాన నక్షత్రం. ఈ కారణం వల్ల వీరు పట్టుదల గల వ్యక్తులై ఉంటారు. ఈ జాతకులకు ఆధ్యాత్మిక విశ్వాసం, ధార్మిక గుణం ఉంటుంది. రచయితలుగా రాణించగలరు. ఉపాధ్యాయ వృత్తి అనుకులిస్తుంది. పసుపు వర్ణ వస్తు సంబంధిత ఉద్యోగ, వృత్తి వ్యాపారాలు వీరికి అనుకూలం.

ఈ జాతకులకు 16 సంవత్సరాల కాలం రాహు దశ ఉంటుంది. కనుక తొలి నుంచే విద్యలో ఆటంకాలు ఎదురవుతాయి. రాహు దశ అనుకూలిస్తే అడ్డంకులు తక్కువగా ఉంటాయి. తల్లిదండ్రుల పెంపక దశలో రాహు దశ సమస్యలు కనిపించకుండా పోతాయి. తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో ఉన్నత చదువులలో అభివృద్ధి కనిపిస్తుంది. ఇక జీవితంలో త్వరగా స్థిరపడతారు. వివాహం కూడా సకాలంలో అవుతుంది. వీరు సంపాదించింది జాగ్రత్త చేసుకోవాల్సిందే. లేదంటే 32 సంవత్సరాలలో వచ్చే 19 సంవత్సరాల శని దశలో సంపాదన కంటే ఖర్చులు అధికమవుతాయి. దీంతో ఆర్థిక ఇబ్బందులు ఎదురవుతాయి.

51 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కారణంగా జీవితంలో కొంత ఉపశమనం కలుగుతుంది. 68 సంవత్సరాల కాలంలో వచ్చే ఏడు సంవత్సరాల కేతు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. కేతు దశ అనుకూలిస్తేనే సమస్యలు తగ్గుతాయి. తీర్ధయాత్రకు, విదేశీ పర్యటనకు అవకాశం ఉంటుంది. 75 సంవత్సరాల తరువాత సమస్యలు తగ్గుముఖం పడతాయి. ఇక వృద్ధాప్య దశ సుఖంగా గడిచిపోతుంది.

శతభిష నక్షత్రము రెండవ పాదము

ఈ నక్షత్ర జాతకుల మీద రాహు శని గ్రహ ప్రభావం ఉంటుంది. ఇది రాక్షసగణ ప్రధాన నక్షత్రం.. కనుక వీరు పట్టుదల గల వ్యక్తులై ఉంటారు. శ్రమించి పట్టుదలతో కార్యాలను నెరవేర్చగలరు. ఈ జాతకులకు పరిశ్రమలు, కర్మాగాలు సంబంధిత ఉద్యోగాలు, వ్యాపారాలు అనుకూలిస్తాయి.

ఈ జాతకులకు 12 సంవత్సరాల కాలం రాహు దశ ఉంటుంది. కనుక తొలి నుంచే విద్యలో ఆటంకాలు ఏర్పడతాయి. రాహు దశ అనుకూలిస్తే అడ్డంకులు తగ్గుతాయి. తల్లిదండ్రుల పెంపక దశలో రాహు దశ సమస్యలు కనిపించకుండానే ముగిసిపోతాయి. తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో మాధ్యమిక చదువులలో అభివృద్ధి కనిపిస్తుంది. జీవితంలో త్వరగా స్థిరపడతారు. వివాహం సకాలంలో జరుగుతుంది. ఇక వీరు సంపాదించింది జాగ్రత్త చేసుకోవాల్సిందే.

లేదంటే 28 సంవత్సరాలలో వచ్చే 19 సంవత్సరాల శని దశలో సంపాదన కంటే ఖర్చులు అధికమవుతాయి. దీంతో ఆర్థిక కష్టాలు వెంటాడుతాయి.

47 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కారణంగా కొంత ఉపశమనం కలుగుతుంది. 64 సంవత్సరాల కాలంలో వచ్చే ఏడు సంవత్సరాల కేతు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. కేతు దశ అనుకూలంగా ఉంటే సమస్యలు తగ్గుతాయి. తీర్ధయాత్రలకు అవకాశం ఉంటుంది. 71 సంవత్సరాల తరువాత సమస్యలు తగ్గుతాయి. వృద్ధాప్య దశ సుఖంగా గడిచిపోతుంది.

శతభిష నక్షత్రము మూడవ పాదము

వీరు పట్టుదల గల వ్యక్తులై ఉంటారు. పట్టుదలతో, శ్రమించి కార్యాన్ని పూర్తి చేయగలరు. వీరికి పరిశ్రమలు, కర్మగాలు సంబంధిత ఉద్యోగాలు, వ్యాపారాలు అనుకూలిస్తాయి. వీరికి స్థిరమైన అభిప్రాయాలు ఉంటాయి.

ఈ జాతకులకు ఎనిమిది సంవత్సరాల కాలం రాహుదశ ఉంటుంది. కనుక ఆరంభ విద్యలో ఆటంకాలు ఎదురవుతాయి. రాహుదశ అనుకూలిస్తే అడ్డంకులు తక్కువగా ఉంటాయి. తల్లిదండ్రుల పెంపక దశలో రాహు దశ సమస్యలు ప్రభావం చూపే అవకాశం లేదు. తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కాలంలో చదువులలో అభివృద్ధి కనిపిస్తుంది. జీవితంలో త్వరగానే స్థిరపడతారు. వివాహం సకాలంలో జరుగవచ్చు. 24 సంవత్సరాలలో వచ్చే 19 సంవత్సరాల శని దశ వస్తుంది. దీంతో సంపాదన కంటే ఖర్చులే అధికంగా ఉంటాయి. 43 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కారణంగా కొంత ఉపశమనం కలుగుతుంది.

60 సంవత్సరాల కాలంలో వచ్చే 7 సంవత్సరాల కేతు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. కేతుదశ అనుకూలంగా ఉంటే సమస్యలు తగ్గుతాయి. తీర్ధ యాత్రకు, విదేశీ పర్యటనకు అవకాశం ఉంటుంది. 67 సంవత్సరాల తరువాత సమస్యలు తగ్గుతాయి. తరువాత 20 సంవత్సరాల శుక్ర దశ కాలంలో తిరిగి సుఖం మొదలవుతుంది. వృద్ధాప్య దశ సుఖంగానే గడిచిపోతుంది.

శతభిష నక్షత్రము నాలుగవ పాదము

వీరు పట్టుదల గల వ్యక్తులై ఉంటారు. ఇక వీరికి ఆధ్యాత్మిక విశ్వాసం, ధార్మిక గుణం ఉంటుంది. వీరు రచయితలుగానూ రాణించే నేర్పు ఉంటుంది. ఉపాధ్యాయ వృత్తి వీరికి అనుకులిస్తుంది. పసుపు వర్ణ వస్తు సంబంధిత ఉద్యోగ, వృత్తి వ్యాపారాలు వీరికి అనుకూలిస్తాయి.

ఈ జాతకులకు నాలుగు సంవత్సరాల కాలం మాత్రమే రాహు దశ ఉంటుంది. కనుక తొలి నుంచే విద్యభ్యాసం నిరాటంకంగా కొనసాగుతుంది. నాలుగు సంవత్సరాల తరువాత వచ్చే 16 సంవత్సరాల గురు దశ కారణంగా చదువు ఆటంకాలు లేకుండా సాగుతుంది. అయితే ఉన్నత విద్యాభ్యాసంలో అడ్డంకులు తప్పకపోవచ్చు. పట్టుదలతో విజయం సాధించాల్సి ఉంటుంది. 20 సంవత్సరాలలోవచ్చే 19 సంవత్సరాల శని దశలో సంపాదన కంటే ఖర్చులు అధికంగా ఉంటాయి. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో జాప్యం కలుగుతుంది.

39 సంవత్సరాల తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కారణంగా కొంత ఉపశమనం కలుగుతుంది. 56 సంవత్సరాల కాలంలో వచ్చే 7 సంవత్సరాల కేతుదశ కాలంలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. కేతు దశ అనుకూలంగా ఉంటే సమస్యలు తగ్గుతాయి. తీర్థయాత్రకు, విదేశీ పర్యటనకు అవకాశం ఉంటుంది. 63 సంవత్సరాల తరువాత సమస్యలు తగ్గుతాయి. తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్రదశ కాలంలో తిరిగి సుఖం మొదలవుతుంది. వృద్ధాప్య దశ సుఖంగా గడిచిపోతుంది.

శతభిష నక్షత్రము - ఫలితాలు

ఈ నక్షత్ర జాతకులకు విద్యభ్యాసం కొంతకాలం మందకొడిగా సాగినా.. క్రమంగా ఎగుమతి వ్యాపారం కలసి వస్తుంది. రవాణా వ్యాపారం కొంత కాలం కలసి వస్తుంది. వీరికి సకాలంలో వివాహం జరుగుతుంది. మధ్యవర్తిగా, కమీషన్ ఏజెంటుగా, వ్యాపారవెత్తలుగా రాణిస్తారు. పురాతన ఆస్తుల వలన లాభాలతో పాటు, చిక్కులు కూడా ఎదుర్కొంటారు. స్థిరమైన ఉద్యోగం, సంపాదన లేక కొంతకాలం ఇబ్బందులు ఎదురవుతాయి. శని మహర్ధశలో స్థిరత్వం సాధిస్తారు. రాజకీయ వ్యూహం ఫలిస్తుంది. ఉద్యోగంలో ఇబ్బందులు ఉన్నా వాటిని అధిగమిస్తారు.

వివాహాది శుభకార్యాలు వాయిదా పడినా పట్టుదలతో వాటిని సాధిస్తారు. కోరికలు, అవసరాలు అనంతంగా ఒకదాని వెంట ఒకటి పుట్టుకు వస్తూనే ఉంటాయి. ఆత్మీయులతో అరమరికలు లేకుండా మెలగడం వల్ల మేలు జరుగుతుంది. ఇతరుల మెప్పు కొరకు అయిన వారిని దూరం చేసుకోవద్దు. ఆధ్యాత్మిక చింతన, నైతిక ధర్మం సదా కాపాడుతుంది. బాల్యం దశలో కొంత కాలం జరిగిన తరువాత సుఖం మొదలవుతుంది. జీవితం సాధారణంగా చిక్కులు లేకుండా సాగుతుంది. జాతక చక్రంలోని గ్రహస్థితుల వల్ల మార్పులు తప్పవు.

**పూర్వాభాద్ర నక్షత్రము - ఫలితాలు**

నక్షత్రములలో పూర్వాభాద్ర 25వ నక్షత్రము. పూర్వాబాధ్ర నక్షత్రాధిపతి గురువు. అధిదేవత అజైకపాదుడు. మానవ గణము. జంతువు సింహము. రాశ్యాధిపతులు శని, గురువులు.

పూర్వాభాద్ర నక్షత్రము మొదటి పాదము
పూర్వాభాద్ర నక్షత్రము అధిపతి గురువు. ఈ జాతకుల మీద కుజ, గురు ప్రభావం ఉంటుంది. ఇది దేవగణ నక్షత్రము. ఈ నక్షత్ర జాతకులు సత్వగుణ ప్రధానులుగా ఉంటారు. కుజ ప్రభావం కారణంగా ఆవేశం ఉన్నా దాని మీద నియంత్రణ కలిగి ఉంటారు. వీరికి ధైర్యసాహసాలు అధికం. అధ్యాత్మిక విశ్వాసం కలిగి ఉంటారు. ఈ జాతకులకు భూ సంబంధిత, సైనికపరమైన, సాహసాలు ప్రదర్శించగలిగిన రక్షణ శాఖ అగ్నిమాపకం, ఆటవిక సంబంధిత ఉద్యోగాలు అనుకూలిస్తాయి. శిక్షకులు, ఉపాధ్యాయులు వంటి ఉద్యోగాలు కూడా అనుకూలిస్తాయి. పసుపు వర్ణ, రక్తవర్ణ సంబంధ ఉద్యోగాలు, వృత్తులు, వ్యాపారాలు అనుకూలం. వీరికి వ్యవసాయం కూడా కలిసి వస్తుంది.

ఈ జాతకులకు 14 సంవత్సరాల వరకు గురు దశ ఉంటుంది. ఈ కారణం వల్ల మొదటి నుంచి విద్యభ్యాసంలో రాణిస్తారు. అయినప్పటికీ 14 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కారణంగా విద్యలో మందకొడితనం నెలకొంటుంది. పట్టుదలతో విద్యలో విజయం సాధించవచ్చు. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో జాప్యం

జరగవచ్చు. సంపాదన కంటే ఖర్చులు అధికం. 33 సంవత్సరాలలో వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపశమనం లభిస్తుంది. 50 సంవత్సరాల తరువత వచ్చే కేతు దశ కారణంగా కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. కేతు దశ అనుకూలంగా ఉంటే విదేశీ పర్యటనలు, తీర్ధయాత్రలు అనుకూలిస్తాయి. 57 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కారణంగా జీవితంలో మళ్ళీ సుఖం మొదలువుతుంది. మిగిలిన జీవితం సాఫీగా సాగిపోతుంది. వృద్ధాప్య దశ కూడా సుఖంగా గడిచిపోతుంది.

పూర్వాభాద్ర నక్షత్ర రెండవ పాదము

వృషభరాశి అధిపతి శుక్రుడు. పూర్వాభాద్ర నక్షత్ర అధిపతి గురువు. కనుక ఈ జాతకుల మీద శుక్ర గురు ప్రభావం ఉంటుంది. ఇది దేవ గణ నక్షత్రం. వీరు సత్వగుణ ప్రధానులుగా ఉంటారు. ఉపాధ్యాయులు, ఉన్నత ఉపాద్యాయులు, మత బోధకులు, మత గురువులు వంటి వృత్తి ఉద్యోగాలు అనుకూలం. పసుపు వర్ణ, శ్వేత వర్ణ సంబంధిత ఉద్యోగాలు, వృత్తులు, వ్యాపారాలు అనుకూలిస్తాయి. జల సంబంధిత, పర్యాటక సంబంధిత వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు వీరికి అనుకూలం.

ఈ జాతకులకు పది సంవత్సరాల వరకు గురు దశ ఉంటుంది. కనుక ఆరంభం నుంచి విద్యలో రాణిస్తారు. అయినప్పటికీ 14 సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కారణంగా విద్యభ్యాసంలో మందకొడితనం నెలకొంటుంది. పట్టుదలతో విద్యలో విజయం సాధించాల్సి ఉంటుంది. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో జాప్యం జరిగే అవకాశం. 29 సంవత్సరాలలో వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో కొంత ఉపశమనం లభిస్తుంది. 46 సంవత్సరాల తరువత వచ్చే కేతు దశ కారణంగా కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. కేతు దశ అనుకూలంగా ఉంటే విదేశీ పర్యటనలు, తీర్ధయాత్రలు అనుకూలిస్తాయి. 53 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కారణంగా జీవితంలో మళ్ళీ సుఖం మొదలవుతుంది. మిగిలిన జీవితం సాఫీగా సాగిపోతుంది. వృద్ధాప్య దశ కూడా సుఖంగా గడిచిపోతుంది.

పూర్వాభాద్ర నక్షత్రము మూడవ పాదము

పూర్వాభాద్ర నక్షత్ర అధిపతి గురువు. వీరి మీద బుధ గురు గ్రహ ప్రభావం ఉంటుంది. ఇది దేవగణ నక్షత్రం. వీరు సత్వగుణ ప్రధానులుగా ఉంటారు. ఉపాధ్యాయులు, ఉన్నత ఉపాధ్యాయులు వంటి వృత్తి ఉద్యోగాలు అనుకూలిస్తాయి. పసుపు వర్ణ వస్తు సంబంధిత ఉద్యోగాలు, వృత్తులు, వ్యాపారాలు అనుకూలం. భూ సంబంధిత, విద్యా సంబంధిత వృత్తులు, ఉద్యోగాలు, వ్యాపారాలు వీరికి అనుకూలం.

ఈ జాతకులకు ఆరు సంవత్సరాల వరకు మాత్రమే గురు దశ ఉంటుంది. ఆరు సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కారణంగా విద్యలో మందకొడితనం నెలకొంటుంది. పట్టుదలతో విద్యలో విజయం సాధించవచ్చు. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో జాప్యం కలిగే అవకాశం. 25 సంవత్సరాలలో వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో జీవితం సాఫీగా సాగిపోతుంది. 42 సంవత్సరాల తరువత వచ్చే కేతు దశ కారణంగా కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలంగా ఉంటే విదేశీ పర్యటనలు, తీర్ధయాత్రలు అనుకూలిస్తాయి. 49 సంవత్సరాల తరువాత వచ్చే శుక్రదశ కారణంగా జీవితంలో మళ్ళీ సుఖం మొదలవుతుంది. మిగిలిన జీవితం, వృద్ధాప్య దశ సాఫీగా సాగిపోతుంది.

పూర్వాభాద్ర నక్షత్ర నాలుగవ పాదము

ఇది దేవగణ నక్షత్రం. వీరు సత్వగుణ ప్రధానులుగా ఉంటారు. వీరికి ఉపాధ్యాయ వృత్తి ఉద్యోగాలు అనుకూలిస్తాయి. పసుపు వర్ణ, శ్వేతవర్ణ వస్తు సంబంధిత ఉద్యోగాలు, వృత్తులు, వ్యాపారాలు అనుకూలం. ఔషధ సంబంధిత వృత్తులు, వ్యాపారాలు, ఉద్యోగాలు వీరికి అనుకూలిస్తాయి.

ఈ జాతకులకు రెండు సంవత్సరాల వరకు మాత్రమే గురు దశ ఉంటుంది. రెండు సంవత్సరాల తరువాత వచ్చే 19 సంవత్సరాల శని దశ కారణంగా విద్యలో మందకొడితనం నెలకొంటుంది. పట్టుదలతో విద్యలో విజయం సాధించవచ్చు. జీవితంలో నిదానంగా స్థిరపడతారు. వివాహంలో జాప్యం కలిగే అవకాశం. 21 సంవత్సరాలలో వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో ఉన్నత విద్యలో అభివృద్ధి కనిపిస్తుంది. సకాలంలో జీవితంలో స్థిరపడతారు. వివాహం సకాలంలో జరుగుతుంది. జీవితం సాఫీగా సాగిపోతుంది. 38 సంవత్సరాల తరువత వచ్చే కేతు దశ కారణంగా కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. కేతు దశ అనుకూలంగా ఉంటే విదేశీ పర్యటనలు, తీర్ధయాత్రలు అనుకూలమవుతాయి. 45 సంవత్సరాల తరువాత వచ్చే శుక్రదశ కారణంగా మళ్ళీ సుఖ జీవనం మొదలవుతుంది. మిగిలిన జీవితం, వృద్ధాప్య దశ సాఫీగా సాగిపోతుంది.

పూర్వాభధ్ర నక్షత్రము - ఫలితాలు

ఈ నక్షత్ర జాతకులు సాహిత్య, కళారంగాలలో రాణిస్తారు. వీరికి ఉపాధ్యాయ వృత్తి ఉద్యోగాలు అనుకూలం. దేశవిదేశాలలో విహరిస్తారు. జీవితంలో ఇబ్బందులు ఉంటాయి కాని ధనం అప్పటికప్పుడు అందివస్తుంది. అదృష్టం వలన పైకి వచ్చారన్న ప్రచారం ఉంటుంది. వీరికి గురువుల, మేధావుల సహకారం ఉంటుంది. ఇతర రంగాల గురించి కూడా మంచి అవగాహన ఉంటుంది. పెద్దల పట్ల గౌరవం, భయం ఉంటాయి. వృత్తి, ఉద్యోగాల పరంగా ఎవరి సలహాలు తీసుకోరు. ఏక పక్ష ధోరని వలన కష్టాలు ఎదుర్కొంటారు.

స్నేహాలు, విరోధాలు వెంటవెంటనే ఏర్పడతాయి. వ్యతిరేకమైన అభిప్రాయాలను వ్యక్తపరచి సమస్యలను కొని తెచ్చుకుంటారు. ఉద్యోగపరంగా నిజాయితీ, సత్ప్రవర్తన కారణంగా విరోధాలు వస్తాయి. వీరి శక్తిని వీరికి ఇతరులు చెప్పే వరకు వీరికి తెలియదు. ఆర్ధిక స్థిరత్వం సాధించిన తరువాత దానగుణం మొదలవుతుంది. పిసినారితనం ఉండదు. తనకు మాలిన దానం చెయ్యరు. సామాజిక సేవలో పేరు వస్తుంది. రాజకీయంలో రాణిస్తారు. వైవాహిక జీవితం సాధారణము. బాల్యం సాఫీగా, తరువాత జీవితం సాధారణంగా ఉంటుంది.

**ఉత్తరాబాద్ర నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు**

నక్షత్రములలో ఉత్తరాబాద్ర 26వ నక్షత్రము. ఉత్తరాభద్ర నక్షత్ర అధిపతి శని, రాశ్యాధిపతి గురువు, మానవగణం, జంతువు ఆవు.

ఉత్తరాబాద్ర నక్షత్రము మొదటి పాదము

వీరికి తండ్రితో వ్యతిరేకత ఏర్పడవచ్చు. ఆధ్యాత్మిక విశ్వాసం ఉంటుంది. శ్రమించి పనిచేయగలరు. వీరికి ప్రభుత్వ ఉద్యోగాలు లభించే అవకాశాలున్నాయి. పరిశ్రమలు, కర్మాగారాలు ఉద్యోగ, వ్యాపారాలు అనుకూలిస్తాయి. వీరికి సమయాను కూలంగా ప్రవర్తించే నేర్పు ఉంటుంది. ఇక ఈ జాతకులకు సాంకేతిక విద్యలు, వృత్తి విద్యలు అనుకూలిస్తాయి.

ఈ జాతకులకు 17 సంవత్సరాల పాటు శని దశ ఉంటుంది. శని దశ కాలంలోవిద్య కాస్త మందకొడిగా సాగుతుంది. తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో అనుకూలత ఏర్పడి ఉన్నత విద్యాభ్యాసం బాగాసాగుతుంది. సకాలంలోనే జీవితంలో స్థిరపడతారు. వివాహం కూడా సకాలంలో అవుతుంది. 34 సంవత్సరాల తరువాత వచ్చే ఏడు సంవత్సరాల కేతు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు, విదేశీ ఉద్యోగావకాశాలు కలిసి వస్తాయి. 41 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కాలంలో సంపాదనలో అభివృద్ధి కనిపిస్తుంది. తరువాత జీవితం సాఫీగా సాగుతుంది. వృద్ధాప్య దశ కూడా సాఫీగానే సాగుతుంది.

ఉత్తరాబాద్ర నక్షత్రము రెండవ పాదము

ఈ జాతకుల మీద బుధ శని గ్రహ ప్రభావం ఉంటుంది. ఇది మానవగణ నక్షత్రము. ఈ జాతకులకు సమయానుకూలంగా వ్యవహరించే నేర్పు ఉంటుంది. వీరికి వ్యాపారం అంటే ఆసక్తి. వ్యాపారం అనుకులిస్తుంది కూడా. వీరికి విద్యా సంబంధిత, పరిశ్రమల సంబంధిత వృత్తులు, ఉద్యోగం, వ్యాపారం అనుకూలిస్తాయి. వీరికి సాంకేతిక, వృత్తి విద్యలు అనుకూలిస్తాయి. వీరు బుద్ధి కుశలత కలిగి ఉంటారు.

ఈ జాతకులకు 13 సంవత్సరాలు శని దశ ఉంటుంది. శని దశ కాలంలో విద్య మందకొడిగా సాగుతుంది. తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో అభివృద్ధి కలిగి ఉన్నత విద్యాభ్యాసం సక్రమంగా సాగుతుంది. సకాలంలోనే జీవితంలో స్థిరపడతారు. వివాహం కూడా సకాలంలోనే జరుగుతుంది. 30 సంవత్సరాల తరువాత వచ్చే ఏడు సంవత్సరాల కేతుదశ కాలంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలిస్తే విదేశీ ఉద్యోగావకాశాలు, విదేశీ పర్యటనలు కలిసి వస్తాయి. 37 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కాలంలో సంపాదనలో మంచి ఫలితాలు కలుగుతాయి. తరువాత జీవితం సాఫీగా సాగుతుంది. వృద్ధాప్య దశ కూడా సాఫీగా గడిచిపోతుంది.

ఉత్తరాబాద్ర నక్షత్రము మూడవ పాదము

వీరికి సమయానుకూలంగా ప్రవర్తించే సామర్ధ్యం ఉంటుంది. వీరు ప్రత్యేక ఆకర్షణ కలిగి ఉంటారు. వీరికి నౌకలలో ఉద్యోగాలు, వ్యాపారాలు అనుకూలిస్తాయి. వీరికి సాంకేతిక విద్యలు, వృత్తి విద్యలు అనుకూలిస్తాయి.

ఈ జాతకులకు తొమ్మిది సంవత్సరాలు శని దశ ఉంటుంది. శని దశ కాలంలో విద్య మందకొడిగా సాగుతుంది. తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో అభివృద్ధి కలిగి ఉన్నత విద్యాభ్యాసం సాఫీగా సాగుతుంది. ఈ జాతకులు సకాలంలో జీవితంలో స్థిరపడతారు. వివాహం కూడా సకాలంలోనే జరుగుతుంది. 26 సంవత్సరాల తరువాత వచ్చే 7 సంవత్సరాల కేతుదశ కాలంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు, అక్కడఉద్యోగావకాశాలు కలిసి వస్తాయి. 33 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కాలంలో సంపాదనలో అభివృద్ధి కనిపిస్తుంది. తరువాత జీవితం, వృద్ధాప్య దశ సాఫీగా సాగిపోతుంది.

ఉత్తరాబాద్ర నక్షత్రము నాలుగవ పాదము

వీరికి సమయానుకూలంగా ప్రవర్తించే సామర్ధ్యం ఉంటుంది. వీరికి ధైర్యం, ఆవేశం ఉంటాయి. భావోద్వేగాల విషయంలో తమ మీద తమకు నియంత్రణ కలిగి ఉంటారు. వీరికి విద్యుత్, పరిశ్రమలు, వ్యవసాయం వృత్తులు వ్యాపారం ఉద్యోగం అనుకూలిస్తాయి. సాంకేతిక విద్యలు, వృత్తి విద్యలు కూడా అనుకూలిస్తాయి.

ఈ జాతకులకు ఐదు సంవత్సరాలు శని దశ ఉంటుంది. శని దశ కాలంలో విద్య మందకొడిగా సాగుతుంది. తరువాత వచ్చే 17 సంవత్సరాల బుధ దశ కాలంలో అభివృద్ధి కలిగి ఉన్నత విద్యాభ్యాసం సాఫీగా సాగుతుంది. సకాలంలో జీవితంలో స్థిరపడతారు. వివాహం కూడా సకాలంలోనే జరుగుతుంది. 22 సంవత్సరాల తరువాత వచ్చే ఏడు సంవత్సరాల కేతు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలిస్తే విదేశీ పర్యటనలు, అక్కడి ఉద్యోగావకాశాలు కలిసి వస్తాయి. 29 సంవత్సరాల తరువాత వచ్చే శుక్ర దశ కాలంలో సంపాదనలో అభివృద్ధి కనిపిస్తుంది. తరువాత జీవితం సాఫీగా సాగుతుంది. 72 సంవత్సరాల వచ్చే18 సంవత్సరాల రాహు దశ కాలంలో కాస్త ఒడిదుడికులు ఎదుర్కొంటారు.

ఉత్తరాబాద్ర నక్షత్రము ఫలితాలు

ఈ నక్షత్ర జాతకులకు అన్ని విషయాల మీద కనీస అవగాహన ఉంటుంది. ఇతరులకు అనవసరంగా ఖర్చు చేయరు. ఇతరుల సొమ్మును ఆశించరు. వీరు చదువు మీద మంచి పట్టు సాధిస్తారు. ఉన్నత విద్యాభ్యాసం చేస్తారు. విదేశీ విద్య, అధికార పదవులు, వ్యాపారం కలసి వస్తాయి. వివాహ జీవితం బాగా ఉంటుంది. చక్కటి వ్యూహరచనతో పొదుపుగా సంసారాన్ని సాగిస్తారు.

కుటుంబ చరిత్ర, తండ్రి వలన మేలు జరుగుతుంది. ఇతర భాషలు నేర్చుకుంటారు. మంచి హాస్య ప్రియులు. అబద్ధాలు చెప్పి ఇతరులను మోసగించరు. మంచి స్నేహస్ఫూర్తి కలిగి ఉంటారు. ఉన్నత స్థితిలో ఉన్నవారికి ఇష్టులుగా, సలహాదారులుగా ఉంటారు. మంచి స్నేహస్ఫూర్తి కలిగి ఉంటారు. వీరి జీవితం సాఫీగా జరిగి పోతుంది. 30 నుండి 40 సంవత్సరాల తరువాత జీవితంలో అభివృద్ధి కలుగుతుంది. ఇది నక్షత్ర జాతకులు అందరికీ సామాన్య ఫలితాలు.

**రేవతి నక్షత్రము - గుణగణాలు, ఫలితాలు**

నక్షత్రములలో ఇది 27వ నక్షత్రము. రేవతీ నక్షత్ర అధిపతి బుధుడు, అధిదేవత పూషణుడు, గణము దేవగణం, రాశ్యాధిపతి గురువు.

రేవతి నక్షత్రము మొదటి పాదము

రేవతి నక్షత్ర అధిపతి బుధుడు. ఈ నక్షత్రంలోని మొదటి పాదము జాతకుల మీద గురు బుధ గ్రహ ప్రభావం ఉంటుంది. ఇది దేవగణ నక్షత్రం. వీరికి ప్రధానంగా సత్వగుణం ఉంటుంది. అధ్యాత్మిక విశ్వాసం కలిగి ఉంటారు. వీరికి విద్యాసంస్థలు స్థాపించి నిర్వహించ గలిగే నేర్పు ఉంటుంది. విద్యా సంబంధిత వృత్తులు, వ్యాపారం, ఉద్యోగాలు అనుకూలం.

ఈ జాతకులకు 16 సంవత్సరాల వరకు బుధ దశ ఉంటుంది. వీరు విద్యారంభం నుంచి ప్రతిభ చూపిస్తారు. 16 సంవత్సరాల తరువాత ఏడు సంవత్సరాల కేతు దశ కాలంలో విద్యసాధన విషయంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. ప్రయత్నపూర్వకంగా అడ్డంకులను అధిగమించి విజయం సాధించాలి. కేతు దశ అనుకూలిస్తే సమస్యలు ఉండవు. తరువాత 23 సంవత్సరాల శుక్ర దశ కాలంలో విద్యలో అభివృద్ధి ఉంటుంది. శుక్రదశ కాలంలో విద్య కంటే విలాసాల మీద ఆసక్తి అధికం. కాబట్టి పట్టుదలతో విద్య సాధనలో విజయం సాధించాల్సి ఉంటుంది. సకాలంలో జీవితంలో స్థిరపడతారు. సకాలంలో వివాహం జరుగుతుంది. 66 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా జరుగుతుంది. తరువాత వచ్చే 18

సంవత్సరాల రాహు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. రాహు దశ అనుకూలిస్తే విదేశీ ఉద్యోగావకాశాలు, విదేశీ పర్యటనలు కలిసి వస్తాయి.

రేవతి నక్షత్ర రెండవ పాదము

వీరు ఆధ్యాత్మిక విశ్వాసం కలిగి ఉంటారు. వీరు శ్రమకు ఓర్చి పని చేయగలరు. వీరికి భూ సంబంధిత, వాయు సంబంధిత ఉద్యోగాలు, వృత్తులు, వ్యాపారాలు అనుకూలిస్తాయి. వీరికి సాంకేతిక విద్య అనుకులిస్తుంది. న్యాయ సంబంధిత విద్య కూడా వీరికి అనుకూలిస్తుంది.

ఈ జాతకులకు 12 సంవత్సరాల వరకు బుధ దశ ఉంటుంది. వీరు మొదటి నుంచి విద్యాలో ప్రతిభ చూపిస్తారు. 12 సంవత్సరాల తరువాత ఏడు సంవత్సరాల కేతు దశ కాలంలోవిద్యలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. ప్రయత్నపూర్వకంగా అడ్డంకులను అధిగమించి విజయం సాధించాలి. కేతు దశ అనుకూలిస్తే సమస్యలు ఉండవు. 19 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కాలంలో విద్యలో అభివృద్ధి ఉంటుంది. శుక్ర దశ కాలంలో విద్యకంటే విలాసాల మీద ఆసక్తి అధికం. కాబట్టి పట్టుదలతో మనసును విద్య వైపు మళ్ళించి విజయం సాధించాలి. ఇక వీరు సకాలంలోనే జీవితంలో స్థిరపడతారు. సకాలంలో వివాహం అవుతుంది. 62 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా సాగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహు దశ కాలంలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. రాహు దశ అనుకూలిస్తే విదేశీఉద్యోగావకాశాలు, విదేశీపర్యటనలు కలిసి వస్తాయి. 80 సంవత్సరాలకు వచ్చే 16 సంవత్సరాల గురు దశ కారణంగా జీవితం మళ్లీ గాడిలో పడుతుంది. ఇక వృద్ధాప్య దశ సాఫీగా సాగిపోతుంది.

రేవతి నక్షత్రము మూడవ పాదము

వీరు శ్రమకు ఓర్చి పని చేయగలరు. వీరికి భూసంబంధిత, వాయు సంబంధిత ఉద్యోగాలు, వృత్తులు, వ్యాపారాలు అనుకూలిస్తాయి. వీరికి సాంకేతిక విద్య అనుకూలిస్తుంది. న్యాయ సంబంధిత విద్య కూడా వీరికి అనుకూలిస్తుంది. వీరు స్థిరమైన అభిప్రాయాలు కలిగి ఉంటారు.

ఈ జాతకులకు ఐదు సంవత్సరాల వరకు మాత్రమే బుధదశ ఉంటుంది. కనుక వీరికి విద్యారంభంలో ఆటంకాలు ఎదుర్కొంటారు. ఐదు సంవత్సరాల తరువాత ఏడు సంవత్సరాల కేతుదశ కాలంలోవిద్యలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. ప్రయత్నపూర్వకంగా అడ్డంకులను అధిగమించి విజయం సాధించాలి. కేతుదశ అనుకూలిస్తే సమస్యలు ఉండవు. 12 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కాలంలో విద్యలో అభివృద్ధి ఉంటుంది. శుక్రదశ కాలంలో విద్య కంటే విలాసాల మీదికే మనసు మళ్లుతుంది. కాబట్టి పట్టుదలతో మనసును విద్య వైపు మళ్ళించి సఫలం కావాలి. ఈ జాతకులు సకాలంలో జీవితంలో స్థిరపడతారు. వీరికి సకాలంలోనే వివాహం జరుగుతుంది. 55 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా జరుగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కాలంలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. రాహు దశ అనుకూలిస్తే విదేశీ ఉద్యోగావకాశాలు, విదేశీ పర్యటనలు కలిసి వస్తాయి. 73 సంవత్సరాలకు వచ్చే 16 సంవత్సరాల గురు దశ కారణంగా జీవితంలో తిరిగి సుఖం వస్తుంది. వృద్ధాప్య దశ కూడా సౌఖ్యంగా గడుస్తుంది.

రేవతి నక్షత్రము నాలుగవ పాదము

వీరికి విద్య సంస్థలు స్థాపించి నిర్వహించ కలిగిన సామర్ధ్యం ఉంది. వీరికి విద్యా సంబంధిత వృత్తులు, వ్యాపారం, ఉద్యోగాలు అనుకూలిస్తాయి. వీరికి నాలుగు సంవత్సరాల వరకు మాత్రమే బుధ దశ ఉంటుంది. కనుక వీరికి విద్యారంభంలో ఆటంకాలు ఎదురవుతాయి.

నాలుగు సంవత్సరాల తరువాత ఏడు సంవత్సరాల కేతుదశ కాలంలో విద్యలో కొన్ని సమస్యలు ఎదురవుతాయి. కేతు దశ అనుకూలిస్తే సమస్యలు ఉండవు. 11 సంవత్సరాల తరువాత వచ్చే 20 సంవత్సరాల శుక్ర దశ కాలంలో విద్యలో అభివృద్ధి ఉంటుంది. శుక్రదశ కాలంలో విద్య కంటే విలాసాల మీద ఆసక్తి ఉంటుంది కనుక మనసును పట్టుదలతో విద్య వైపు మళ్ళించి విజయం సాధించాలి. ఇక వీరు సకాలంలో జీవితంలోనే స్థిరపడతారు. వివాహం కూడా సకాలంలో జరుగుతుంది. 54 సంవత్సరాల వరకు జీవితం సాఫీగా జరుగుతుంది. తరువాత వచ్చే 18 సంవత్సరాల రాహుదశ కాలంలో కొన్ని సమస్యలు ఎదుర్కొంటారు. రాహు దశ అనుకూలిస్తే విదేశీ ఉద్యోగావకాశాలు, విదేశీ పర్యటనలు కలిసి వస్తాయి. 72 సంవత్సరాలకు వచ్చే 16 సంవత్సరాల గురుదశ కారణంగా జీవితంలో తిరిగి సౌఖ్యం వస్తుంది. వృద్ధాప్యం సాఫీగా గడిచిపోతుంది.

రేవతీ నక్షత్రము ఫలితాలు

ఈ నక్షత్రమున జన్మించిన వాడు రూపవంతుడు, ధనవంతుడు, భోగములను అనుభవించువాడు, పాండిత్యము కలవాడై ఉంటారని శాస్త్రం చెబుతోంది. చరరూప ధన సంపదలు కలవారు. ఈ నక్షత్రంలో పుట్టిన వారు కనిపించని మేధావులు. ఆడంబరం తక్కువ. గణితంలో ప్రజ్ఞ కలిగి ఉంటారు. వివాదాలకు, తగాదాలకు దూరంగా ఉంటారు. అనేక రకాల విజ్ఞాన గ్రంథాలను పఠిస్తారు. వేదవేదాంగాలను తెలుసుకోవాలన్న ఆసక్తి కలిగి ఉంటారు. ఇతరుల ధనానికి ఆశపడరు. కష్టపడే మనస్తత్వము ఉంటుంది.

ప్రశాంతంగా నిదానంగా సమాధానాలను చెప్తారు. సమస్యలను పక్కన పెట్టిచక్కగా నిద్రిస్తారు. ఆర్ధిక ప్రగతిని తొందరగానే సాధిస్తారు. త్వరితంగా కోపం రాదు. వ్యాపారంలో మోసం చేసే భాగస్వాముల నుంచి తప్పించుకుంటారు. ముఖ్యమైన సమయాలలో సహాయం చెసే ఆత్మీయుల అండదండ ఉండదు. ఒక వేళ ఉన్నా ప్రయోజనం ఉండదు. దూరప్రాంతాలలో చదువుకుని స్థిరపడడా నికి బంధువుల సహకారం ఉంటుంది. కీలకమైన అధికార పదవులలో వినూత్న వ్యాపారాలలో రాణిస్తారు. ప్రజలలో మంచి పేరు ఉంటుంది. నమ్ముకున్న వారిని కుటుంబాన్ని పైకి తీసుకురావడానికి ప్రయత్నిస్తారు. సహాయం చేస్తారు. వివాహ జీవితంలో ఒడిదుడుకులు ఉన్నా సర్దుకు పోతారు.
మంచితనంతో జీవితంలో ముఖ్యమైన విషయాలను అనుకూలం చేసుకుంటారు. విద్యాభ్యాసంలో కలిగే అవరోధాలను అధిగమించి ముందుకు సాగితే రాణిస్తారు. బాల్యం నుంచే తెలివితేటలను ప్రదర్శిస్తారు.

# నక్షత్రాలు

ఆకాశంలో సూర్యుడు మొదలయిన నవగ్రహాలు ఇతర ఉపగ్రహాలు అన్నీ తిరిగే ప్రదేశం విశ్వాంతరాళంలో 16 డిగ్రీల మధ్యలో జరుగుతుంది. ఆ మార్గాన్ని కాంతి మార్గమని, భాచక్రమని అంటారు. 360డిగ్రీలు గా ఉన్నఆ మార్గాన్ని 27 భాగాలుగా విభజింపబడింది. 27 నక్షత్రాలను ఆయా భాగాలుగా గుర్తించారు. అవే అశ్విన్యాది నక్షత్రాలు. అశ్విని నుండి రేవతి వరుకు ఉండే 27 నక్షత్రాలలో శుభాశుభమైన వానిని పంచాంగం సూచిస్తుంది. ఏయే నక్షత్రాలు వల్ల ఏ విధమైన ఫలితాలు ఉంటాయో, ఏ సమయంలో ఎటువంటి పనులు చేయవలెనో కూడా పంచాంగం నిర్దేశిస్తుంది. ఒక రోజు చంద్రుడు ఏ నక్షత్రంలో ఉంటాడో ఆ రోజు ఆ నక్షత్రంగా చెప్పబడుతుంది.

**1. అశ్వని:** ఈ నక్షత్రము నందు జన్మించిన వారు విద్యావంతుడు, బుద్ధి, ధైర్యము, సామర్ధ్యము, స్వతంత్ర శీలుడు, అభిమానియు, కులశ్రేష్ఠుడు, జ్యేష్ఠ భ్రాత్రయు, సీమంత పుత్రుడు, సుందరుడు, జనులకు ఇష్టుడు అయి ఉండును.

**2. భరణి:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు శాంత బుద్ధి, చపల చిత్తుడు, స్త్రీల యందు ఆసక్తి కల వాడు, సత్యమును పల్కు వాడు, సుఖమును పొందు వాడు, బంధువులకు సహాయము చేయువాడు, పుత్రులు తక్కువ ఉన్న వాడు, దీర్ఘాయుష్షు గల వాడు అయి ఉండును.

**3. కృత్తిక:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు సహోదరులు లేని వాడు, భోజన ప్రియుడు, బహుస్త్రీ సాంగత్యం ఉన్న వాడు, మంచి శరీరము, తేజస్సు కల వాడు, సూరుడును, ఇతరులకు ఉపకారం చేయువాడు, కీర్తివంతుడై ఉండును.

**4. రోహిణి:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు కంటికి సంబంధించిన వ్యాధి కల వాడు, కులశ్రేష్ఠుడు, ఇతరులకు ఆనందము కల్గించు వాడు, పార్శ్వ భాగము నందు మచ్చలు కలవాడు, తల్లికి ఇష్టము లేనివాడు, సౌందర్యం, ధనం, విద్య మొదలైనవి కలవాడు అయి ఉండును.

**5. మృగశిర:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు చాపల్యం కల వాడు, పుష్టి గల శరీరం గల వాడు, బాల్యము నందు శోక పీడితుడు, స్థిర బుద్ధి లేని వాడు, ఉత్సాహము, భయము, సంపదయు, సుఖము గల వాడై ఉండును.

**6. ఆరుద్ర:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు దుస్వభావి, గర్వం గలవాడు, హింసాశీలం గలవాడు, పాపము చేయువాడు, పరద్రవ్యమందు ఆశ గలవాడు, దీర్ఘాయుష్షు గల వాడు, సంతానం తక్కువ కలవాడు, రాజ (ప్రభుత్వం) ద్రవ్యమును అనుభవించు వాడు అయి ఉండును.

**7. పునర్వసు:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు దానం చేయువాడు,సుఖియు, సౌశీల్యం గలవాడు, చెడుబుద్ధి గలవాడు, రోగియు, పిపాస అధికంగా ఉన్నవాడు, స్వల్పమాత్రముగా సంతోషం అనుభవించు వాడు, వ్రతములు ఎక్కువ చేయువాడు అయి ఉండును.

**8. పుష్యమి:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు సంతోషము, కోపము గలవాడు, బుద్ధిమంతుడు, లజ్జలేనివాడు, మాటకారి, అనేక శాస్త్రములనందు పట్టు ఉన్నవాడు, బంధువులకు సహాయము చేయువాడు, విద్య, ధనం సంపాదించు వాడు, స్వతంత్ర శీలం కలవాడు అయి ఉండును.

**9. ఆశ్లేష:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు రౌద్రస్వభావము, చపలుడు, సంఘంలో మాటకారి,సముదాయమునకు నాయకుడు, ధనము కలవాడు, వినయంగా ఉండు వాడు, యశస్సు మరియు సంపన్నము గలవాడు, కృతజ్ఞతల గలవాడు అయి ఉండును.

**10. మఖ:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు విద్య, అణుకువుగా ఉండువాడు, స్థిరమైన స్వభావము గలవాడు, స్థిరమైన శత్రువులను గలవాడు, సజ్జనులచే ప్రశంసింపబడువాడు, చాలా సేవకాజనులు కలవాడు, దేవ మరియు పితృ భక్తి కలవాడు, ధనం గలవాడు, స్వకార్యము నందు ఆనందం పొందు వాడు అయి ఉండును.

**11. పుబ్బ:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు ఇష్టము అయిన మాటలు పలుకువాడు, ఔదార సామర్ధ్యం గలవాడు, అధిక వ్యయము వలన పీడితుడు, సేవకాజనులు ఉన్నవాడు, తేజస్వి, రాజుకు ఇష్టుడు, యుద్ధము నందు భయం గలవాడు అయి ఉండును.

**12. ఉత్తర:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు స్త్రీలకు ఇష్టం అయిన వాడు, సుందరుడు, సంఘ నాయకుడు, విద్య మూలకంగా ధనం సంపాదించువాడు, నేర్పరితనం, సుఖభోగి, జనులకు ఇష్టుడు అయి ఉండును.

**13. హస్త:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు కామశీలము, మాటకారి, దొంగతనము చేయువాడు, విద్య, విదేశాలలో నివాసము ఉండువాడు, రాజప్రీతి కలవాడు, లజ్జయు మరియు భయము లేనివాడు, శత్రువులను నశింపజేయుడు అయి ఉండును.

**14. చిత్తా:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు పాప స్వభావము గలవాడు, అందమైన కళ్ళు, సౌందర్యమైన శరీరము గలవాడు, దుష్ట స్త్రీల యందు ఇష్టము, విచిత్ర వస్త్రములు ధరించు వాడు, విశేష పుష్పమాలికలను ధరించువాడు, అన్యదేశ వాసము, సుఖియు అయి ఉండును.

**15. స్వాతి:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు దానం చేయువాడు, సుఖం అనుభవించువాడు, అత్యాశ గలవాడు, ఇష్టము అయిన మాటలు పలుకువాడు, ధర్మాన్ని ఆశ్రయించువాడు, అన్య కార్యములు చేయువాడు, అన్య ధనం గలవాడు, ధనవంతుడు, అన్యదేశవాసి, చాల బంధువులు గలవాడు, దొంగ బుద్ధి గలవాడు అగును.

**16. విశాఖ:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు ఈర్ష్య, అసూయ, అన్యదేశ వాసము, పిసినారి, తేజస్సు, ధనం, ప్రసిద్ధి గలవాడు, యుద్ధము నందు ఆశక్తి కలవాడు, సమర్ధుడు, నిక్రుష్టమైన సేవ వృత్తి చేయును.

**17. అనురాధ:** ఈ నక్షత్రం నందు జన్మించిన అధికమైన ఆకలి, దప్పిక, రోగి, భూతదయ గలవాడు, ధర్మ బుద్ధి గలవాడు, సంచారము చేయువాడు, విదేశాలలో ఉండువాడు సమయస్ఫూర్తి గలవాడు అయి ఉండును.

**18. జ్యేష్ఠ:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు సంతృప్తి చెందువాడు, కోపము గలవాడు, బంధువులు తక్కువ ఉన్నవాడు, తేజస్సు గలవాడు, సంఘ ప్రధాని, బుద్ధిమంతుడు, దైవ కార్యములందు ఆశక్తి కలవాడు అయి ఉండును.

**19. మూల:** ఈ నక్షత్రం నందు జన్మించిన అభిమానం, ధనం, సుఖం, రోగాపీడన దొంగబుద్ధి, మనస్సు మరియు పనులు యందు చాపల్యము ఉండువాడు, స్వతంత్ర జీవనం గడుపువాడు అయి ఉండును.

**20. పూర్వాషాడ:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు మంచి బంధువులు కలవాడు, వినయం కలవాడు, బహుసంతానం కలవాడు, బుద్ధి సామర్ధ్యం కలవాడు, తనకు నచ్చినట్టుగా జీవించే వాడు, మంచి భాగస్వామిని కలవాడు, భోగము మరియు సుఖమును అనుభవించు వాడు, రాజ గౌరవము పొందువాడు అయి ఉండును.

**21. ఉత్తరాషాడ:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు పరిహాసము చేయువారు, హస్యమునందు ప్రియుడు, బహుమిత్రులు గలవాడు, చాల బాధలు అనుభవించు వాడు, ఉపకార బుద్ధి గలవాడు, సంచారి, సుందరుడు, వినయము, దయ, ధర్మం ఎరుగువాడు అయి ఉండును.

**22. శ్రవణం:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు శాస్త్రజ్ఞుడు, పరదేశమునందు నివసించువాడు, దానం చేయువాడు, సౌందర్యాది గుణములు గల భార్య గలవాడు, ప్రసిద్ధియు, బుద్ధి, విద్య, అధిక వ్యయం చేయువాడు అయి ఉండును.

**23. ధనిష్ట:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు సంపద, జాలితనము, శూరతయు, అన్యదేశ వాసము, దయ లేకుండా ఉండటము, అసత్యం పలుకువాడు, మాట పట్టింపు ఉన్న వాడు, చాల మాట్లాడువాడు, నృత్యం నందు మరియు సంగీతము నందు ప్రియము కలవాడు, శ్రీమంతుడు అయి ఉండును.

**24. శతభిషం:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు అధికంగా మాట్లాడువారు, అధికంగా ఖర్చు చేయువాడు, వందనీయత, అనేక గుణములు కలవాడు, విషయము నందు పట్టు కలవాడు, విస్తారమగు కళ్ళు గలవాడు, శత్రువులను జయించు వాడు, వ్యసనములు కలవాడు, సాహసము అయిన పనులును చేయువాడు అగును.

**25. పూర్వాభాద్ర:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు స్త్రీలకు ప్రియమైనవాడు, అడుగుఅడుగునా సుఖదుఃఖాలను అనుభవించువాడు, భోగసుఖం కలవాడు, రాజు నుండి లభించిన సొమ్మును అనుభవించువాడు, దుస్వభావము కలవాడు, వివాదమందు జయం కలవాడు, దీర్ఘాయుష్మంతుడు అయి ఉండును.

**26. ఉత్తరాభాద్ర:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు బాగా మాట్లాడు వారు, సుఖమును అనుభవించు వాడు, మంచి సంతానము కలవాడు, శత్రువులను జయించువాడు, వినయం కలవాడు, పిశునుడు, మంచి గుణములు కలవాడు, శాస్త్రములను కూలం కుషంగా అధ్యయనం చేయువాడు అయి ఉండును.

**27. రేవతి:** ఈ నక్షత్రం నందు జన్మించిన వారు సంపూర్ణ అవయువాలు కలవాడు, స్త్రీలకు ఆధీనుడు, జనులకు ఇష్టుడు, శౌర్యం కలవాడు, మాత్సర్య బుద్ధి కలవాడు, వీర ప్రతాపము కలవాడు అయి ఉండును.

## వధూ వరులు ఏక నక్షత్రము అయిన జరుగు శుభాశుభ ఫలములు

ముఖ్య విషయములు వివాహ విషయములో వధూ వరులు ఏక నక్షత్రము అయిన జరుగు శుభాశుభ ఫలములు :

వధువు వరుని యొక్క నక్షత్రములు కృతిక, పునర్వసు, ఉత్తర, విశాఖ, ఉత్తరాషాడ, పుర్వాబాద్ర, [త్రిపాద నక్షత్రములు] ఒకటే అయిన - రోగము భయము

మృగశిర, చిత్త, ధనిష్ట [ద్విపాద నక్షత్రములు] అయిన - మరణ భయము

రోహిణి, ఆరుద్ర, పుష్యమి, మఘు, విశాఖ, శ్రవణం, ఉత్తరాబాద్ర, రేవతి [చతుర్ధ పాదములు] అయిన - వివాహమునకు మంచిది.

**గ్రహముల వల్ల వచ్చు వ్యాదులు :**

రవి - గుండె,జఠరము,లాలాజలము,తాపము,తలనెప్పి,కడుపుమంట,నేత్రములు,రక్త పోటు, మొదలగు వ్యాదులు.

చంద్రుడు - స్తనములు,రుతుక్రమ సంబిదిత,మానసిక,పిచ్చి మొదలగు వ్యాదులు.

కుజుడు - కోపము, గుదము [మర్మస్థాన] కందరములు, ఎర్ర కణములు పోవుట [పొడగుట], పేలుడు [మందుగుండు] సంబదిత, శస్త్ర చికిత్స మొదలగు వ్యాదులు.

భుదుడు - శ్వాస,మెడ గొంతు,ఫిట్స్,వెన్నె ముక,నోరు మొదలగు వ్యాదులు.

గురుడు - క్రొవ్వు,కాలేయము,మూత్రము,లివర్ సంబందిత వ్యాదులు.

శుక్రుడు - మర్మము,మధుమేహము,సుఖ వ్యాదులు,గడవ బిళ్ళలు మొదలగు వ్యాదులు.

శని - మూలవ్యాది,చాల రోజులు నిలిచే వ్యాదులు,పిసాచ బాధలు ,ఎముకలకు సంబందితవ్యాదులు.

రాహువు - క్షయ,అపరేషన్,కుష్టు,ప్రేగులు మొదలగు వ్యాదులు.

కేతువు - తెలియని జబ్బులు,నత్తి,నరముల పోటు మొదలగు జబ్బులు.

## లగ్నము అంటే జాతకచక్రములో మొదటి స్థానము.

**1. లగ్నము** :- లగ్నము మొదటి స్థానము కనుక లగ్నము లగ్నములో ఉపస్థితమై ఉన్న గ్రహాలు వ్యక్తి యొక్క గుణగణాలను సూచిస్థాయి.

**2. ద్వితీయ స్థానము** :- ద్వితీయ స్థానము ధన స్థానము కనుక ఇది వ్యక్తి యొక్క ధన సంపత్తి గురించి తెలియ చేస్తుంది. కుంటుంభ స్థానము కనుక ఈ స్థానములో ఉన్న గ్రహాలు వ్యక్తి యొక్క కుటుంబ సభ్యులను గురిమ్చి తెలియ చేస్తుంది. ఇది వ్యక్తి యొక్క కంఠ స్థానము కనుక ద్వితీయ స్థానములో ఉపస్థిత గ్రహాలు న్యక్తి మాటతీరును సూచిస్తాయి.

**3. తృతీయ స్థానము** :- తృతీయ స్థానము వ్యక్తి యొక్క కనిష్థ సహోదర స్థానము. దీనిని ఉపజయ స్థానము అంటారు.

**4. చతుర్ధ స్థానము** :- చతుర్ధ స్థానము మాతౄ స్థానము కనుక దీనిలో ఉపస్థితమై ఉన్న గ్రహాలు వ్యక్తి యొక్క తల్లిని గురించిన విషయాలు చెప్తాయి. గృహ స్థానము కనుక వ్యక్తి యొక్క గృహయోగము గురించి కూడా తెలియజేస్తుంది. ఇది వాహన స్థానము కనుక వ్క్కి యొక్క వాహన యోగమును గురించి కూడా తెలియ చేస్తుంది. ప్రాథమిక విద్యా స్థానము కనుక విద్యా స్థాయి విద్యలో కలిగే ఆంకాలను తెలియ చేస్తుంది. ఇది మోక్ష్ అత్రికోణాలలో ఒకటి. కేంద్ర స్థానాలలో ఒకటి. ఈ స్థానమున ఉపస్థితమైన గ్రహాలు బలము కలిగినవి వ్యక్తి జీవితము మీద ప్రభావము కలిగించ కలిగినవి. ఓగకారకాలు ఔతాయి.

**5. పంచమ స్థానము** :- పమ్చమ స్థానము వ్యక్తి యొక్క పుత్ర స్థానము కనుక ఇందు ఉపస్థితమైన గ్రహాలు వ్యక్తి యొక్క సంతానము గురించి తెలియ చేస్తాయి. ఇది ఉన్నత విద్యా స్థానము కనుక వ్యక్తి యొక్క ఉన్నత విద్యను గురించి తెలియ చేస్తుంది. ఇది పూర్వ పుణ్య స్థానము కనుక పూర్వ జన్మ పుణ్యము గురించి తెలియ చేస్తుంది.

**6. షట్మ స్థానము**:- షష్టమ స్థానము ఆరోగ్య స్థానము కనుక వ్యక్తి యొక్క ఆరోగ్య స్థితిని ఇందు ఉపస్థితమైన గ్రహాలు తెలియ చేస్తాయి. ఇది శత్రు స్థానము కనుక శత్రుత్వము గురించి కూడా ఇది తెలియ చేస్తుంది. ఇందు ఉపస్థితమైన గ్రహములు బలహీనములు.

**7. సప్తమ స్థానము**:- సప్తమ స్థానము కళత్ర స్థానము కనుక ఇది వ్యక్తి యొక్క వైవాహిక జీవితము గురించి తెలియ చేస్తుంది. వ్యాపార భాగ స్వాముల గురించి ఇక్క ఉన్న గ్రహములను అనుసరిమ్చి తెలుసుకొన వచ్చు. ఇది ఒక కేంద్ర స్థానము కనుక ఇందు ఉన్న గ్రహములు బలము కలిగినవి.

**8. అష్టమస్థానము** :- అష్టమ స్థానము ఆయుఃస్థానము కనుక వ్యక్తి యొక్క మరనము గురిమ్చి ఇది తెలుపుతుంది. ఇందు ఉన్న గ్రహములు బలహీనములు.

మోక్ష త్రికోణములలో ఇది రెండవది కనుక వ్యక్తి యొక్క ఈ జన్మ స్థితి ఈ స్థానము విశదీకరిస్తుంది.

**9. నవమ స్థానము** :- నవమ స్థానము ఇది పితృ స్థానము కనుక ఇందున్న గ్రహములు వ్యక్తి యొక్క తండ్రి స్థితిని గురించి తెలియ చేస్తాయి. ఇది యోగ స్థానము కనుకఈది వ్యక్తి యొక్క యోగమును గురించి తెలియ చేస్తుంది. త్రికోణ స్థానములలో ఒకటి కనుక ఇందు ఉన్న గ్రహములు బలము కలిగినవి.

**10. దశమ స్థానము** :- దశమ స్థానము ఇది కర్మ స్థానము కనుక ఇది వ్యక్తి యొక్క వృత్తిని గురించి తెలియ జేస్తుంది. ఇది కేంద్ర స్థానము కనుక ఇందు ఉన్న గ్రహములు బలము కలిగినవి.

ఎకాదశ స్థానము :- ఏకాదశ స్థానము లాభస్థానము కనుక ఇది వ్యక్తి యొక్క లాభములను గురించి తెలియ చేస్తుంది. ఇది జ్యేష్ట సహోదర స్థానము కనుక జ్యేష్ట సహోదర స్థాయిని గురించి తెలియ చేస్తుంది.

**12 ద్వాదశ స్థానము** :- ద్వాదశ స్థానము కనుక ఇది వ్యక్తి యొక్క వ్యయమును గురించి తెలియ చేస్తుంది. ఇందు ఉన్న గ్రహములు బలహీనములు. మోక్ష త్రికోణములో ఇది మూడవది కనుక ఇది వ్యక్తి యొక్క జన్మాంతర స్థితిని, మోక్షమును గురించి తెలియ చేస్తుంది.

## లగ్నము మరి కొన్ని విషయాలు

కేంద్ర స్థానములు లగ్నము నుండి 1,4,7,10 స్థానములు. వీటిని విష్ణుపాదములు అంటారు.

కోణ స్థానములు లగ్నము నుండి 5,9 స్థానములు వీటిని లక్ష్మీ స్థానములు అంటారు.

జాతకానికి కేంద్రకోణాధిపత్యము వహించు గ్రహములు అజాకుడికి యోగకారక గ్రహాలు.

శుభగ్రహాలకు కేంద్రాధిపత్యము దోషము కనుక వారు ఆజాతకానికి పాపులు ఔతారు.

పాపగ్రహాలు కేంద్రాధిపతులైన ఆగ్రహములు శుభగ్రహాలు ఔతాయి.

లగ్నాధిపతి కేంద్రాధిపత్యము వహించిన అతడు శుభుడే ఔతాడు.

రవి చంద్రులకు అష్టమాధిపత్య దోషము లేదు.

లగ్నాధిపత్య దోషము రవి, చంద్రులకు ఉండదు.

కేంద్రాధిపతి జతకుడికి మేలు చేయడానికి ప్రయత్నిస్తాడు.

## *ద్వాదశ లగ్నము - భావములు*

1. లగ్నము: లగ్నము తొలి స్థానము అయినందువల్ల లగ్నమును బట్టి లగ్న బలము, స్వభావము, లగ్న శుద్ధి మొదలగునవి సూచిస్తాయి.

2. లగ్నము నుంచి ద్వితీయ స్థానము: దీనిని నేత్ర స్థానమని, ధన స్థానమని, కుటుంబ స్థానమని అంటారు. కనుక ధన యోగము, ధన సంపత్తి గురించి తెలియజేస్తుంది.

3. లగ్నము నుంచి తృతీయ స్థానము: ఇదీ విక్రమ స్థానము. దీనిని ఉపచయ స్థానమందురు. తృతీయ స్థానము వ్యక్తి యొక్క కనిష్ట సహోదర స్థానము.

4. లగ్నము నుంచి చతుర్థ స్థానము: ఇదీ మాతృ స్థానము కనుక దీనిలో ఉప స్థితిగా ఉన్న గ్రహాలు వ్యక్తి యొక్క తల్లిని గురించిన విషయాలు చెబుతాయి. దీనిని సుఖ స్థానమని కూడా అంటారు. దీనిని బట్టి మాత, బుద్ధి, మనస్సు, వాహనములు, సౌఖ్యము, భూమి మొదలగు అంశములు తెలియును. ఇది ప్రాథమిక విద్యా స్థానము కనుక విద్యలో కలిగే ఆటంకాలను తెలియజేస్తుంది.

5. లగ్నము నుంచి పంచమ స్థానము: ఇది ముఖ్యమైనది సంతాన స్థానము. సంతానము బుద్ధి, మొదలగునవి తెలియును. ఇది ఉన్నత విద్యా స్థానము గనుక వ్యక్తి యొక్క విద్యను తెలుపుతుంది.

6. షష్టమ స్థానము: ఇదీ ఆరోగ్య స్థానము. వ్యక్తి ఆరోగ్య స్థితిని ఇదులోని ఉపస్థితి గ్రహాలు తెలుపుతాయి. ఇది శతృ స్థానము కూడా గనుక శతృతత్వము గురించి కూడా తెలుపుతుంది. ఈ స్థానం శతృవులు, వ్యాధులు, ఋణము, ఆరోగ్యము తెలుపుతుంది.

7. సప్తమ స్థానము: సప్తమ స్థానము కళత్ర స్థానము. ఇది వ్యక్తి యొక్క వైవాహిక జీవితం గురించి తెలుపుతుంది. వ్యాపార భాగస్వాముల గూర్చి ఇక్కడున్న గ్రహాలను అనుసరించి తెలుసుకోవచ్చు.

8. అష్టమ స్థానము: ఇది ఆయుఃస్థానము. వ్యక్తి యొక్క భావము, ఆయుర్దాయము, జీవనము, మరణము వంటి విషయాలు తెలుపును.

9. నవమి స్థానము: ఇది పితృ స్థానము. తండ్రి యొక్క స్థితిని తెలుపుతుంది. ఇది యోగ స్థానము కూడా గనుక యోగమును గురించి తెలుపుతుంది. ఇంకా ధనము, పుణ్యము, తీర్థ యాత్రలు కూడా తెలుపుతుంది.

10. దశమ స్థానము: ఇది కర్మ స్థానము. కనుక ఇది వ్యక్తి యొక్క వృత్తిని తెలుపుతుంది. ఇందులోని గ్రహాలు బలము కలిగినవి. జీవనగతిని తెలుపునది రాజ్యస్థానము. ఇది పదవ ఇల్లు. దీనిని కార్య స్థానమని కూడా అంటారు. దీనిని బట్టి ఉద్యోగము, వ్యాపారము, వృత్తులు, కార్యాహరణ, కీర్తి, సంపద, హోదా వంటివి ఉంటాయి.

11. ఏకదశ స్థానము: ఏకాదశ స్థానము లాభ స్థానము. కనుక ఇది వ్యక్తి యొక్క ధనలాభము తెలుపును. ఇది జ్యేష్ట సోదరుల స్థానము కాబట్టి జ్యేష్ట సహోదర స్థాయిని గుర్చి తెలుపుతుంది.

12. ద్వాదశ స్థానము: ఇది వ్యయ స్థానము. కనుక ముఖ్యంగా వ్యక్తి యొక్క వ్యయమును తెలుపుతుంది. కష్టములు, ఖర్చులు, నష్టములు
మొదలగునవి తెలుపును.

## ద్వాదశ లగ్నమునకు యెగావయెగములు.

**1. మేషలగ్నముః-** మేషలగ్న జాతకమునకు బుధ, శక్ర, శనిగ్రహములు పాపులు. రవి గురులు శుభులు. శని గురలు యొక్క సంబంధము యొగించదు. వ్యయాధిపతియైనగురునికి పాపగ్రహ సంబంధము శుభఫలములు గలుగ నీయదు.శుక్రుడ మారకుడగుచున్నాడు.

**2. వృషభలగ్నముః-** ఇందు గురు, శుక్ర, చంద్రులు పాపులగుచున్నారు.శని రవులుశుభులు. శనిగ్రహము ఒక్కటియె రాజయెాగము నిచ్చును.గురుడు మొదలగు పాపగ్రహములు యిందు మారకలక్షణములు గలవి యగుచున్నవి. ధన పంచమాధిపతియైన బుదుడు అట్టిఫలము నిచ్చువాడే. యగుచున్నాడు.

**3.మిధునలగ్నముః-** ఈలగ్నమునందు రవి, కుజ, గురులు పాపుల గుచున్నారు. శుక్రుడు శుభుడగుచున్నాడు. శని గురులు యొక్క కలయిక యిందు అవయెాగమగును. రవి చంద్రులు యిందు మారకులు కాజాలరు.

**4. కర్కాటకలగ్నముః-** ఈ లగ్నమునందు బుధ,శుక్రులు పాపుల గుచున్నారు. కుజ గురులు శుభులగు చున్నారు. ఇఇందు కుజుడు రాజయెాగ కారకుడగును. శని ప్రధాన మారకుడు.మారకధిపతితోగూడిన పాపగ్రహములు గూడమారకులగు చున్నారు.

**5. సింహలగ్నముః-** ఈ లగ్నమునందు బుధ శుక్రులు పాపులు.కుజుడు శుభుడగు చున్నాడు.యెాగకారకుడగును. కుజ శుక్రుల కలయిక యిందు అవయెాగము నిచ్చును. బుధుడు ముఖ్యముగా మారకుడగు చున్నాడు. ఇతర పాపగ్రహములు మారక లక్షణములు గలవి యగుచున్నవి.

**6. కన్యాలగ్నముః-** ఈ లగ్నమునందు కుజ, గురు, చంద్రులు పాపులగుచున్నారు.శుక్రుడు శుభుడు, శక్ర బుధలు యెగకారక గ్రహములు. ఇతర కుజాధ పాపగ్రహములు మారక యెాగము గలవియగుచున్నవి.

**7. తులాలగ్నముః-** ఈ లగ్నమునందు గురు,రవి,కుజులు పాపులు శని బుధులు శుభులు.చంద్ర బుధులు రాజయెగము నిచ్చువారగుచున్నారు. కుజ,గురులు మొదలగు యితర గ్రహములు మారక లక్షణములు గలవి యగుచున్నవి.

**8. వృశ్చికలగ్నముః-** ఈ లగ్నమునందు కుజ,బుధ శుక్రులుపాపులు. గురు,చంద్రులు శుభులు. రవి చంద్రులు మాత్రమే రాజయెాగము నిచ్చువారగుచున్నారు.గురుడు మారకుడు.బుధుడు మొదలైనపాపగ్రహములు మారక లక్షణములు గలవియగుచ్చున్నవి.

**9. ధనస్సులగ్నము:-** ఈ లగ్నమునందు శుక్రుడు మాత్రమే పాపియగుచున్నాడు.బుధ,రవులు శుభులు యెగకారకులగు చున్నారు.శని మారకుడు. శుక్రుడు మొదలైన యితర గ్రహములు మారక లక్షణములు గలవి యగుచున్నవి.

**10. మకరలగ్నము:-** ఈ లగ్నమునకు కుజ, గురు, చంద్రులు పాపులగుచున్నారు. శుక్ర బుధులు శుభులు. శుక్రుడు మత్రమే యెగకారకుడగుచున్నాడు. శని కుజులు మొదలైన పాపులు మారక మిచ్చువారగు చున్నారు.ఆపాపులతో గూడినవి గూడమారకలక్షణములు గలవియగుచున్నవి.

**11.కుంభలగ్నము:-** ఈ లగ్నమునందు గురు,చంద్ర,కుజులు పాపులగు చున్నారు. శుక్రుడు,శభుడు,కుజ, శుక్రులు రాజయెాగకారకులగు చున్నారు.బుధ,గురులు మొదలగు యితర గ్రహములు మారక లక్షణములుగలవియగుచున్నవి.

**12.మినలగ్నము:-** ఈ లగ్నమునకు శని,శుక్ర,రవి,బుధులు పాపులగుచున్నారు. కుజ చంద్రులు శుభులు. కుజ గురులు యెాగకారకులగుచున్నారు. కుజుడుయిందమారకుడు కాదు.శనిమొదలగు యితర గ్రహములు మారక లక్షణములు గలవి యగుచున్నవి.

## మేష లగ్నము - ఫలితాలు*

మేషలగ్నస్థ గ్రహ జాతకులు చురుకైన తత్వం కలిగి ఉంటారు. కోప స్వభావం ఉండును. వీరికి దీర్ఘకాల శత్రువులు ఉంటారు. ధైర్యము, ఆశ అధికమే. ఇక వీరు మంచి భోజన ప్రియులు.

మేషలగ్నాధిపతి కుజుడు. కుజుడు లగ్నాధిపతి (లగ్నం అంటే జన్మరాశి చక్రంలో మొదటి స్థానం) కాక అష్టమాధిపతి (అంటే జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి 8వ స్థానం) కూడా. తృతీయ (జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి మూడవ స్థానం) షష్ఠాధిపతి (జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి ఆరవ స్థానం) బుధుడు, ధన (జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి రెండవ స్థానం) సప్తమాధిపతి (జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి ఏడవ స్థానం) శుక్రుడు, వాహనాధిపతి (అనగా జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి నాలుగవ స్థానం) చంద్రుడు, పంచమాధిపతి (జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి ఐదవ స్థానం) సూర్యుడు, భాగ్య (జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి తొమ్మిదవ స్థానం) వ్యయాధిపతి (జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి పన్నెండవ స్థానం) గురువు, రాజ్య (జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి పదవ స్థానం) లాభాధిపతి (జన్మరాశి చక్రంలో లగ్నం నుంచి పదకొండవ స్థానం) శని.

***సూర్యుడు*** : మేషలగ్నానికి సుర్యుడు పంచమాధిపతి.. కనుక సూర్యుడు మేషలగ్నానికి శుభుడు. పంచమాధిపతి లగ్నములో ఉచ్ఛస్థితిలో ఉపస్థితమై ఉండటం వల్ల ఈ జాతకుడు అందంగా, ఆకర్షణీయంగా ఉంటాడు. విద్యారంగంలో రాణిస్తాడు. ఇక ఆర్ధిక వ్యవహారాల పరిస్థితి బాగుంటుంది. సుర్యుడి ప్రభావం వల్ల సంతాన ప్రాప్తి కలుగుతుంది. సూర్యుడు తన పూర్ణ దృష్టితో సప్తమ భావమైన తులారాశిని చూస్తాడు కనుక తులారాశి అధిపతి శుక్రుడు. కనుక జీవితభాగస్వామి అందముగా ఉంటారు. జీవిత భగస్వామి సంయోగము లభిస్తుంది. అయితే వైవాహిక జీవితములో ఒడిదుడుకులు తప్పకపోవచ్చు.

*చంద్రుడు* : చంద్రుడు మేషలగ్నానికి సుఖస్థానాధిపతి. ఈ కారణం వల్ల ఈ జాతకుడు శాంత స్వభావుడిగా కనిపిస్తాడు. అయితే కొంటెతనం కూడా కలిగి ఉంటారు. ఇక వీరికి విలాసవంతమైన జీవితం అంటే ఇష్టపడతారు. వీరికి మాతృమూర్తి నుంచి, మాతృమూర్తి పక్షము నుంచి సహాయం అందుతుంది. అంతేకాదు ప్రభుత్వ పక్షము నుంచి ప్రయోజనాలు అందుతాయి. సప్తమంలో తులారాశి మీద చంద్రుడి దృష్టి పూర్ణముగా ప్రసరిస్తుంది కనుక జీవిత భాగస్వామి కళాదృష్టి, గుణసంపద కలిగి, సహాయ సహకారాలు అందించే వారై ఉంటారు. ఇక ఈ జాతకులు భూమి, భవనము, వాహన ప్రాప్తి కలిగి ఉంటారు. ప్రకృతి ఆరాధన, సౌందర్యపిపాస కలిగి ఉంటారు. శీతకాలంలో వీరు ఇబ్బంది పడతారు. దగ్గు, జలుబు వంటి బాధలు బాధిస్తాయి. ఇంకా చలి సంబంధిత వ్యాధులకు అవకాశము కలదు.

*కుజుడు* : కుజుడు మేషలగ్నానికి లగ్నాధిపతి, అష్టమాధిపతి. లగ్నాధిపత్యము వలన అష్టమాధిపత్య దోషం పోతుంది. కుజుడు లగ్నస్థుడు కనుక ఈ జాతకుడు బలమైన శరీరము కలిగి ఉంటారు. సాహసవంతులుగాను కనిపిస్తారు. కండ బలముతో పాటు. కఠినమైన పనులను కూడా ఆత్మబలముతో చేయకలిగిన సత్తా ఉంటుంది. సమాజంలో పేరు, ప్రతిష్ఠలు కలిగి ఉంటారు. బలహీనుల పట్ల వీరి హృదయములో సానుభూతి ఉంటుంది. కుజుడు చతుర్ధ స్థానమును, సప్తమ స్థానమును, అష్టమస్థానమును చూస్తాడు. దీని కారణముగా భూమి, వాహన సౌఖ్యము లభిస్తుంది. వైవాహిక జీవితంలో ఒడిదుడుకులు ఉంటాయి. భార్యాభర్తల మధ్య అభిప్రాయ భేదాలు ఏర్పడతాయి.

*బుధుడు* : బుధుడు మేషలగ్నానికి తృతీయ, షష్ఠమభావాధిపతిగా అశుభము కలిగించును. లగ్నములో ఉన్న బుధుడు వ్యక్తిని జ్ఞానిగా, బుద్ధిమంతుడిగా చేస్తుంది. బుధ దశలలో బంధు మిత్రులతో వివాదాలు ఏర్పడతాయి. షష్ఠమ స్థానాధిపతిగా బుధుడు ఉదర సంబంధమైన వ్యాధులు, మూర్ఛ వ్యాధి, మతిమరుపు ఏర్పడే అవకాశాలున్నాయి. వ్యాపారములో వీరికి సఫలత లభిస్తుంది. బుదుడి సప్తమ దృష్టి కారణంగా సంతాన సంబంధాలలో సమస్యలు వచ్చే అవకాశాలున్నాయి. జీవిత భాగస్వామికి ఆరోగ్య సమస్యలు ఉంటాయి. సప్తమమైన తులారాశి మీద బుధుడి దృష్టి కారణముగా జీవిత భాగస్వామి గుణవంతుడుగా ఉంటాడు. వైవాహిక జీవితం సాధారణముగా ఉంటుంది.

*గురువు* : మేషలగ్నానికి గురువు భాగ్యాధిపతి వ్యయాధిపతి. ద్వాదశస్థానాధిపత్యము కారణము వల్ల గురువు మేషలగ్నానికి అకారణమైన అశుభ ఫలములు ఇస్తాడు. అయినా త్రికోణాధిపత్యంతో అశుభము తొలగిపోతుంది. మేషలగ్న గురువు కారణముగా జాతకుడు మంచి మేదస్సు కలిగి ఉంటారు, జ్ఞాని అవుతారు. ఉజ్వలమైన ప్రభావవంతమైన వాక్కు వీరి సొంతం. వీరికి ప్రజా సన్మానం, పేరు ప్రఖ్యాతలు కలుగుతాయి. లగ్నస్థ గురువు పంచమ, సప్తమ, నవమ భావమును చూస్తాడు కనుక సంతాన భాగ్యం ఉంటుంది. శత్రు స్థానమైన తులారాశి మీద గురువు దృష్టి ప్రసరిస్తుంది కనుక జీవిత భాగస్వామికి మనోకలతలు ఉంటాయి. నవమస్థానమైన ధనసు మీద గురువు దృష్టికి కారణంగా తండ్రికి శుభములు కలుగుతాయి.

*శుక్రుడు* : శుక్రుడు మేష లగ్నానికి ద్వితీయ సప్తమ స్థానాధిపతి. శుక్రుడు లగ్నస్థము కారణంగా సమస్యలు కలిగిస్తాడు. ఈ జాతకులు అందంగా కనిపించినా ఆరోగ్యసమస్యలను మాత్రం ఎదుర్కొంటారు. శుక్ర దశలో వీరు ఊహించని కష్టాలను ఎదుర్కొంటారు. లగ్నస్థ శుక్రుడి కారణముగా స్త్రీ పురుషుల మధ్య ఆకర్షణ ఉంటుంది.

***శని* :** లగ్నస్థ శని మేషలగ్నముకు దశమాధిపతిగా శుభాలను, ఏకాదశాధిపతిగా అశుభాలను కలిగిస్తాడు. లగ్నస్థ శని కారణంగా ఈ జాతకుడు సన్నముగా పొడవుగా ఉంటాడు. లగ్నస్థ శని తృతీయ, సప్తమ, దశమ స్థానాలపై దృష్టి సాగిస్తాడు. కనుక జాతకుడికి బంధుమిత్రుల సహకారము లభించడం కష్టమే. ఉద్యోగ వ్యాపారాలలో నిలకడ ఉండదు. వైవాహిక జీవితంలో జీవిత భాగస్వామితో అభిప్రాయ బేధాలు తలెత్తుతాయి.

***రాహువు* :** మేష లగ్నములో రాహువు నమ్మకాన్ని పెంచుతాడు. ఆత్మవిశ్వాసాన్ని ఇస్తాడు. ఉదర సంబంధిత వ్యాదులు ఎదుర్కొంటారు. జీవితంలో ఒడిదుడుకులు ఎదుర్కొంటారు. ఉద్యోగ, వ్యాపారాలలో పట్టుదలతో సఫలత సాధిస్తారు. వ్యాపారము చేయాలన్న కోరిక ఉంటుంది. అయితే ఉద్యోగము అధిక సఫలత ఇస్తుంది. రాహువు సప్తమ దృష్టి కారణంగా జీవిత భాగస్వామి ఆరోగ్య సమస్యలను ఎదుర్కోంటారు. వైవాహిక జీవితం బాధిస్తుంది. మిత్రులు, సహోదరులు సహకరిస్తారు.

***కేతువు* :** మేష లగ్నస్థ కేతువు కారణం వల్ల శారీరక దాడుర్యం కలిగి ఉంటారు. ఆత్మస్థర్యం, ధైర్య సాహసాలు కలిగి ఉంటారు. కనుక వీరి శత్రువులు భయభక్తులతో ఉంటారు. సమాజంలో గౌరవం, ఖ్యాతి లభిస్తుంది. రాజనీతి, చతురత కలిగి ఉంటారు. మాతృ వర్గము నుంచి సహాయసహకారాలు లభిస్తాయి. జీవిత భాగస్వామి నుంచి, సంతానం నుంచి అనుకోని సమస్యలను ఎదుర్కొంటారు. ఇక వీరికి వ్యాధుల బెడద ఉండదు.

## వృషభ లగ్నము - ఫలములు

వృషభ లగ్నమున జన్మించిన వారు గుణవంతులు-ధనవంతులు. గురు భక్తి కలవారు. ఈ జాతకులు ధైర్యశాలిగాను, శౌర్యవంతుడుగాను ఉండును. ఈ జాతకునకు గురు, శుక్ర, చంద్రులు పాపులు అగుదురు. రవి, శనులు శుభులు శని రాజయోగకారకుడు. గురునకు మారక లక్షణములున్నాయి.

***సూర్యుడు* :** సూర్యుడు వృషభరాశికి చతుర్థాధిపత్యం వహిస్తాడు. కేంద్రాధిపతి కనుక సూర్యుడు వృషభ లగ్నానికి శుభంగా మారే గ్రహమై మంచి ఫలితాలను అందిస్తాడు. లగ్నస్థ సూర్యుడు వ్యక్తికి ప్రకాశవంతమైన ముఖ వర్చస్సు, ఉత్సాహం అందిస్తాడు. మంచి వాక్చతుర్యం వీరి సొంతం. ఆకర్షణీయమైన వీరి మాటలు ఇతరుల మీద ప్రభావం చూపుతాయి. వ్యవసాయం, వ్యాపారం, ఉద్యోగం వీరికి అనుకూలమే. పంచమాధిపతి లగ్నంలో ఉండటంతో సంతానంతో సత్సంబంధాలు ఉంటాయి. ఆత్మవిశ్వాసం అధికం. సూర్యుడి పూర్ణదృష్టి సప్తమ స్థానం మిత్ర స్థానం అయిన వృశ్చిక లగ్నం మీద ఉంటుంది కనుక జీవిత భాగస్వామి సహాయ సహకారాలు అందుకుంటారు. భాగస్వాముల, మిత్రులతో సత్సంబంధాలు ఉంటాయి. భాగస్వాములతో ఉద్రేక పూరిత వాతావరణం ఏర్పడినా విశ్వాస పాత్రులుగా ఉండి సహాయ సహకారాలు అందిస్తారు.

***చంద్రుడు* :** వృషభ లగ్నానికి చంద్రుడు తృతీయాధిపతి. అయితే చంద్రుడు వృషభంలో ఉచ్ఛస్థితిని పొందడంతో చంద్రుడు వృషభ లగ్న జాతకులకు మంచి ఫలితాలు ఇస్తాడు. లగ్నస్థ చంద్రుడు వీరికి అందమైన శరీరాన్ని ఇస్తాడు. జల కారకుడైన శుక్రుడు ఆధిపత్యం వహించే వృషభ లగ్నంలో శీతల స్వభావం ఉన్న చంద్రుడు ఉన్నందున శీతల ప్రకృతి కలిగిన శరీరం కలిగి ఉంటారు. వీరికి జలుబు, దగ్గు, ఆయాస సంబంధిత వ్యాధులు రావచ్చు. ఈ జాతకులు గుణవంతులుగా,

దయాస్వభావులుగా ఉంటారు. విలాసవంతమైన జీవితమంటే ఇష్టపడతారు. తల్లితో సత్సంబంధాలు ఉంటాయి. మాతృవర్గ బంధువులతో సత్సంబంధాలు కొనసాగుతాయి. తల్లిదండ్రుల సహాయ సహకారాలు అందుకుంటారు. కళలంటే ఆసక్తి ఎక్కువ. కల్పనా శక్తి అధికం. జలం, నౌకా ప్రయాణం, జల ప్రదేశాలు వీరిని ఆకట్టుకుంటాయి. వీరికి కళాభిమానం ఎక్కువ. కళారంగ సంబంధ వృత్తులలో వీరు రాణిస్తారు.చంద్రుడి పూర్ణ దృష్టి సప్తమస్థానం.. మిత్ర స్థానమైన వృశ్చికం మీద సారిస్తాడు.. కనుక వీరికి అందమైన జీవిత భాగస్వామి లభిస్తుంది. జీవిత భాస్వామి సహాయ సహకారాలు అందుకుంటారు.

***కుజుడు*** : వృషభ లగ్నానికి కుజుడు సప్తమ, ద్వాదశాధిపతి. కేంద్రాధిపత్యం వహిస్తాడు కనుక కుజుడు వీరికి కారక గ్రహమై మంచి ఫలితాలు ఇస్తాడు. వృషభ లగ్నంలో లగ్నాధిపతిగా కుజుడు ఉండటంతో వ్యక్తి ఆకర్షణీయమైన, శక్తివంత మైన శరీరం కలిగి ఉంటారు. విలాసవంతమైన జీవితం అంటే ఇష్టపడతారు. కోప స్వభావం ఉంటుంది. వ్యవసాయ రంగం మీద మక్కువ చూపుతారు. భూములు కొనుగోలు చేయడం పట్ల ఆసక్తి చూపుతారు. సాహసవంతమైన వృత్తులలో రాణిస్తారు. వ్యాపారంలో రాణించడం కష్టం. రక్షణ వ్యవస్థలో ఉద్యోగం చేయడం పట్ల ఆసక్తి చూపుతారు. లగ్నస్థ కుజుడు చతుర్ధ దృష్టిని మిత్ర స్థానం సింహం మీద ప్రసరిస్తాడు కనుక తల్లి నుంచి సహాయ సహకారాలు అందుకుంటారు. తల్లి కోపస్వభావం కలిగి ఉంటుంది. లగ్నస్థ కుజుని సప్తమ దృష్టిని వృశ్చికం మీద ప్రసరిస్తాడు కనుక కోపస్వభావం కలిగిన జీవిత భాగస్వామి లభిస్తుంది. జీవితభాగస్వామి సహాయ సహకారాలు అందుకుంటారు. అయితే జీవిత భాగస్వామితో అభిప్రాయ బేధాలు ఉంటాయి. వైవాహిక జీవితంలో సమస్యలు ఏర్పడుతాయి. లగ్నస్థ కుజుని అష్టమస్థాన దృష్టి మిత్ర స్థానమైన ధనస్సు మీద ప్రసరిస్తాడు... కనుక ఆరోగ్య సమస్యలు తక్కువగా ఉంటాయి. భాగస్వాములతో వీరికి అభిప్రాయ బేధాలు వస్తుంటాయి. భాగస్వామ్యం వీరికి సాధారణంగా ఉంటుంది.

***బుధుడు*** : వృషభ లగ్నానికి బుధుడు ధనాధిపత్యం, పంచమాధిపత్యం వహిస్తాడు. త్రికోణాధిపతి లగ్నస్తుడు అవ్వడంతో బుధుడు వృషభ లగ్నానికి కారక గ్రహమై మంచి ఫలితాలు అందిస్తాడు. లగ్నస్థ బుధుని కారణంగా వ్యక్తి బుద్ధికుశలత, సాహసం కలిగి ఉంటాడు. ఈ జాతకులకు వ్యాపారం అనుకూలిస్తుంది. ధైర్యసహసాలు వీరికి అధికం. సొంత నిర్ణయాలు తీసుకుని మనోబలంతో విజయం సాధిస్తారు. సాహసవంతమైన వృత్తులను స్వీకరించి నైపుణ్యం చూపించగలరు. శిక్షణకు సంబంధించిన ఉపాధ్యాయ వృత్తిలో రాణిస్తారు. బుధుని పూర్ణ దృష్టి సప్తమ స్థానం మిత్ర స్థానం అయిన వృషభం మీద ఉంటుంది. కనుక బంధుమిత్రుల నుంచి సహాయం అందుతుంది. స్నేపూరితమైన అందమైన ప్రేమను చూపించే జీవితభాస్వామి లభిస్తుంది. జీవిత భాగస్వామి సహాయాలు అందుకుంటారు. భాగస్వామ్యం వీరికి అనుకూలం. వీరికి భాగస్వాములు స్నేహపూరిత సహకారం అందిస్తారు.

***గురువు*** : వృషభ లగ్నానికి గురువు అష్టమ, ఏకాదశ స్థానములకు ఆధిపత్యం వహిస్తాడు. లగ్నస్త గురువు ఆకర్షణీయమైన సౌందర్యం ఇస్తాడు.. కనుక వృషభలగ్నానికి అకారక గ్రహమై చెడు ఫలితాలు ఇస్తాడు. లగ్నస్థ గురువు వ్యక్తికి జ్ఞానం, సుగుణం ఇస్తాడు. ఆత్మబలం, ఆత్మవిశ్వాసం ఇస్తాడు. ఈ జాతకులు ఉద్యోగాలలో రాణిస్తారు. ధర్మగుణం, దయాగుణం కలిగి ఉంటారు. ధర్మకార్యాల పట్ల ఆసక్తులై ఉంటారు. గురువు పంచమ దృష్టి కన్యారాశి మీద ప్రసరిస్తాడు కనుక బుద్ధి కుశలత కలిగి సహాయ సహకారాలు అందించి గౌరాభిమానం చూపించే సంతానం కలిగి ఉంటాడు. లగ్నస్థ గురువు సప్తమ స్థానమైన వృశ్చికం మీద ప్రసరిస్తాడు కనుక గురువు మిత్రస్థాన దృష్టి జ్ఞానం కలిగిన గౌరవ అభిమానం

చూపించి సహాయసహకారాలు చూపించే జీవిత భాగస్వామి లభిస్తుంది. గురువు నవమ స్థాన దృష్టి మకరం మీద ప్రసరిస్తాడు కనుక తండ్రితో సాధారణ సంబంధాలు ఉంటాయి.

***శుక్రుడు*** : వృషభ లగ్నానికి శుక్రుడు లగ్నాధిపతిష్టమాధిపతి. లగ్నాధిపతిగా శుక్రుడు కారక గ్రహమై మంచి ఫలితాన్ని ఇస్తాడు. లగ్నాధిపతిగా శుక్రుడు అందమైన శరీరం ఇస్తాడు. అరోగ్యపరమైన సమస్యలు ఉంటాయి. జలుబు, దగ్గు, ఆయాసం లాంటి వ్యాధులు ఉంటాయి. మనోబలం అధికం. జనాకర్షణ కలిగిఉంటారు. కళారంలో వీరు ప్రతిభ చూపగలరు. కళాసంబంధిత వృత్తులలో రాణిస్తారు. వలాసవంతమైన జీవితం పట్ల ఆసక్తి చూపుతారు. సుఖజీవితం కొరకు ఎక్కువగాఖర్చు చేస్తారు. సుగంధ ద్రవ్యాలు, సౌందర్య సాధనాలకు సంబంధించిన వృత్తి వ్యాపారాలను చేపడతారు. ఆర్ధిక పరిస్థితిబాదా ఉంటుండీ. ధనార్జన బాగా చేస్తారు. లగ్నస్థ శుక్రుడు పూర్ణ దృష్టిని సప్తమ స్థానం అయిన వృశ్చికం మీద సారిస్తాడు కనుక జీవిత భాగస్వామి విలాసాల వైపు మొగ్గు చూపే అవకాశం ఉంది కోపస్వభావం కలిగిన అందమైన ప్రేమించే జీవిత భాగస్వామి లభిస్తుంది. వైవాహిక జీవిత సుఖం సాదారణం. మిత్రులు, భాగస్వాములు ఉద్రేక పూరిత గుణం కలిగి ఉంటారు. భాగస్వామ్యం వీరికి సాదారణ ఫలితాన్ని ఇస్తుంది.

***శని*** : వృషభ లగ్నానికి శని నవమ, దశమ స్థానాధిపత్యం వహిస్తాడు. ధర్మకర్మాధిపత్యం చేసే శని మిత్ర స్థానమైన వృషభ లగ్నానికి శుభుడై మంచి ఫలితాలు అందిస్తాడు. శని లగ్నాధిపత్యం వలన సన్నని ఆకర్షణీయమైన శరీరం కలిగి ఉంటాడు. శ్రమించి ఉన్నత కార్యసాధన చేస్తాడు. ఆర్ధిక స్థితి సాధారణం. తల్లితో వీరికి సఖ్యత సాధారణం. సోదరులతో అంతగా సఖ్యత ఉండదు. కఠిన స్వభావం కారణంగా ఇతరుల అసహనానికి గురవుతారు. శని తృతీయ దృష్టి కారణంగా సోదరులతో అభిప్రాయ బేధాలు ఉంటాయి. సోదరుల సహాయ సహకారం ఉండదు. లగ్నష శని పూర్ణ దృష్టి సప్తమ స్థానమైన వృశ్చికం మీద ప్రసరిస్తాడు కనుక పరుష వాక్కులు పలికి క్రోధ స్వభావం కలిగి, శ్రమించే గుణం కలిగిన జీవిత భాగస్వామి లభిస్తుంది. జీవిత భాగస్వామి సహాయసహకారాలు అందవు. భాగస్వామ్యం వీరికి అనుకూలించదు. భాగస్వాముల సహకారం లభించదు. మిత్రుల సహకారం ఉండదు. లగ్నస్త శని నవమ స్థాన దృష్టి కారణంగా తండ్రితో సత్సంబంధాలు ఉండవు. తల్లిదండ్రుల ప్రేమాభిమానాలకు, సహాయసహకారాలకు దూరమవుతారు.

***రాహువు*** : వృషభ లగ్నస్థ రాహువు వ్యక్తికి రోగరహిత శరీరాన్ని ఇస్తాడు. రాహువు సప్తమ దృష్టి కారణంగా వైవాహిక జీవితం కాస్త సమస్యగా మారుతుంది. జీవిత భాగస్వామితో అభిప్రాయ బేధాలు ఉంటాయి. వైవాహిక జీవితంలో సుఖం ఉండదు. జీవిత భాగస్వామికి ఆరోగ్య సమస్యలు ఉంటాయి.

***కేతువు*** : వృషభ లగ్నస్థ కేతువు వ్యక్తికి ఆరోగ్య సమస్యలు ఇస్తాడు. స్త్రీ పురుషుల మద్య ఆకర్షణ ఉంటుంది. వివాహేతర సంబంధాల వలన వైవాహిక జీవితంలో సమస్యలు ఎదురయ్యే అవకాశం.

## మిధున లగ్నము - ఫలములు

మిధున లగ్నమున జన్మించిన వారు, నల్లని అందమైన కళ్ళు, రింగులు తిరిగిన జుట్టు, ఇతరుల భావములను చూడగానే చెప్పగల నేర్పులై ఉంటారు. సంగీత, నృత్యములలో ఆశక్తి. ఎక్కువకాలము స్వ గృహమునసే ఉండువాడు అగును. లగ్నాధిపతి బుధుడు.

*సూర్యుడు* : మిధున లగ్నానికి సూర్యుడు తృతీయ స్థానాధిపతి. సూర్యుడు లగ్నంలో ఉండటం వల్ల ముఖవర్చస్సు ఉంటుంది. ఈ జాతకులు అందం, ఆకర్షణ, ఉదారస్వభావం కలిగి ఉంటారు. సాహసం, ధైర్యం, పురుష లక్షణం ఎక్కువగానే ఉండును.

***కుజుడు*** : మిధున లగ్నానికి కుజుడు షష్టమ, ఏకాదశ స్థానాలకు ఆధిపత్యం వహిస్తాడు.. కనుక అకారక గ్రహంగా అశుభఫలితాలను ఇస్తాడు. మిధున లగ్నంలో కుజుడు ఉంటే వ్యక్తి పరాక్రమవంతుడు, శక్తివంతుడు అవుతాడు. అస్థిర జీవితాన్ని గడపవలసిన పరిస్థితి ఎదురవుతుంది. విహారయాత్రలు చేయడమంటే వీరికిష్టం. ఈ జాతకులు ముఖ్యంగా రక్షణ వ్యవస్థలో రాణిస్తారు. తల్లిదండ్రుల నుంచి అంతగా సహకారం లభించదు. శత్రువుల వల్ల కష్టాలను చవి చూస్తారు. లగ్నస్థ కుజుని దృష్టి సప్తమ భావం మీద ఉంటుంది కనుక వైవాహిక జీవితంలో కష్టాలు ఎదురవుతాయి.

***బుధుడు*** : మిధున లగ్నానికి లగ్నాధిపతిగా ఉండే బుధుడు శుభ ఫలితాన్ని ఇస్తాడు. మిధున లగ్నంలో ఉన్న బుధుడు వ్యక్తికి వాక్చాతుర్యం, మంచి జ్ఞాపకశక్తి కలిగి ఉంటారు. ఈ జాతకులు వృత్తి, వ్యాపార మెళుకువలో నైపుణ్యం కలిగి ఉంటారు. వీరు ధన సంపాదనా మార్గాలను మార్చుతుంటారు. ఈ కారణం వల్ల అర్ధిక పరిస్థితి సాధారణంగా ఉంటుంది. వీరు రచయితగా, లేఖకునిగా, సంపాదకునిగా సఫలతను పొందుతారు.

***గురువు*** : మిధున లగ్నంలో గురువు సప్తమ, దశమ స్థానాలకు ఆధిపత్యం వహిస్తాడు. ద్వకేంద్రాధిపత్య కారణంగా గురువు అకారక గ్రహంగా అశుభ ఫలితాలను ఇస్తాడు. లగ్నంలో గురువుతో బుధుడి చేరి ఉన్న అశుభ ఫలితాలు కొంత తక్కువగా ఉంటాయి. గురువు లగ్నంలో ఉండి వ్యక్తికి అందమైన శ్వేత వర్ణం కలిగిన శరీరాన్ని ప్రసాదిస్తాడు. దగ్గు, జలుబు వంటి ఆరోగ్య సమస్యలు ఉంటాయి. స్తయ వాక్కు, జ్ఞానం, చాతుర్యం కలిగిన వ్యక్తిగా ఉంటారు. సమాజంలో గౌరవ, మర్యాదలు లభించును. గురువు తాను నాయకత్వం వహించే విషయాలలో శుభ ఫలితాలు ఇస్తాడు. పుత్ర స్థానం, పంచమ స్థానం అయిన తుల, సప్తమ స్థానమైన ధనసు, నవమ స్థానమైన కుంభం మీద దృష్టిని సారిస్తాడు. ఈ కారణం వల్ల పుత్రులు, జీవిత భాగస్వామి, తండ్రి నుంచి అనుకూలత లభిస్తుంది.

***శుక్రుడు*** : మిధున లగ్నానికి శుక్రుడు పంచమ, ద్వాదశాధిపతి. త్రికోణాధిపత్యం వహిస్తాడు కనుక శుభఫలితాన్ని ఇస్తాడు. మిధున లగ్నంలో మిత్ర స్థానములో ఉన్న శుక్రుడు శుభ ఫలితాన్ని ఇస్తాడు. మిధున లగ్నంలో శుక్రుడు ఉన్న వ్యక్తి సన్నగా నాజూకుగా అందంగా ఉంటాడు. భౌతిక సుఖాలపట్ల వీరు అత్యంత ఆసక్తులుగా ఉంటారు. సుఖంగా ఉండడానికి ధన వ్యయం అధికంగా చేస్తారు. సమాజంలో గౌరవం ప్రాప్తిస్తుంది. ఆర్ధిక పరిస్థితి మెరుగ్గా ఉంటుంది. లగ్నస్థ శుక్రుడు పూర్ణ దృష్టితో సప్తమ స్థానం మీద దృష్టిని సారిస్తాడు. కనుక జీవిత భాగస్వామి మీద ప్రేమ కలిగి ఉంటారు. వివాహేతర సంబంధాలు ఉండే అవకాశం.

***శని*** : మిధున లగ్నానికి శని అష్టమ, నవమ స్థానాధిపత్యం వహిస్తాడు. త్రికోణ స్థానాధిపత్యం వలన అష్టమ స్థానాధిపత్య దోషం ఉండదు. దీంతో శని మిధున లగ్నకారులకు శుభ ఫలితాన్ని ఇస్తాడు. లగ్నస్థ శని అనారోగ్యానికి గురిచేస్తాడు. వాత, పిత్త, చర్మ రోగములు కలిగిస్తాడు. శని భాగ్య స్థానాధిపతి.. కనుక శనీశ్వరుడి మీద భక్తి కలుగుతుంది. లగ్నస్థ శని తృతీయ స్థానం శత్రు స్థానం అయిన సింహం మీద, సప్తమ స్థానంగా ఉండే ధనసు మీద, దశమ స్థానంగా ఉండే మీనం మీద దృష్టిని

పెడతాడు కనుక కనిష్ట సోదరులతో విరోధం, కామం అధికంగా ఉండుట, ప్రభుత్వ పరమైన దండన అనుభవించుట కలుగవచ్చు. తల్లిదండ్రులతో సంబంధ బాంధవ్యాలు అనుకూలంగా ఉండవు. పరిశ్రమించగల గుణం ఉంటుంది.

*__రాహువు__* : రాహువుకు మిధునం మిత్ర స్థానం. ఈ కారణంగా ఈ జాతకుడు మేధస్సు కలిగి ఉంటారు. కుశలతతో కార్యాలను చేపడతారు. ఆరోగ్యం, ఆకర్షణ కలిగిన శరీరం కలుగుతుంది. సాహసం అధికంగా ఉంటుంది. మిధున లగ్న జాతక స్త్రీలకు సంతానం పొందుటలో సమస్యలు ఎదుర్కొంటారు. రాహువు పూర్ణ దృష్టిని సప్తమ స్థానం మీద సారిస్తాడు.. కనుక వైవాహిక జీవితంలో కలహాలు చోటు చేసుకుంటాయి.

*__కేతువు__* : మిధున లగ్నంలో కేతువు వ్యక్తికి స్వాభిమానం కలిగిస్తాడు. ఒంటరిగా కార్యసాధనకు దిగే సత్తా ఉండదు. ఇతరులతో కలిసి పని చేసేందుకే ఇష్టపడతారు. వ్యాపారం చేయడంలో కోరిక ఉంటుంది. వీరికి స్వార్ధం కూడా అధికంగా ఉంటుంది. వాత పిత్త రోగాలు బాధిస్తాయి. కామం ఎక్కువ, వైవాహిక జీవితంలో ఒడిదుడుకులు ఉంటాయి. వివాహానంతరం కూడా వివాహేతర సంబంధాలు కొనసాగే అవకాశం.

## కర్కాటక లగ్నము – ఫలితాలు

కర్కాటక లగ్నంలో జన్మించినవారు భోజన ప్రియులు, వినయవంతులు, జలక్రీడాసక్తుడు. సారగ్రాహి, ఉదారుడు అవుతారు. ఈ జాతకునకు శుక్ర, శని, బుధ, గురు లు పాపులు. కుజుడు రాజయోగకారకుడు, గురు, కుజులు రాజయోగాన్ని ఇస్తారు. శుక్రుడు మారకాన్ని కలిగిస్తాడు.

*__సూర్యుడు__* : కర్కాటక లగ్నానికి సూర్యుడు ధనస్థానాధిపతి. కటక లగ్నస్థ సూర్యుడు ఈ జాతకుడికి ఆరోగ్య సమస్యలు సృష్టిస్తాడు. రవి దశలో అనరోగ్య సమస్యలు తప్పవు. వీరికి కోపం, స్వాభిమానం ఎక్కువ. వ్యాపారం మీద ఆసక్తి , ఉద్యోగం మీద కోరిక ఉంటాయి. ప్రభుత్వం నుంచి, ప్రభుత్వ వర్గాల నుంచి సమస్యలు ఎదురవుతాయి. తండ్రితో అభిప్రాయ బేధాలు త లెత్తుతాయి. అలాగే బంధుమిత్రులతోనూ అభిప్రాయబేధాలు తలెత్తవచ్చు. వీరిది నిలకడైన మనస్థత్వం కాదు. వీరికి భాగ స్వామ్యం కలిసి రాదు. కటక లగ్నస్థ సూర్యుడు పూర్ణ దృష్టితో సప్తమ స్థానమైన మకరం మీద దృష్టిని సారిస్తాడు. ఈ కార ణం వల్ల జీవితభాగస్వామితో అభిప్రాయ బేధాలు ఉంటాయి. వైవాహిక జీవితంలో కొన్ని అనుకోని సమస్యలు ఏర్పడవచ్చు.

*__చంద్రుడు__* : కర్కాటక లగ్నానికి చంద్రుడు లగ్నాధిపతి, రాశ్యాధిపతిగా కారక గ్రహమై మంచి ఫలితాలు ఇస్తాడు. కటక లగ్నస్థ చంద్రుడు భగవత్భక్తి, పెద్దల మీద గౌరవ మర్యాదలు కలిగిస్తాడు. ఈ జాతకులకు మనోబలం ఎక్కువ. సొంత ప్రయ త్నంతో సమాజంలో ఉన్నత స్థానం చేరుకుంటారు. వ్యాపార, కళారంగాలలో సాఫల్యత కలుగుతుంది. జ్ఞానం, ఉన్నత విద్య కలిగి ఉంటారు. నిజమైన మాటలే కాని, కఠినంగా మాట్లాడటం వల్ల వీరు విరోధమును ఎదుర్కొంటారు. లగ్నస్థ చంద్రుడు పూర్ణ దృష్టిని సప్తమ భావం మీద ప్రసరిస్తాడు కనుక జీవిత భాగస్వామికి సౌందర్యం ఇస్తాడు. జీవిత భాగస్వామి సహాయ సహకారాలు లభిస్తాయి. వీరికి భాగస్వామ్యం కలసి వస్తుంది. భాగస్వాములు సహకరిస్తారు. వైవాహిక జీవితంలో పెద్దగా స మస్యలు లేకుండా సాఫీగా సాగిపోతుంది.

*__కుజుడు__* : కర్కాటక లగ్నానికి కుజుడు పంచమాధిపతి, దశమాధిపతి. త్రికోణాధిపతిగా, దశమాధిపతిగా కారక గ్రహమై మంచి ఫలితాన్ని ఇస్తాడు. అయినా లగ్నస్థ కుజుడు వ్యక్తికి క్రోధగుణం, ఉగ్రస్వభావం కలిగిస్తాడు. ఈ జాతకులకు రాజకీయాలు లాభిస్తాయి. లగ్నం నుంచి కుజుడు చతుర్ధ, సప్తమ, అష్టమ భావముల మీద దృష్టిని ప్రసరిస్తాడు కనుక ఆర్ధిక

లాభం, అధిక వ్యయం కలిగిస్తాడు. తెలివితేటలు పేరాశ వీరికి అవమానాలను ఇస్తుంది. లగ్నస్థ కుజుడు సంతాన ప్రాప్తి కలిగిస్తాడు. కుజుడి సప్తమ దృష్టి కారణంగా వైవాహిక జీవితంలో మాధుర్యం లోపించి కలహ పూరితంగా ఉంటుంది.

***బుధుడు*:** కటక లగ్నానికి బుధుడు తృతీయ, ద్వాదశ స్థానాలకు ఆధిపత్యం వహిస్తాడు. బుధుడి కటక లగ్నస్థ స్థితి వ్యక్తికి సందేహాస్పద వ్యక్తిత్వం, ఆచరణ, అలవాట్లు కలిగి ఉంటాడు. ఈ జాతకులకు వ్యాపారంలో కంటే ఉద్యోగంలో ఆసక్తి ఎక్కువగా ఉంటుంది. వీరికి బంధుమిత్రులతో సోదరులతో విశేషమైన ఆప్యాయత ఉండదు. బుధుడు పూర్ణ దృష్టితో సప్తమ స్థానం మీద దృష్టిని ప్రసరిస్తాడు కనుక వైవాహిక జీవితంలో సమస్యలు ఎదురవుతాయి. భాగస్వాముల వలన హాని ఉంటుంది. శత్రువుల వల్ల సమస్యలు ఎదుర్కోవాల్సి ఉంటుంది.

***గురువు*** : కటక లగ్నానికి గురువు షష్టమ, నవమభావాలకు అధిప. లగ్నానికి గురువు త్రికోణాధిపత్యమైన నవమస్థానాధిపతిగా కారక గ్రహమై మంచి ఫలితాలను ఇస్తాడు. కటక లగ్నంలో గురువు ఉచ్ఛస్థితిని పొందుతాడు కనుక వ్యక్తికి ఆకర్షణీయమైన వ్యక్తిత్వాన్ని ప్రసాదిస్తాడు. గురువు పరిపూర్ణ దృష్టితో మిత్ర స్థానమైన పంచమ స్థానం గల వృశ్చికాన్ని, సప్తమ స్థానాన్ని, నవమ స్థానాన్ని చూస్తున్నాడు కనుక సంతాన భాగ్యం ఉంటుంది. ఈ జాతకులకు ఉత్తమమైన జీవితభాగస్వామి లభిస్తుంది. భాగస్వాముల సహాయ సహకారాలు అందుతాయి. నవమ స్థాన దృష్టి ఫలితంగా సంపూర్ణ భాగ్యశాలి అవుతాడు. ధన, ధాన్య సంపదలతో జీవితం పరిపూణ భాగ్యంతో గడుస్తుంది. వ్యాపారంలో ఉదారత, దయాస్వభావం కలిగి ఉంటారు.

***శుక్రుడు*** : కటక లగ్నానికి శుక్రుడు చతుర్ధ, ఏకాదశాధిపతి. లగ్నస్థ శుక్రుడు వ్యక్తికి పిరికితనం, భయం కల్గిస్తాడు. ఆర్ధిక పరిస్థితి బాగుంటుంది. ఉద్యోగ అవసరాలలో సఫలత లభిస్తుంది. లగ్నస్థ శుక్రుడు సప్తమ దృష్టి శని స్థానం మిత్ర స్థానమైన మకరం మీద ఉంటుంది కనుక వ్యక్తికి పరిశ్రమించే గుణం ఉంటుంది. స్త్రీల మీద వీరికి విశేష ఆకర్షణ ఉంటుంది. అందమైన శ్రమకు ఓర్చే జీవిత భాగస్వామి లభిస్తుంది. జీవిత భాగస్వామి సహాయ సహకారాలు అందుకుంటారు.

***రాహువు*** : కటక లగ్నంలో రాహువు వ్యక్తిని విలాసవంతుడిగా చేసి భోగముల మీద ఆకర్షణ కలుగచేయును. కఠిన శ్రమ తరువాత వ్యాపారంలో సఫలత సాధిస్తారు. ఉద్యోగములో తొందరగానే సఫలత లభిస్తుంది. రాహువు సప్తమ దృష్టి ఫలితంగా వైవాహిక జీవితంలో అశాంతి చోటు చేసుకునే అవకాశం ఉంది. జీవిత భాగస్వామి సహాయ సహకారాలు లభించవు. భాగస్వామి వల్ల నష్టాలు కలుగవచ్చు.

***కేతువు*** : కటక లగ్నస్థ కేతువు ఆరోగ్య సమస్యలు కలిగిస్తాడు. కేతు దశ సమయంలో అనరోగ్య సమస్యలు తప్పవు. సమాజం నుంచి గౌరవం, సన్మానాల పట్ల ఆసక్తి కల్గి ఉంటారు. రహస్య శత్రువులు ఉంటారు. వారి వలన సమస్యలు తప్పక పోవచ్చు. కేతువు సప్తమ స్థాన దృష్టి ఆ స్థానకారకత్వమును బాధిస్తుంది. వైవాహిక జీవితంలో సుఖం లోపిస్తుంది. వివాహేతర సంబంధాలు కలిగే అవకాశం ఉంటుంది.

## సింహ లగ్నము - ఫలితాలు

సింహ లగ్నము జన్మించిన వారు అందంగాను, అరోగ్యముగాను వుంటారు. వీరు మహత్వాకాంక్ష కలిగి మొండి స్వభావం కలిగి వుంటారు. ఈ జాతకులు ఎంత సాహసం గలవారో అంతే ఆత్మవిశ్వాసం గలవారు కూడా. వీరిలో సాహసం,

ఆత్మవిశ్వాసము, మొండిపట్టుదల అధికంగా ఉండును. రాజనీతిలో వీరికి అభిరుచి వుండును. ఈ లగ్నం గల కుండలిలో ప్రథమ భావములో స్థితిలో వున్న గ్రహాలు ఏ విధమైన ఫలితాలను ఇస్తుందో చూద్దాం.

***సూర్యుడు*** : సింహ లగ్నములో సూర్యుడు లగ్నాధిపత్యం వహిస్తూ కారక గ్రహమై మంచి ఫలితాన్ని ఇస్తాడు. సింహ లగ్నంలో సూర్యుడున్న స్వక్షానమున ఉండటం వల్ల ఈ జాతకుడికి ఆత్మవిశ్వాసం, పరిపూర్ణత కలిగించును. సింహ లగ్నస్థ సూర్యుని కారణంగా గా వ్యక్తి విద్యాంసుడిగా, గుణవంతుడుగా ఉంటాడు. వీరి కార్యశూరత ప్రతిభ కారణం వల్ల సన్మానాలను అందుకుంటారు. వీరు ఏ కార్యమైనా మనస్ఫూర్తిగా చేపడతారు. పరాక్రమం, ఉదార స్వభావం గల వారు. ఇతరులకు సహకరించే గుణం ఉంటుంది. అంతేకాదు, పరాక్రమం కలిగి ఉంటారు. లగ్నస్థ సూర్యుడు సప్తమ స్థానం అయిన శత్రస్థానం కుంభం మీద దృష్టిని సారిస్తాడు. ఈ కారణం వల్ల వైవాహిక జీవితం బాగుంటుంది. మిత్రుల నుంచి, భాగస్వాముల నుంచి సహాయ సహకారాలు అంతగా లభించవు.

***చంద్రుడు*** : సింహ లగ్నానికి చంద్రుడు వ్యయస్థానాధిపతిగా అకారక గ్రహమై చెడు ఫలితాలను ఇస్తాడు. లగ్నస్థ చంద్రుడు వ్యక్తికి అధైర్య మనస్తత్వాన్ని, నిలకడ లేని జీవితాన్ని ఇస్తాడు. నిస్వార్థంగా ఇతరులకు సహకరిస్తారు. ఇక ఈ జాతకులకు తల్లిదండ్రుల నుంచి సహాయసహారాలు అందుతాయి. రాజకీయాలలో సఫలత సాధిస్తారు. చంద్రుడు లగ్నస్థంలో ఉండి సప్తమ స్థానం అయిన కుంభం మీద దృష్టి సారిస్తాడు. ఈ కారణం వల్ల వైవాహిక జీవితంలో సమస్యలు ఏర్పడవచ్చు. చంద్రుడికి పాప గ్రహ చేరిక, దృష్టి ఉంటే చెడు ఫలితాలు తగ్గుతాయి.

***కుజుడు*** : సింహ లగ్నానికి కుజుడు చతుర్థాధిపతి, నవమభావాలకు ఆధిపత్యం వహిస్తాడు. ఈ కారణం వల్ల కారక గ్రహమై మంచి ఫలితాలు ఇస్తాడు. లగ్నస్థ కుజుడు పరిపూర్ణ ఆత్మవిశ్వాసం, సాహసం, నిర్భయత్వం ఇస్తాడు. వీరికి అనేక విధముల ధనాగమనం ఉంటుంది. లగ్నస్థ కుజుడు చతుర్ధ స్థానమైన మీద , సప్తమ అష్టమ స్థానముల మీద దృష్టి సారిస్తాడు. కనుక తల్లితో విబేధాలు, జీవితభాగస్వామితో అభిప్రాయబేధాలు ఉంటాయి. మిత్రుల సహాయసహకారాలు లోపించే అవకాశం. శత్రు పీడ పొంచి ఉండే అవకాశం.

***బుధుడు*** : సింహ లగ్నస్థ బుధుడు ద్వితీయ, ఏకాదశ స్థానాధిపత్యం వహిస్తాడు. ఈ కారణం వల్ల ఈ లగ్నముకు బుధుడు ధన కారకుడు. లగ్నస్థ బుధుడు అధిక ధనాదాయాన్ని ఇస్తాడు. వీరికి కళారంగ సంబంధాలు ఉంటాయి. వీరికి శత్రు భయం అధికం. బుధుడు పూర్ణ దృష్టిని సప్తమ స్థానం మిత్ర స్థానం గల కుంభం మీద దృష్టి సారిస్తాడు. ఈ కారణం వల్ల ఈ జాతకులకు జీవిత భాగస్వామి మీద ప్రేమాభిమానాలు ఉంటాయి. కాని జీవితభాగస్వామి సహాయసహకారాలు వీరికి అందదు. సంతాన సుఖం తక్కువ. బుధుడు పాపగ్రహ చేరిక దృష్టి కలిగి ఉన్న అశుభ ఫలితాలను ఇస్తాడు.

***గురువు*** : సింహ లగ్నానికి గురువు పంచమ, అష్టమాధిపధిపత్యం వహిస్తాడు. త్రికోణాధిపత్యం కారణం వల్ల గురువు కారక గ్రహమై మంచి ఫలితాలను ఇస్తాడు. లగ్నస్థ గురువు అందమైన, ఆకర్షణీయమైన శరీరాన్ని ఇస్తాడు. బుద్ధి కుశలత, జ్ఞానం, వీరి సొత్తు. దయా స్వభావం కలిగి ఉంటారు. ధనం భద్రపరచే నేర్పరితనం ఉంటుంది. బుద్ధికుశలత, జ్ఞానం వీరిని ఉన్నత పదవులను అధిరోహింపజేస్తుంది. ఉద్యోగవ్యాపారాలు రెండింటిలో వీరికి సాఫల్యత లభిస్తుంది. సంఘంలో గౌరవమర్యాదలు ఉంటాయి. గురువు సప్తమ దృష్టి కారణంగా జీవిత భాగస్వామి నుంచి, పంచమ దృష్టి కారణంగా పుత్రుల

నుంచి సహాయ సహకారాలు అందుకుంటారు. మిత్రుల, భాగస్వాముల నుంచి సహాయ సహకారాలు అందుకుంటారు. అదృష్టం వీరిని వెన్నంటి ఉంటుందని చెప్పవచ్చు.

*__శుక్రుడు__* : శుక్రుడు సింహ లగ్నానికి తృతీయ, దశమాధిపతి. సింహ లగ్న శుక్రుడికి కేంద్రాధిపత్య దోషం ఉంటుంది. లగ్నస్థ శుక్రుడి కారణంగా అందమైన శరీరం కలిగి ఉంటారు. వీరికి భౌతిక సుఖాల మీద ఆసక్తి అధికంగా ఉంటుంది. మెట్టింటి నుంచి సమయానుకూల సహాయం లభిస్తుంది. పూర్ణ దృష్టితో శుక్రుడు సప్తమ స్థానాన్ని చూస్తున్నాడు కనుక ధనమును అనవసరంగా అదుపు లేకుండా ఖర్చు చేస్తారు. వివాహేతర సంబంధాలకు ధన వ్యయం చేస్తారు. సప్తమ భావంలో ఉన్న శుభ గ్రహం శుభుల చేరిక సంబంధాలు కల్గి ఉన్న జీవిత బాగస్వామికి విశ్వాసపాత్రులుగా ఉంటారు.

*__శని__* : సింహ లగ్నానికి శని అష్టమ, సప్తమ స్థానాలకు ఆధిపత్యం వహిస్తాడు. సింహ లగ్నస్థ శని అకారక గ్రహంగా అశుభ ఫలితం ఇస్తుంది. సింహ లగ్నస్థ శని వ్యక్తిని సమాజ విరోధ కార్యాలకు ప్రోత్సహిస్తుంది. లగ్నస్థ శని వీరికి అపకీర్తిని, కపట స్వభావాన్ని కలిగిస్తుంది. లగ్నస్థ శని తృతీయ దృష్టి కారణంగా కనిష్ట సోదరుల సహకారం అందదు. సప్తమ దృష్టి కారణంగా జీవిత భాగస్వామి నుండి కష్టాలు ఎదురుకావచ్చు. వీరి కపట వృత్తి కారణంగా మిత్రుల నుంచి సహకారం అందదు. వీరికి పేరాశ అధికం. లగ్నస్థ శని శుభ గ్రహ చేరిక శుభగ్రహ దృష్టి కలిగి ఉన్న చెడు ఫలితాలు తగ్గవచ్చు.

*__రాహువు__* : సింహ లగ్నస్థ రాహువు చెడు ఫలితాలు ఇస్తాడు. లగ్నస్థ రాహువు ఈ జాతకుడి ఆత్మవిశ్వాసాన్ని, ఆత్మబలాన్ని క్షీణింపచేస్తుంది. దీంతో సొంత నిర్ణయం చేసుకునే శక్తి లోపిస్తుంది. వీరు సంఘంలో గౌరవ మర్యాదలను కాపాడుకోవడానికి శ్రమించవలసి వస్తుంది. వీరికి మంత్ర తంత్రములు గుప్త విద్యల అందు ఆసక్తి అధికం. లగ్నస్థ రాహువు వల్ల వీరు రాజనీతిలో ప్రావీణ్యం కలిగి ఉంటారు. రాహువు సప్తమ దృష్టి కారణంగా మిత్రుల నుండి భాస్వాముల నుంచి విశేష సహాయ సహకారం లభించదు. వ్యాపారంలో నష్టాలను ఎదుర్కొంటారు.

*__కేతువు__*: శత్రు రాశి అయిన సింహరాశిలో ఉన్న కేతువు చెడు ఫలితాలను ఇస్తాడు. సింహ లగ్నస్థ కేతువు అనారోగ్యం కలిగిస్తాడు. కేతు దశాకాలంలో వీరికి ఆరోగ్య సమస్యలు తలెత్తే అవకాశం. ఈ జాతకులకు తల్లిదండ్రుల మీద అధికమైన ప్రేమాభిమానాలు ఉండవు. ఎల్ల వేళలా మానసిక చింత వీరిని బాధిస్తుంది. సప్తమ భావం మీద కేతువు దృష్టి కారణంగా వైవాహిక జీవితంలో సమస్యలు ఎదురయ్యే అవకాశం ఉంది. జీవిత భాగస్వామికి ఆరోగ్య సమస్యలు ఎదురు కావచ్చు.

## కన్యా లగ్నము - ఫలితాలు

ఈ రాశికి బుధుడు అధిపతి. కన్యా రాశి స్వభావరీత్యా 'ద్వి స్వభావ రాశి'. ఈ కారణం వల్ల ఈ జాతకులు ఇరు వైపులా ఆలోచిస్తుంటారు. ప్రతి విషయంలో లోతుగా పరిశీలిస్తుంటారు. అభిప్రాయాలను మార్చుకుంటూ ఉంటారు. అంత తేలిగ్గా ఏ విషయాన్నీ వదలరు. ప్రతిదాన్నీ ఒకటికి రెండుసార్లు ఆలోచిస్తారు. అనుమానించడం కూడా కన్యారాశి వారికి సహజ సిద్ధమైన లక్షణం. ఏ విషయంలోనైనా విచక్షణ ఉపయోగిస్తూ ఉంటారు.

మహిళలు అలయితే తేలిగ్గా కన్నీళ్లు పెట్టుకుంటారు. ఆవేశానికి, ఉక్రోషానికి లోనవుతూ ఉంటారు. శారీరక అవసరాలు, కుటుంబ ప్రాధాన్యతలకు పెద్దపీట వేస్తారు. భౌతిక విషయాలమీద దృష్టి పెడతారు. పని ప్రారంభించే ముందు పదేపదే ఆలోచిస్తారు. కార్యం ప్రారంభించాక మాత్రం పట్టువిడువకుండా పూర్తి చేస్తారు. సహనంతో వ్యవహరిస్తూ ఉంటారు. ముందు

జాగ్రత్త ఉంటుంది. కొన్నిసార్లు అతి జాగ్రత్త కూడా ఉంటుంది. స్త్రీ రాశి కావడంతో మానసిక భావనలకు అధిక ప్రాధాన్యం ఉంటుంది. లక్ష్యం మీద దృష్టి నిలిపే తత్వం వీరిది.

***సూర్యుడు*** : కన్యాలగ్నానికి సూర్యుడు ద్వాదశాధిపతి. వ్యయాధిపతిగా సూర్యుడు కన్యా లగ్నానికి అకరక గ్రహం అవుతాడు. కన్యాలగ్నస్థ సూయుడి కారణంగా వ్యక్తి ప్రభావశాలిగా ఉంటాడు. లగ్నస్థ సూర్యుడు అందమైన, ప్రకాశవంతమైన శరీరం ఇస్తాడు. ఈ జాతకులకు శ్వాస, దగ్గు, జలుబు, హృదయ వ్యాధులు వచ్చే అవకాశం కలదు. లగ్నస్థ సూర్యుడి కారణంగా వీరికి విదేశీయానం ఉండే అవకాశం. లగ్నస్థ సూర్యుడు సప్తమ స్థానం మీద దృష్టి ప్రసరిస్తాడు. కారణం వల్ల వైవాహిక జీవితంలో సమస్యలు ఎదురవుతుంటాయి. ఈ జాతకులకు భాగస్వామ్యం అంతగా అనుకూలించదు. లగ్నస్థ సూర్యుడికి పాపగ్రహ చేరిక దృష్టి కలిగి ఉన్న పరిహారం చేయడం శ్రేయస్కారం.

***చంద్రుడు*** : కన్యాలగ్నానికి చంద్రుడు ఏకాదసాధిపతిగా అకారక గ్రహంగా అశుభ ఫలితం ఇస్తాడు. లగ్నస్థ చంద్రుడు వ్యక్తికి అందం, కల్పనా శక్తి ఇస్తాడు. లగ్నస్థ చంద్రుడు వ్యక్తికి దయాగుణం, ఆత్మవిశ్వాసం కలిగిస్తాడు. ఈ జాతకుడు జీవితంలో శీఘ్రగతిలో ప్రగతిని సాధిస్తారు. చంద్రుని స్థికారణంగా అస్థిర మనస్తత్వం ఉంటుంది. లగ్నం నూడి చంద్రుడు పరిపూర్ణ దృష్టిని సప్తమ స్థానం అయిన మీనం మీద ప్రసరిస్తాడు కనుక గురువు ప్రభావం వల్ల జీవిత భాగస్వామితో ప్రేమ పూరిత సహకారం అందుతుంది. వీరికి అకస్మాత్ లాభార్జన ఉండే అవకాశం. చంద్రుడికి పాపగ్రహ చేరిక దృష్టి ఉన్న కారణంగా మంచి ఫలితము తక్కువగా ఉండును.

***కుజుడు*** : కన్యా లగ్నానికి కుజుడు తృతీయ, షష్టమాధిపతి.. కనుక కుజుడు కన్యాలగ్నానికి అకారక గ్రహంగా చెడు ఫలితాలను ఇస్తాడు. లగ్నస్థ కుజుడి కారణంగా క్రోధస్వభావం కలిగి ఉగ్రుడై ఉంటాడు. తల్లిదండ్రులతో అభిప్రాయబేధాలు ఉంటాయి. అయితే సోదరులతో సఖ్యత ఉంటుంది. లగ్నస్థ కుజుడి కారణంగా తండ్రికి అనారోగ్యం కలిగే అవకాశం. కుజుడు అష్టమ భావం మీద దృష్టి సారిస్తాడు కనుక శారీరక కష్టాలు అనుభవించవలసి ఉంటుంది. లగ్నస్థ కుజుడు పూర్ణ దృష్టితో సప్తమ స్థానాన్ని చూస్తున్నాడు కనుక వైవాహిక జీవితంలో సమస్యలు తప్పకపోవచ్చు.

***బుధుడు*** : బుధుడు కన్యా లగ్నానికి లగ్నాధిపతి, దశమాధిపతిగా ప్రముఖ కారక గ్రహముగా ఉంటాడు. లగ్నస్థ బుధుడు స్వస్థానంలో ఉన్నాడు కనుక వ్యక్తి అందం, ఆకర్షణ, ఆరోగ్యం కలిగి ఉంటాడు. కన్యా లగ్నస్థ బుధుడు ఈ జాత కుడికి పరిపూర్ణ ఆత్మవిశ్వాసం, దీర్ఘాయుష్షు ఇస్తాడు. వీరి ఆత్మబలం కారణంగా వ్యక్తి వ్యవసాయ, వ్యాపార రంగాలలో అత్యున్నత ప్రగతి సాధిస్తాడు. ఈ జాతకుడికి సమాజంలో గౌరవ మర్యాదలు లభిస్తాయి. లగ్నస్థ బుధుడు పూర్ణ దృష్టితో సప్తమ స్థానాన్ని చూస్తున్నాడు కనుక జీవిత భాగస్వామి నుంచి గుణసంపన్నుడైన జీవిత భాగస్వామి లభిస్తాడు. జీవిత భాగస్వామి సహకారం లభిస్తుంది. వైవాహిక జీవితం సుఖమయంగా, ఆనందమయంగా ఉంటుంది. వీరికి భాగస్వామ్యం లాభిస్తుంది.

***గురువు*** : కన్యాలగ్నానికి గురువు అకారక గ్రహం. కన్యాలగ్నానికి గురువు చతుర్ధ, సప్తమ స్థానాలకు అధిపతి. లగ్నస్థ గురువు కారణంగా వ్యక్తికి తండ్రి వలన పేరు ప్రతిష్టలు కలుగుతాయి. బంధుమిత్రులతో అభిప్రాయ బేధములు కలుగుతాయి. పుత్రుల నుంచి ఆదరణ, సహకారం లభిస్తుంది. పిత్రి సంపద వీరికి లభిస్తుంది. గురువు లగ్నం నుంచి

పంచమ, సప్తమ, నవమ స్థానముల మీద దృష్టిని సారిస్తాడు. కనుక దీర్ఘాయువు, పుత్ర సంతతి, ఖ్యాతి కలుగుతుంది. గురువు పాపగ్రహ చేరిక దృష్టి కలిగి ఉన్న మంచి ఫలితాలు తగ్గుతాయి.

***శుక్రుడు*** : కన్యాలగ్నానికి శుక్రుడు ధనాధిపతిగా, నవమాధిపతిగా కారక గ్రహంగా శుభ ఫలితాలు ఇస్తాడు. మిత్ర స్థానంలో ఉన్న కన్యా లగ్నస్థ శుక్రుడు వ్యక్తిని ప్రగతి పధంలోకి తీసుకువెళతాడు. లగ్నస్థ శుక్రుని కారణంగా వ్యక్తి కళాభిరుచి కలిగి ఉంటాడు. వీరికి ధార్మిక భావాలు ఎక్కువ. ఈ జాతకుడికి ప్రభుత్వం నుంచి, ప్రభుత్వ రంగం నుంచి సహాయ సహకారం లభిస్తుంది. లగ్నస్థ శుక్రుడు సప్తమ స్థానమైన మీనం మీద దృష్టి సారిస్తాడు కనుక జీవిత భాగస్వామి నుంచి సహకారం లభిస్తుంది.

***శని*** : కన్యాలగ్నానికి శని పంచమాధిపతిగా, షటమాధిపతిగా ఉండి త్రికోణాధిపత్య గ్రహంగా కారకమై మంచి ఫలితాన్ని ఇస్తాడు. లగ్నస్థ శని వ్యక్తిని బుద్ధిశాలిగా, జ్ఞానిగా, కఠిన పరిశ్రామికుడిగా చేస్తాడు. లగ్నస్థ శని వ్యక్తికి శరీర దారుఢ్యం ఇస్తాడు. వీరి పవారిక జీవితం అశాంతికరం. సంతానంతో సత్సంబంధాలు ఉండక పోవచ్చు. లగ్నస్థ శని తృతీయ, సప్తమ, నవమ స్థానాల మీద దృష్టిని సారిస్తాడు.. దీని వల్ల సోదరులతో అభిప్రాయ బేధాలు ఉంటాయి. జీవిత భాగస్వామి అందం, ఆధ్యాత్మికత కలిగి ఉంటారు. వైవాహిక జీవితంలో సమస్యలు తప్పకపోవచ్చు.

***రాహువు*** : కన్యాలగ్నమున ఉన్న రాహువు వ్యక్తికి పొడవైన, ఆరోగ్యవంతమైన శరీరం ఇస్తాడు. వీరిలో చతురత్వం స్వార్ధం ఉంటుంది. కనుక కార్యం ఎలాగైనా సాధించుకుంటారు. లగ్న నుంచి రాహువు పూర్ణ దృష్టితో సప్తమ స్థానం మీద దృష్టిని సారిస్తాడు.. కనుక జీవిత భాస్వామితో కలహం అశాంతి కలిగి ఉంటారు. వీరికి భాగస్వామ్యం కలసి రాదు. జీవిత భాగస్వామికి కష్టములు ప్రాప్తించే అవకాశం ఉంటుంది.

***కేతువు*** : కన్యా లగ్నస్థ కేతువు వ్యక్తిని స్వార్ధ పూరితుడిని చేస్తుంది. గూఢాచారిగా సాఫల్యత సాధిస్తారు. ఈ జాతకుడికి వాత రోగం, నడుము నొప్పి కలిగే అవకాశం. లగ్నస్థ కేతువు పూర్ణ దృష్టితో సప్తమ స్థానం మీద దృష్టిని సారిస్తాడు.. దీనివల్ల జీవిత భాగస్వామికి రోగపీడను కలిగిస్తుంది. కేతువు శుభ గ్రహ దృష్టి చేరిక కలిగి ఉన్న వివాహేతర సంబంధాలకు అవకాశం ఉంటుంది.

## తుల లగ్నము - ఫలితాలు

తులాలగ్నానికి అధిపతి శుక్రుడు. ఈ లగ్నములో జన్మించిన వ్యక్తి అందముగా, ఆకర్షణీయంగా వుండును. సూర్యుడు, ఏకాదశాధిపతిగా అకారక గ్రహంగా అశుభ ఫలితాన్ని ఇస్తాడు. చంద్రుడు అశుభ ఫలితాన్ని ఇస్తాడు. బుధుడు కారక గ్రహ ఫలితాన్ని ఇస్తాడు. గురువు అకారక గ్రహంగా అశుభ ఫలితాన్ని ఇస్తాడు.

***సూర్యుడు*** : తుల లగ్నము కుండలిలో సూర్యుడు ఏకాదశ బావము యొక్క అధిపతిగా ఉండటం వల్ల అకారక గ్రహము కాగలడు. శత్రు రాశి లగ్నములో కూర్చొని వున్న సూర్యుడు వ్యక్తికి నేత్ర సంబంధమైన సమస్యలు సృష్టించును. ఆర్ధిక వన రులలో లోపమును తీసుకువచ్చును. లగ్నములో సూర్యునితో పాప గ్రహముల యుతి లేదా దృష్టి కలిగి ఉండటం వల్ల వ్యక్తి ఉగ్ర, క్రోదస్వబావము కలవారై ఉంటారు. ప్రథమ భావములో స్థితిలో ఉన్న సూర్యుడు వారి సప్తమ దృష్టి ద్వారా సప్తమ

భావములో స్థితిలో వున్న మేష రాశిని చూస్తున్నాడు. సూర్యుని యొక్క దృష్టి కుజునిపై ఉండుట కారణంగా వ్యక్తి సాహసము, పరాక్రమము కలవాడై ఉండును. వీరి వివాహం విల్లంభములతో కూడినదై ఉండును.

***చంద్రుడు*** : చంద్రుడు తుల లగ్నము గల కుండలిలో లగ్నస్థుడుగా వుండుట వల్ల వ్యక్తి బాల్య దశలో సంఘర్షణతో కూడి కాస్త కఠినంగా ఉండును. యువావస్త, వృద్ధావస్త సుఖమయంగాను, ఆనందమయంగాను కొనసాగును. చంద్రుడు వీరిని గుణవంతునిగా చేయును. వీరి మనస్సు కల్పనాశీలత, అస్థిరత్వంతో కూడినదై ఉండును. కన్యా లగ్నము యొక్క కుండలిలో చంద్రుడు యది లగ్నస్థముగా వుండిన ఎడల తల్లితో స్నేహపూరితమైన సంబంధాలు కలిగి వుండుటకు అవకాశములు తక్కువ. ఈ లగ్నములలో చంద్రుడు దశమాదిపతిగా ఉండి అశుభ కారకుడు కాగలడు. సప్తమ భావములో దీని దృష్టి వుండుట వలన జీవిత భాగస్వామి క్రోధి, సాహసి, మహత్వకాంక్ష గలవారై వుండెదరు. లగ్నస్థ చంద్రుడు యది శుభగ్రహములతో యుతి లేదా దృష్టి కలిగి ఉన్న ఎడల సప్తమ భావముతో సంబంధిత ఉత్తమ ఫలితాలను పొందగలరు.

***కుజుడు*** : తుల లగ్నము గల కుండలిలో కుజుడు ద్వితీయ, సప్తమ భావము యొక్క అధిపతి కాగలడు. ప్రథమ భావములో స్థితిలో వున్న కుజుడు వ్యక్తిని ద్వితీయాదిపతుడుగా వుండుట వల్ల ఆర్థిక లాభములను కలిగించును. వ్యాపార, వర్తకములలో మంచి లాభపేక్ష కలుగును. స్వతంత్రంగా పని చేపట్టుట వల్ల వీరికి లాభములు కలుగును. భాగస్వామ్యంలో నష్టము కలిగే అవకాశాలున్నాయి. లగ్నస్థ కుజుడు వారి పూర్ణ ధృష్టితో చతుర్ధ, సప్తమ, అష్టమ బావములను చూస్తున్నాడు. సుఖ భావములో కుజునితో దృష్టి కలిగి వుండుట కారణముగా సోదరుల నుంచి అపేక్షిత సహ్యోగము లభించకపోవచ్చు. పూర్ణ భౌతిక సుఖం లభించుటకు అవకాశాలు తక్కువగా ఉన్నాయి. వైవాహిక జీవితములో కష్టములను ఎదుర్కోవాల్సి వచ్చును. అష్టమ భావము పీడించబడి వుండుట వలన కుజుని దశావదిలో అరోగ్య సంబంధమైన సమస్యలను ఎదుర్కోవాల్సి రావచ్చు.

***బుధుడు*** : తుల లగ్నము కుండలిలో బుధుడు నవమాదిపతి, ద్వాదశాదిపతి. ఇది ఈ లగ్నములో కారక గ్రహముగా పాత్రను నిర్వహించును. లగ్నస్తుడుగా ఉండి ఇది వ్యక్తికి నవమ మరియు దశమ భావముల ఫలితాలను ఇచ్చును. ఇది వ్యక్తిని ధార్మిక, బుద్ధివంతునిగా చేయును. ప్రభుత్వం, ప్రభుత్వతంత్రముద్వారా వీరికి సహ్యోగం, సమ్మానం ప్రాప్తి చెందగలదు. జన్మ స్థలమునకు దూరముగా వీరి భాగ్యము వికసించును. వీరికి తల్లిదండ్రుల ప్రేమ, సహ్యోగము లభించగలదు. బుధుడు పూర్ణ దృష్టితో సప్తమ భావమును చూస్తున్నాడు. దీంతో వైవాహిక జీవితం సుఖమయంగా ఉండును. సంతానం, జీవిత బాగస్వామి వల్ల సహ్యోగము లభించగలదు. లగ్నస్థ బుధుడు పాప గ్రహములతో పీడించబడి ఉండటం వల్ల ధనం, సుఖం, కుటుంబ జీవితములో సమస్యలు ఏర్పడవచ్చు.

***గురువు*** : తుల లగ్నము గల కుండలిలో గురువు అకారక గ్రహము అవుతాడు. ఇది తృతీయ, షష్టమ భావము యొక్క అధిపతి కాగలడు. గురువు యది కుండలిలో లగ్నస్థంగా ఉండటం వల్ల ఇది వీరిని ఆత్మవిశ్వాసంతో పరిపూరితం చేయును. వీరిని సాహసిగా చేయును. ఈ జాతకులు తమ బుద్ధి కుశలతో జీవితంలో ధనము, మాన సమ్మానములను పొందుతారు. లగ్నములో కూర్చొని ఉన్న గురువు పంచమ, సప్తమ, నవమ భావమును చూస్తున్నాడు. పంచమ భావములో గురువు యొక్క దృష్టి ఈ లగ్నములో సంతాన కారకుడుగా ఉండును. ఇది మీకు భౌతిక క్షమత, ఉచ్చ శిక్షను ప్రధానించును. సోదరుల నుంచి సహ్యోగం లభించగలదు. జీవిత భాగస్వామి నుంచి సహ్యోగ పూరితమైన, ప్రేమపూరితమైన సంబంధాలు ప్రధానించును. మాతృ పక్షం నుంచి లాభములను కలిగించును.

***శుక్రుడు*** : తుల లగ్నము యొక్క కుండలిలో శుక్రుడు లగ్నాదిపతి, అష్టమాదిపతి అవుతాడు. ఈ లగ్నములో ఇది కారక గ్రహం యొక్క భూమికత్వమును నిర్వహించును. ప్రథమ భావములో శుక్రుని యొక్క స్థితి కారణముగా వ్యక్తి చురుకుగా, ఆత్మవిశ్వాసముతో పరిపూరితంగాను ఉండును. శుక్రుని శుభ ప్రభావం కారణంగా వ్యక్తి సామాన్యంగా అరోగ్యంగాను, నిరోగస్తునిగా ఉండెదరు. సౌందర్యముపై ఆకర్షత కలిగి వుండెదరు. సంగీతము మరియు కళల యందు అభిరుచి కలిగి ఉండెదరు. సప్తమ భావంలో శుక్రుని పూర్ణ దృష్టి ఉండటం వల్ల వ్యక్తికి అనేక ప్రేమ ప్రసంసనలు వుండును. ఈ విషయం కారణముగా జీవిత భాగస్వామితో ఒడిదుడుకులు కూడా కలుగును. విలాసములకు సంబంధమైన వస్తువులపై ధనాన్ని ఖర్చు చేయడమంటే వీరు ఇష్టపడతారు.

***శని*** : తుల లగ్నం యొక్క కుండలిలో శని చతురాధిపతి, పంచమాధిపతిగా ఉండి కేంద్రం, త్రికోణ భావములకు అధిప తిగా ఉండును. ఈ రెండు భావముల అధిపతిగా ఉండుట వల్ల శని ప్రముఖ కారక గ్రహంగా ఉండును. ఈ లగ్నంలో శని లగ్నస్థుడుగా వుండుట వల్ల తల్లిదండ్రుల నుంచి స్నేహ సమ్యోగము ప్రాప్తించగలదు. విద్య యొక్క స్థితి బాగుండును. వృత్తి విజ్ఞాన సంబందమైన శిక్షలో వీరికి విషేశకరమైన సఫలత లభించగలదు. శని తన యొక్క పూర్ణ దృష్టి కారణముగా తృతీయ, సప్తమ, దశమ భావములను చూస్తున్నాడు. అందు వల్ల వీరిలో దయ, కరుణ స్వభావం అధికంగా ఉండును. శని వీరిని ధనవంతునిగా చేయుటతో పాటు భూమి, వాహన సుఖంను కూడా ప్రధానించును. బంధుమిత్రులతో వివాదాలు, మతబేధములకు అవకాశములు వున్నవి.

***రాహువు*** : వీరి జన్మము తుల లగ్నములో జరిగింది. లగ్న భావములో రాహువు కూర్చొని వున్నాడు. దీంతో వీరు అరోగ్య సమస్యలను ఎదుర్కొవాల్సి రావచ్చును. రాహువు అంతర్ముకి స్వభావముకలవారుగా చేయును. దానికారణము ఏపనిని చేపట్టదలచిన ఆ పని పూర్తిఅయ్యే వరకు ఎవరితోనూ చెప్పరు. పని జరుగుటకు ముందు దేనిగురించి మాట్లాడినా ఆ పని జరుగుటలో సమస్యలు ఎదురుకాగలవు. లగ్నములో కూర్చొని వున్న రాహువు పంచమ, సప్తమ మరియు నవమ బావములను చూస్తున్నాడు. రాహువు యొక్క దృష్టి వలన శిక్షలో మధ్యలో విడువ వలసి అవసరమును, జీవిత భాగస్వామితో, సంతానంతో సమ్యోగము లేకుండుట, భాగ్య హాని కలుగజేయును.

***కేతువు***: కేతువు తుల లగ్నము యొక్క కుండలిలో లగ్నస్థముగా పంచమ, సప్తమ, నవమ బావమును చూస్తున్నాడు. లగ్నములో కూర్చొని ఉన్న కేతువు వ్యక్తిని పరిశ్రమి, సాహసిగా చేయును. సాహసము, పరిశ్రమ కారణముగా వ్యక్తి కఠినమైన పనులను కూడా పూర్తిచేయ శక్తి కలవాడై వుండును. ఇతరుల ధనముపై వీరి దృష్టి వుండును. శిక్షలో కేతువు బాదకముగా వుండును. సాదారణముగా వీరిలో ధార్మిక భావనలు అధికముగా వుండును. మనస్సులో అనవసర భయాలు ఉండును. పందెలు, జూదములలో ధనము అనవసరముగా ఖర్చుకాగలదు.

## వృశ్చిక లగ్నము - ఫలితాలు

వృశ్చిక లగ్నము యొక్క అధిపతి కుజుడు. దశమ స్థానం, కేంద్ర స్థానానమైన దశమాధిపతి సూర్యుడు, ధన స్థానమైన 2వ, పుత్ర స్థానం త్రికోణ స్థానం అయిన పంచమ స్థానాధిపతి గురువు, యోగకారకుడు, త్రికోణ స్థానాధిపతి అయిన

చంద్రుడు వృశ్చిక లగ్నానానికి శుభం కలిగిస్తారు. సప్తమ స్థానాధిపతి మరియు వ్యయ స్థానమైన ద్వాదశ స్థానాలకు అధిపతి అయిన శుక్రుడు, అష్టమ స్థానాధిపతి మరియు లాభాధిపతి అయిన బుధుడు ఈ లగ్నానికి అశుభం కలిగిస్తారు.

***సూర్యుడు*** : వృశ్చిక లగ్నము గల కుండలిలో సూర్యుడు దశమాధిపతిగా ఉండుట వల్ల కారక గ్రహము కాగలడు. కుజుని యొక్క రాశిలో లగ్నస్థముగా ఉండి సూర్యుడు వ్యక్తికి ఆత్మబలమును ప్రధానించును. ఇది బుద్ధివంతునిగాను, మహత్వకాంక్షిగాను చేయును. ప్రభుత్వ పక్షం నుంచి లాభాలను కలిగించును. సూర్యుడు కర్మాదిపతిగా ఉండుట వల్ల వ్యక్తి ప్రభుత్వ ఉద్యోగం లభించే అవకాశం. ఏ వ్యక్తి యొక్క కుండలిలో ఈ స్థితి ఉన్నదో వారికి తండ్రి వద్ద నుంచి సహ్యోగము, స్నేహము లభిస్తుంది. సప్తమ భావములో స్థితిలో వున్న శుక్రుని రాశి వృషభముపై సూర్యుని యొక్క దృష్టి శృంగార, సౌందర్య సంబంధమైన వస్తువుల వ్యాపారం వీరికి విషేశ లాభములను ఇచ్చును. జీవిత భాగస్వామితో అశాంతి నెల కొంటుంది. అయితే మాతృమూర్తితో స్నేహపూరితమైన సంబంధాలు ఉంటాయి.

***చంద్రుడు*** : వృశ్చిక లగ్నం యొక్క కుండలిలో చంద్రుడు భాగ్యాదిపతి, త్రికోణాదిపతి కాగలడు. ఇది ఈ లగ్నము గల జాతకునికి శుభ ఫలదాయకముగా ఉండును. లగ్నములో చంద్రుడు స్థితిలోఉండుట వల్ల ఈ జాతకుడు అందంగా, ఆకర్షణీయంగా ఉండును. వీరు ప్రభావశాలి వ్యక్తిత్వం గలవారై ఉంటారు. వీరిలో ధార్మిక భావన అధికంగా ఉండును. వీరిలో దయ, కరుణా భావన ఉంటుంది. నడుము నొప్పి, పిత్త సంబంధమైన వ్యాధులు వచ్చే అవకాశం. భాగ్యం యొక్క బలం కారణంగా వీరి పని సునాయసంగా జరుగును. సంఘంలో గౌరవ మర్యాదలను పొందుతారు. సప్తమ భావములో చంద్రుని యొక్క దృష్టి కారణముగా అందమైన జీవిత బాగస్వామి ప్రాప్తించును. జీవిత భాగస్వామి నుంచి వీరికి సహ్యోగము లభించును.

***కుజుడు*** : వృశ్చిక లగ్నములో కుజుడు లగ్నాధిపతిగా ఉండుట వల్ల శుభ కారక గ్రహం కాగలడు. షష్టమ భావం యొక్క అధిపతిగా ఉండుట వలన దీని శుభత ప్రభావితం కాగలదు. అప్పుడు కూడా లగ్నాధిపతిగా ఉండుట వల్ల శుభ ప్రభావములనే ఇచ్చును. లగ్నస్థ ఉండుట వల్ల విశేష లాభకారిగా ఉండును. ప్రథమ భావంలో స్థితిలో వున్న గ్రహాలు వ్యక్తికి దీర్ఘాయువును ప్రధానించును. వ్యక్తిని శారీరకంగా శక్తిశాలి, పరిశ్రమి, నిరోగిగా చేయును. శత్రువుల వల్ల వీరు భ యబీతి పొందరు. ఇక మాతృ పక్షము నుంచి వీరికి లాభము కలుగును. లగ్నస్థ కుజుడు చతుర్ద, సప్తమ, అష్టమ భావాలను చూస్తున్నాడు. కుజుడు ఏ భావమునైతే చూస్తాడో ఆ భావము యొక్క ఫలితాలు పీడించబడగలవు. అంటే.. భూమి, భవనం, వాహన సుఖం బలహీన పడగలదు. తల్లితో కూడా మత బేధములకు అవకాశాలు ఉండును. జీవిత భాగస్వామికి అనుకోని సమస్యలు ఏర్పడవచ్చు. వైవాహిక జీవితంలో కొన్ని కష్టాలు చుట్టిముట్టవచ్చును.

***బుధుడు*** : బుధుడు శుభ గ్రహం అయినప్పటికీ ఈ లగ్నంలో అష్టమాదిపతి, దశమాదిపతిగా ఉండి అశుభ, అకారక గ్రహంగా ఉండును. వృశ్చిక లగ్నము కుండలిలో బుధుడు లగ్నస్థముగా ఉండుట వల్ల వ్యక్తి సాహసి, జ్ఞాని కాగలడు. బుధుని ప్రభావం వల్ల ఈ జాతకుడు భోజన ప్రియుడై ఉంటాడు. వీరు జన్మించిన తరువాత వీరి తండ్రి ఆర్ధిక పరిస్థితి బలపడును. తండ్రి లేదా తండ్రి పక్షం నుంచి లాభం కలిగే అవకాశాలున్నాయి. లగ్నస్థ బుధుడు పూర్ణ దృష్టితో సప్తమ భావములో స్థితిలో వున్న శుక్రుని రాశి వృశ్చికమును చూస్తున్నాడు. దాని ప్రభావము కారణముగా జీవిత భాగస్వామి, సంతానం నుంచి సహ్యోగము లభించగలదు. ధన సేకరణలో నిపుణులు అయినప్పటికీ కొన్ని సమయాలలో అలవాట్లు, ఉల్లాస సంబందమైన అలవాట్ల కారణంగాను వీరి ఆర్ధిక నష్టములను ఎదుర్కొవాల్సి వచ్చును. బుధుడు పాప గ్రహములతో

యుది లేదా దృష్టి కలిగి ఉన్న ఎడల గృహస్థ జీవితం కలహ పూరితమైనదిగా ఉండును. ఖర్చులు అధికంగా ఉండుట వల్ల అప్పులు కూడా తీసుకోవాల్సిన పరిస్థితి రావచ్చును.

***గురువు*** **:** గురువు వృశ్చిక లగ్నం యొక్క కుండలిలో ద్వితీయాధిపతి, పంచమాధిపతి కాగలడు. ద్వితీయాధిపతిగా ఉండుట వల్ల దీని యొక్క శుభత ప్రభావితము కాగలదు. కాని త్రికోణాదిపతిగా ఉండుట వల్ల కారక గ్రహం యొక్క ఫలితాలను ఇచ్చును. ఈ లగ్నం గల కుండలిలో గురు యది లగ్నస్తుడుగా వుండిన ఎడల వ్యక్తి చూడడానికి అందంగాను, పరిపూర్ణ ఆత్మవిశ్వాసము కలిగి ఉండును. గురువు యొక్క ప్రభావము కారణంగా ఉచ్చ శిక్షలను పొందెదరు. బుద్ధి కుశలత గలవారై ఉండెదరు. భవిష్యత్తు కొరకు ధన సంచయం చేయు అలవాట్లు ఉండుట కారణముగా సాదారణముగా వీరి జీవితము సుఖమయంగానే ఉంటుంది. లగ్నస్థ గురువు తన యొక్క పూర్ణ దృష్టితో పంచమ, సప్తమ, నవమ భావములను చూస్తున్నాడు. గురువు యొక్క దృష్టి కారణముగా వ్యక్తి ధనవంతుడు, సంతానం గలవాడు, గౌరవనీయమైన వ్యక్తికాగలడు.

***శుక్రుడు*** **:** శుక్రుడు వృశ్చిక లగ్నం గల కుండలిలో సప్తమాదిపతి, ద్వాదశాదిపతిగా ఉండుట వల్ల అకారక, అశుభ గ్రహము రూపంలో కార్యములను చేయును. శుక్రుడు కుండలిలో లగ్నస్థుడుగా ఉండటం వల్ల శరీరం, ఇతర వ్యవహారములలో విపరీత ప్రభావములను కలిగించును. ఆరోగ్య హాని ఉండవచ్చును. మానసికంగా సమస్యలను కలిగించును. లగ్నస్థ శుక్రుడు పూర్ణ దృష్టి ద్వారా సప్తమ బావములో స్వరాశి వృశ్చికమును చూస్తున్నాడు. జీవిత భాగస్వామితో మత బేధములు ఉండగలవు. జీవిత భాగస్వామి ఆరోగ్యం కష్టాలతో ప్రభావితం కాగలడు. భాగస్వామి నుంచి హాని కలుగవచ్చును. వస్త్రము, శృంగారం, సుగంధ పదార్థముల వ్యాపారాలు వీరికి లాభాలను తెచ్చిపెడతాయి. వ్యవసాయ సంబంధ వ్యాపారాలు కూడా వీరికి లాభాలను కలిగిస్తాయి.

***శని*** **:** వృశ్చిక లగ్నము యొక్క కుండలిలో శని తృతీయాదిపతి, చతురాదిపతిగా ఉండుట వల్ల అకారక గ్రహము కాగలదు. ఏ వ్యక్తి యొక్క కుండలిలో ఇది ప్రథమ భావములో వుండునో వారికి అరోగ్య సంబంధ సమస్యలను ఎదుర్కొవలసి వచ్చును. వీరికి ప్రభుత్వ రంగం నుంచి కష్టాలు కలుగును. దుర్ఘటన జరిగే అవకాశాలు ఉన్నాయి. స్త్రీల కుండలిలో వృశ్చిక లగ్నంలో లగ్నస్థ శని సంతాన విషయంలో కష్టకారి కాగలడు. ప్రథమస్థ శని తృతీయ, సప్తమ, దశమ భావములను పూర్ణ దృష్టి ద్వారా చూస్తున్నాడు. శని యొక్క దృష్టి ఫలితంగా సోదరుల నుంచి సహ్యోగం లభించగలదు. వ్యతిరేక లింగపు వ్యక్తికి లాభం కలుగును. చాలా ప్రేమ ప్రశంసలు ఉండగలవు. మెట్టింటి వారి నుంచి లాభం కలుగును. కాని జీవిత భాగస్వామి నుంచి అనుకోని సమస్యలు ఏర్పడవచ్చు.

***రాహువు*** **:** ఈ లగ్నం యొక్క కుండలిలో రాహువు లగ్నస్థంలో ఉండటం వల్ల వ్యక్తికి శారీరక సమస్యలు కలుగవచ్చును. ఆరోగ్య హాని కూడా కలుగవచ్చును. రాహువు యొక్క దశావదిలో వ్యాధులు వచ్చేందుకు అవకాశలు మెండుగా ఉన్నాయి. దీని వల్ల ప్రభావితం అయ్యే వ్యక్తిలో ఆత్మవిశ్వాసం బలహీనపడును. లగ్నస్థ రాహువు పంచమ, సప్తమ మరియు, నవమ భావమునకు దృష్టిని ప్రధానించును. రాహువు యొక్క దృష్టి కారణంగా వ్యక్తికి ఉద్యోగ వ్యాపారాలలో కష్టాలను ఎదుర్కొవలసి వచ్చును. అకస్మాత్తుగా హాని కలిగే అవకాశాలు ఉన్నాయి. వీరికి అనేక ప్రేమ ప్రశంసలు ఉండగలవు. వైవాహిక జీవితంలో కష్టాలను ఎదుర్కొవాలసి వచ్చును. జీవిత భాగస్వామితో సమస్యలు ఏర్పడవచ్చు.

***కేతువు*** : కేతువు వృశ్చిక లగ్నం యొక్క కుండలిలో వుండిన ఎడల వ్యక్తి సామాన్యముగా అరోగ్యముగా వుండును. కేతువు యొక్క ప్రభావం కారణంగా వ్యక్తి శారీరకంగా ధృడంగా, శక్తివంతంగా ఉంటాడు. సామాజిక ప్రతిష్ట, గౌరవ మర్యాదలను పొందుతారు. మాతృ పక్షం నుంచి స్నేహం, సహ్యోగము లభించగలదు. పంచమ, సప్తమ, నవమ భావములలో కేతువుతో దృష్టి కలిగి ఉండటం వల్ల వ్యక్తికి ఆర్ధిక పరిస్థితి బాగుంటుంది. జీవిత భాగస్వామి, సంతానం యొక్క సందర్భాలలో కష్టాల అనుభూతి కలుగగలదు.

## ధను లగ్నము - ఫలితాలు

ధను లగ్నం యొక్క అధిపతి గురువు. ఈ లగ్నములో జన్మించిన వారికి మానవీయ విలువలు ఉంటాయి. ఇతరుల పట్ల దయాబావము కలిగి ఉంటారు. వీరు శివుని పట్ల నమ్మకం కలిగి భాగ్యశాలిగా ఉండెదరు. ఈ లగ్నంలో మీరు జన్మించడం వ ల్ల లగ్నములో స్థితిలో వున్న గ్రహాలు ఏ విధమైన ప్రభావములను చూపుతాయో ఇప్పుడు చూద్దాం.

***సూర్యుడు*** : ధను లగ్నం యొక్క కుండలిలో సూర్యుడు భాగ్యాదిపతి కాగలడు. ఇది యది లగ్నంలో విరాజితమవ్వడం వల్ల వ్యక్తికి అందమైన శరీరం కలుగుతుంది. జ్ఞానము, బుద్ధి, ఆత్మబలమును ప్రదానించును. ఈ జాతకుడి మాటలు ప్రభావంతంగాను, ఆకర్షణీయముగాను ఉంటాయి. వ్యాపారం లేదా ఉద్యోగం రెండూ వీరికి కలిసి వస్తాయి. రాయుట, చదువుట ఇంకా భౌతిక కార్యములలో లోపప్రియతను పొందగలరు. చిత్ర కళ లేదా శిల్పకళలలో వీరికి అభిరుచి ఉంటుంది. లగ్నస్థ సూర్యుని సప్తమ భావములో బుధుని యొక్క రాశి మిథునమును చూస్తున్నాడు. సూర్యుని దృష్టి ఫలితం వల్ల ఆర్ధిక పరిస్థితి బాగుండును. భాగ్యాదిపతి సూర్యుడు ప్రభుత్వ రంగం నుంచి లాభంను కలిగించును. జీవిత భాగస్వామి, సంతాన సుఖం లభించగలదు.

***చంద్రుడు*** : చంద్రుడు ధను లగ్నము గల కుండలిలో అష్టమాదిపతిగా ఉండటం వల్ల మంచి ఫలితాలను ఇచ్చును. యది చంద్రుడు లగ్నము స్థితిలో ఉండటం వల్ల వ్యక్తి యొక్క మనస్సు స్థిరత్వము లేకుండా ఉండును. అనుసందానాత్మక పనులలో వీరి అభిరుచి ఉండగలదు. లగ్నస్థ చంద్రుని కారణంగా వ్యక్తి ఆరోగ్య సంబందమైన సమస్యలను ఎదుర్కోవాల్సి వచ్చును. వ్యక్తి ప్రయాణాల పట్ల ఆసక్తి గలవాడై ఉండును. కళలతో కూడిన విభిన్న రంగములలో, లేఖనములో వీరికి అభిరుచి అధికంగా ఉండును. చంద్రుని దృష్టి సప్తమ భావములోని సింహరాశిపై పడుతుండటం వల్ల, మిత్ర రాశి కారణంగా అందమైన, సహ్యోగముగల జీవిత బాగస్వామి లభించవచ్చు. సంతాన సుఖం కాస్త ఆలస్యముగా కలుగుతుంది.

***కుజుడు*** : కుజుడు ధను లగ్నం యొక్క కుండలిలో పంచమాదిపతి, వ్యయాధిపతిగా ఉండి శుభ కారక గ్రహంగా ఉండును. కుజుడు వీరిని పరిశ్రమిగా ఉండును. వ్యక్తి తన పరిశ్రమ, శ్రద్ధ వల్ల ధనంను ఆర్జిస్తారు. విపరీత లింగం పట్ల ఆసక్తి కలుగుతుంది. కుజుడు గురువు యొక్క ధనురాశిలో ఉండుట వలన శిక్షామార్గములో అవరోధాలను కలిగించును. ప్రథ మస్థ కుజుడు చతుర్ధ, సప్తమ, అష్టమ బావమును చూస్తున్నాడు. ఈ దృష్టి కారణంగా గృహస్థ జీవితంలో భార్యాభర్తల మధ్య సమస్యలు ఏర్పడవచ్చును. చిన్నచిన్న వివాదాలు కూడా మొదలవుతాయి.

***బుధుడు*** : బుధుడు ధను లగ్నము గల కుండలిలో సప్తమ, దశమ 2 కేంద్రముల అధిపతి కాగలడు. 2 కేంద్రముల అధిప తిగా ఉండటం వల్ల ఈ గ్రహం అకారక గ్రహం కాగలడు. కాని బుధుడు లగ్నస్థుడుగా ఉండటం వల్ల వ్యక్తికి అందమైన, నిరోగములతో కూడిన శరీరం ఉంటుంది. తల్లిదండ్రుల నుంచి స్నేహమును, సహ్యోగమును ప్రధానించును. ప్రభుత్వం,

ప్రభుత్వ రంగ సంస్థల నుంచి లాభం, గౌరవమును ప్రదానించును. మెట్టింటి నుంచి వీరికి సమయానుకూలంగా లాభమును ప్రదానించును. బుధుడు సప్తమ భావములో స్థితిలో వున్న స్వరాశిని చూస్తున్నాడు. ఈ కారణం వల్ల అందమైన, సహ్యోగము గల జీవిత భాగస్వామి లభించే అవకాశం. మిత్రుల నుంచి భాగస్వామ్యుల నుంచి లాభాలు కలుగును. ఇక వ్యాపారములో లాభములు కలుగును. ఆర్థిక స్థితి బలంగా ఉండును.

***గురువు*** : గురువు ధన లగ్నము యొక్క కుండలిలో లగ్నాదిపతి, చతురాదిపతి కాగలడు. కుండలిలో యది గురువు స్వరాశి ధనురాశిలో లగ్నస్థముగా ఉండటం వల్ల వ్యక్తికి అందమైన, అరోగ్యకరమైన శరీరం ఉంటుంది. వ్యక్తి బుద్ధి జ్ఞానము కలిగి ఉండును. సమాజంలో గౌరవ మర్యాదలు, ప్రతిష్టలను అందుకోగలరు. భూమి, భవనం, వాహనాలను సమ కూర్చుకోగలుగుతారు. ప్రథమ భావములో వున్న గురువు యొక్క పూర్ణ దృష్టి పంచమ భావములో మేష రాశిలో సప్తమలో మిథునముపై, నవమ భావములో సింహరాశిపై ఉండును. గురువు యొక్క దృష్టి ఫలితం వల్ల వ్యక్తి సాహసం, దయాస్వభావము కలిగి ఉండును. జీవిత భాగస్వామి నుంచి, సంతానం నుంచి ఆనందాలు అందుకోగలరు. జీవితంలో ఐశ్వర్యం, సుఖంతో పరిపూర్ణంగా ఉండును. ఉద్యోగం, వ్యాపారాల్లో సఫలత లభించగలదు. శత్రు భయము ఉండగలదు.. కాని వారు ఈ జాతకులకు హాని కలిగించలేరు.

***శుక్రుడు*** : ధను లగ్నము యొక్క కుండలిలో శుక్రుడు అకారక, అశుభ గ్రహం కాగలదు. ఇది ఈ లగ్నం యొక్క కుండలిలో 6వ, 11వ భావములకు అధిపతిగా ఉండును. శుక్రుడు ధను లగ్నములో లగ్నస్థముగా ఉండుట వల్ల వ్యక్తి చూడడానికి అందంగా ఉంటాడు. కాని శుక్రుడు షష్టమాదిపతిగా ఉండుట వల్ల వ్యక్తికి అరోగ్య సంబంధ సమస్యలను ఎదుర్కోవాల్సి వచ్చును. శుక్రుడు ఏకాదశాదిపతిగా ఉండటం వల్ల ఆర్థిక స్థితి బాగుపడును. రాజకీయ క్షేత్రముల నుంచి లాభాన్ని ప్రధానించును. శుక్రుని ప్రభావం కారణముగా వీరికి ప్రభుత్వ ఉద్యోగం లభించుటకు అవకాశాలు ప్రభాలముగా ఉన్నాయి. సంగీతం, కళల యందు ఆసక్తి అధికముగా ఉండును. శుక్రుడు సప్తమ భావములో మిత్ర గ్రహమైన మిథునంపై పూర్ణ దృష్టి కల్గి ఉండును. ఫలితంగా వీరి జీవిత భాగస్వామి అందంగాను, సహ్యోగము గలవారుగాను ఉండును. గృహస్థ జీవితం సుఖమయంగా ఉండును.

***శని*** : శని ధను లగ్నము యొక్క కుండలిలో ద్వితీయ, తృతీయ భావము యొక్క అధిపతి కాగలడు. ఈ లగ్నంలో శని లగ్నస్థంలో ఉండటం వల్ల వ్యక్తి సన్నగా ఉంటాడు. శని ప్రభావము కారణముగా వ్యక్తి నేత్ర రోగం వలన పీడించబడగలడు. వీరికి స్వతంత్రంగా ఏ నిర్ణయము తీసుకొవాలన్నా, కష్టంగా ఉండును. జీవితంలో ప్రగతి కొరకు ఇతరుల సహ్యోగము వీరు అధికముగా కోరుకుంటారు. ధనం భద్రపరచుటలో ప్రవృత్తి కలిగి ఉంటారు. ఇక ఈ జాతకులకు అకస్మాత్తుగా లాభములు కలుగే అవకాశాలు ఉన్నాయి. లగ్నస్థ శని తృతీయ భావంలో కుంభ రాశిని, సప్తమ భావంలో మిథున రాశిని, దశమ భావంలో బుధుని రాశి కన్యను చూస్తుండును. ఈ భావములలో శని యొక్క దృష్టి ఉండటం వల్ల మిత్రుల నుంచి అపేక్షిత లాభం, సహ్యోగము లభించదు. భాగస్వాముల నుంచి ఆపద కలిగే అవకాశాలు ఉన్నాయి. దాంపత్య జీవితంలో కష్టం యొక్క అనుభూతి కలుగుతుంది.

***రాహువు*** : ధను లగ్నం యొక్క కుండలిలో రాహువు లగ్నస్థంగా ఉండుట వల్ల ఈ జాతకుడు పొడుగుగా, అరోగ్యంగా ఉండును. వీరి బుద్ధి కూటనీతి కలదై ఉంటుంది. వారి పనిని ఏ విధంగానైనా చేపట్టే నేర్పు ఉంటుంది. స్వహితం వీరి

సిద్ధాంతం. రాహువు యొక్క దృష్టి కారణంగా సంతాన సుఖంలో బాధలు, జీవిత భాగస్వామి నుంచి సమ్యోగము లభించుటకు అవకాశాలు తక్కువగా ఉండును. జీవిత భాగస్వామి ఆరోగ్యం కారణంగా సమస్యలు ఏర్పడవచ్చు.

***కేతువు*** : కేతువు యొక్క ఉప స్థితి ధను లగ్నం యొక్క కుండలిలో ప్రథమ భావంలో ఉండుటం వల్ల వ్యక్తి జాతకుడికి అనారోగ్యాలు ఏర్పడే అవకాశం ఉంది. నడుము, శరీర చేర్పులలో నొప్పి ఉండగలదు. ఆత్మబలం లోపము కారణంగా ఏ విధమైన మహత్వపూరితమైన విషయాల్లోనూ నిర్ణయాలు తీసుకొనుట కఠినంగా ఉండును.

## మకర లగ్నము - ఫలితాలు

మకర రాశి జాతకులు గుండ్రని ముఖం కలిగి ఉంటారు. సన్నని బలహీనమైన దేహం కలిగి ఉంటారు. ఇతరుల ఆదరణను పొందే నేర్పు ఉంటుంది. తమ వ్యవహారములందుగాని, తాము చేయు వృత్తి, వ్యాపారముల యందు ఇతరులతో చక్కని చాతుర్యం కలిగి ప్రవర్తిస్తారు. ధన సంబంధమైన విషయాల్లో జాగ్రత్తగా ఉంటారు. మితంగా వ్యయం చేస్తూ పనులు చక్కబెట్టుకొవడం వీరి సహజ స్వభావం. ప్రతిఫలం లేనిదే ఖర్చు పెట్టుట వీరికి గిట్టదు. కుటుంబసభ్యులపై అనురాగం ఎక్కువ. వీరికి ప్రతి పనిలోను విఘ్నములు పొందుటకుగాని, ఆలస్యమగుట గాని జరుగును. వివాహ విషయంలో కొన్ని వివాదాలు ఎదురుకావచ్చు.

***సూర్యుడు*** : మకర లగ్నానికి సూర్యుడు అష్టమాధిపతి. అష్టమాధిపతి లగ్నంలో ఉండడం వలన ఆరోగ్య సమస్యలు తలెత్తే అవకాశాలు ఉంటాయి. ఎముకల నొప్పి, ఉదర సంబంధ వ్యాధులు కలిగే అవకాశాలుంటాయి. నేత్ర వ్యాధులు కలుగుతాయి. సూర్యుడు తన శత్రు స్థానమున ఉండడం వల్లల వీరి జీవితంలో కొన్ని సందర్భాల్లో కఠిన సమస్యలు ఎదుర్కోవాల్సి వస్తుంది. అలాంటి పరిస్థితుల్లో ఆత్మవిశ్వాసంతో, పట్టుదలతో విజయం సాధించాల్సి ఉంటుంది. వివాహ జీవితంలో ఒడిదుడుకులు ఉంటాయి. వ్యాపారం చేయాలన్న కోరిక ఉద్యోగం చేయాలన్న ఆసక్తి కలగలుపుగా ఉంటాయి.

***చంద్రుడు*** : మకర లగ్నంలో చంద్రుడు సప్తమాధిపతి. శత్రు రాశిలో లగ్నస్థ చంద్రుడు వ్యక్తికి సౌందర్యం ఇస్తాడు. అయితే, చంద్రుడు శత్రు స్థానంలో ఉండటంతో వీరు విచిత్ర మనస్తత్వంతో కనిపిస్తారు. ఈ జాతకులకు కళ్లు, చెవుల వాటి వ్యాధులు ఏర్పడవచ్చు. చంద్రుడు లగ్నం నుంచి సప్తమ స్థానమును మీద దృష్టి పెట్టడం వల్ల జీవిత భాగస్వామి అందం, గుణం కలిగి ఉంటుంది. జీవిత భాగస్వామితో అన్యోన్యం అనుకూలత కలిగి ఉంటారు.

***కుజుడు*** : మకర లగ్నానికి కుజుడు సుఖాధిపతి, లాభాధిపతి. కుజుడు లగ్నంలో ఉంటే ఆ వ్యక్తి క్రోధ స్వభావం కలిగి ఉంటాడు. తండ్రి వైపు బంధువుల సహకారం లభిస్తుంది. తండ్రి వల్ల పేరు, ప్రఖ్యాతలు వస్తాయి. శని ప్రభావం కారణంగా తండ్రి వైపు ఆస్తులు త్యాగం చేయవలసిన పరిస్థితి సంభవించగలదు. లగ్నస్థ కుజుడు 4, 7, 8 స్థానాల మీద దృష్టి సారిస్తాడు. అందువల్ల ధార్మికత ఉంటుంది. వైవాహిక జీవితంలో కలతలు కలుగుతాయి. మకర లగ్నంలో కుజుడు ఉచ్ఛ స్థితి కారణంగా వ్యక్తి క్రోధ స్వభావం కలిగి ఉంటారు. తల్లి కూడా ఉద్రేక స్వభావం కలిగి ఉంటుంది.

***బుధుడు*** : మకర లగ్నానికి బుధుడు షష్టమాధిపతి, నవమాధిపతి. మకర లగ్నస్థ బుధుడు వ్యక్తికి జ్ఞానం, బుద్ధికుశలత కలిగి ఉంటాడు. ఈ జాతకులు దైవ భక్తి, దయా స్వభావం, కళాభిరుచి కలిగి ఉంటారు. సమాజంలో గౌరవ మర్యాదలు, ధనం ప్రాప్తిస్తాయి. సప్తమ స్థానం మీద, బుధ దృష్టి ఫలితంగా జీవిత భాగస్వామి అందంగా సామర్థ్యశాలిగా ఉంటుంది.

షష్టామాధిపతి దృష్టి కారణంగా వైవాహిక జీవితంలో కలహాలు ఏర్పడి భార్యాభర్తల మధ్య విభేదాలు ఉంటాయి. సంతానం కలగడంలో జాప్యం కలిగే అవకాశం.

***గురువు*** : మకర లగ్నానికి గురువు తృతీయ వ్యయ స్థానాలకు ఆధిపత్యం వహిస్తాడు. కనుక గురువు ఈ లగ్నానికి అకారక గ్రహం. లగ్నస్థ గురువు వ్యక్తికి జ్ఞానం, సుగుణం కలిగిస్తాడు. ఈ జాతకులకు క్షమాగుణం ఎక్కువ. ఇతరుల కలతలు వీరిని ప్రభావితం చేస్తాయి కనుక కొన్ని సమస్యలను ఎదుర్కొంటారు. లగ్నస్థ గురువు పంచమ, సప్తమ, నవమ స్థానాల మీద దృష్టి పెడతాడు కనుక వివాహానంతరం అదృష్టం వస్తుంది.

***శుక్రుడు*** : మకర లగ్నానికి పంచమ, సప్తమ, దశమ స్థానాలకు కారకత్వం వహిస్తాడు. మకర లగ్నానికి శుక్రుడు శుభుడు. మకర లగ్నస్థ శుక్రుడి కారణంగా వ్యక్తి అందం, బుద్ధి కుశలత కలిగి ఉంటాడు. లగ్నస్థ శుక్రుడు వీరిని విలాసవంతులు, స్వార్ధపరులుగా చేస్తుంది. తమ అవసరానికి అనుగుణంగా తమ తీరును మార్చుకుంటారు. ఈ జాతకులు అవసరార్ధం మిత్రులను కలిగి ఉంటారు. స్త్రీలైన పురుషుల పట్ల, పురుషులైన స్త్రీల పట్ల సహజంగానే ఆకర్షితులు అవుతారు. సప్తమ స్థానమైన కటక రాశి మీద శుక్రుడి దృష్టి పడటం వల్ల వీరి మీద జీవిత భాగస్వామి ప్రేమను అప్యాయతను కలిగి ఉంటారు. జీవిత భాగస్వామి సుఖదుఃఖంలో సహాయ సహకారాలను అందిస్తారు.

***శని*** : మకర లగ్నస్థ శని లగ్నాధిపతి, ద్వితీయ స్థానాలకు ఆధిపత్యం వహించే కారక గ్రహం. దీంతో ఈ జాతకుడు భాగ్యశాలి కాగలడు. ఆకర్షణీయమైన శక్తివంతమైన శరీరాకృతి కలిగి ఉంటాడు. ఉద్యోగ వ్యాపారాలలో సాఫల్యం లభిస్తుంది. ఆకర్షణీయంగా మాట్లాడ లేరు. ప్రభుత్వ సేవారంగంలో పని చేసే అవకాశాం లభిస్తుంది. తల్లితో చక్కని సంబంధ బాంధవ్యాలు ఉంటాయి. శని తృతీయ, సప్తమ, దశమ దృష్టి కారణంగా జీవిత భాగస్వామికి కష్టాలు ఎదురవుతాయి. వైవాహిక జీవితంలో సమస్యలు ఎదురయ్యే అవకాశం.

***రాహువు*** : మకర లగ్నంలో రాహు స్థితి కారణంగా అనవసర హడావిడి ఎక్కువే. కార్య హాని జరిగే అవకాశాలున్నాయి. అనుకున్న పనులు సాధించడంలో తరచూ ఆటంకాలు ఎదురవుతాయి. వ్యాపారంలో ఆసక్తి ఉన్నా ఉద్యోగమే లాభదాయకంగా ఉంటుంది. లగ్నస్థ రాహువు సప్తమ దృష్టి కారణంగా సంసార జీవితంలో జీవిత భాగస్వామి నుంచి, మిత్రుల నుంచి తగిన సహకారం లభించదు.

***కేతువు*** : మకర లగ్నంలో ఉన్న కేతువు ఆరోగ్య సమస్యలకు హేతువు. తరచూ ఊహించని సమస్యలు ఎదురవుతారు. శత్రువుల వల్ల సమస్యలు ఏర్పడే అవకాశాలున్నాయి. సమాజంలో గౌరవ ప్రతిష్టల కొరకు అనుచిత కార్యముల చేసి అపజయం పాలవుతారు. లగ్నస్థ కేతువు స్త్రీలకు పురుషుల యందు, పురుషులకు స్త్రీల యందు విపరీత ఆకర్షణ కలిగి ఉంటారు. సప్తమ స్థానం మీద కేతు దృష్టి కారణంగా భాగస్వామికి కష్టాలు కలుగుతాయి.

## కుంభ లగ్నము - ఫలితాలు

కుంభ లగ్నము యొక్క అధిపతి శని. ఈ లగ్నములో సూర్యుడు, శుక్రుడు, శని శుభ కారక గ్రహములు. చంద్రుడు, కుజుడు, బుధుడు, గురువు అశుభ, అకారక గ్రహములుగా వుండును. కుంభ లగ్నానికి సప్తమ స్థానాధిపతి సూర్యుడు, నవమ స్థానాధిపతి శుక్రుడు, లగ్నాధి పతి శని శుభగ్రహాలు, కారక గ్రహాలు. తృతీయాధిపతి అయిన కుజుడు,

షష్టమాధిపతి చంద్రుడు, అష్టమస్థానాధిపతి బుధుడు అశుభ గ్రహాలు అకారక గ్రహాలు. కుంభ లగ్నములో జన్మించిన వారిని ప్రథమ భావములో స్థితిలో ఉన్న గ్రహాలు వారిని ఏ విధంగా ప్రభావితం చేయునో చూద్దాము.

***సూర్యుడు*** : కుంభ లగ్నం గల కుండలిలో సూర్యుడు సప్తమాధిపతిగా ఉండును. కేంద్ర భావం స్థితిలో ఉండి ఇది శుభ కారక గ్రహం యొక్క ఫలితాలను ఇచ్చును. కుంభ లగ్నం యొక్క కుండలిలో సూర్యుడు యది లగ్నస్థుడైన ఎడల వ్యక్తి చూడడానికి అందంగా, పరిపూర్ణ ఆత్మవిశ్వాసం కలిగి ఉండును. సప్తమాధిపతి సూర్య లగ్నస్తుడుగా ఉండటం వల్ల జీవిత భాగస్వామి అందంగాను, సహ్యోగమును ఇచ్చువాడు గాను ఉండును. అప్పుడప్పుడు వివాదాలు ఏర్పడతాయి. మిత్రుల నుంచి, భాగస్వాముల నుంచి సహ్యోగము లేదా లాభం కలుగుతుంది. వర్తక వ్యాపారాలలో త్వరగా సఫలత లభిస్తుంది. ఆర్థిక స్థితి సామాన్యంగా ఉంటుంది.

***చంద్రుడు*** : చంద్రుడు కుంభ లగ్నం గల కుండలిలో 6వ భావము యొక్క స్వామిగా ఉండి అకారక గ్రహము యొక్క భూమి కత్వమును నిర్వహిస్తున్నాడు. ప్రథమ భావంలో చంద్రుని స్థితి ఉండటం వల్ల వ్యక్తికి దగ్గు, జలుబు, జీర్ణశక్తికి సంబంధమైన వ్యాధులు వచ్చే అవకాశాలు ఉన్నాయి. చంద్రుని యొక్క ఈ స్థితి కారణంగా వ్యక్తి యొక్క మనస్సు అశాంతితో కూడినదై ఉండగలదు. కుటుంబ జీవితంలో కలహాలు, వివాదాలు జరిగే అవకాశములున్నాయి. చంద్రుని దృష్టి సప్తమస్థ సూర్య రాశి సింహంపై ఉండును. ఈ దృష్టి సంబంధం కారణంగా జీవిత భాగస్వామి అందముగాను, మహత్వాకాంక్షిగాను ఉండును.

***కుజుడు*** : కుజుడు కుంభ లగ్నం గల కుండలిలో తృతీయ, దశమ భావం యొక్క అధిపతి కాగలడు. ఈ లగ్నంలో కుజుడు అశుభ, అకారక గ్రహాల భూమికత్వమును నిర్వహించును. కుజుడు లగ్నస్థంగా ఉండటం వల్ల ఈ జాతకుడు ధృడమైన శారీరకము కలిగి ఉండును. వీరిలో సాహసం, పరాక్రమం ఎక్కువగా ఉంటుంది. కఠోర శ్రమతో కఠినమైన పనులను కూడా పూర్తి చేస్తారు. మాతృ, పితృ పక్షం నుంచి ఈ జాతకులకు అనుకూల సహ్యోగము లభిస్తుంది. సమాజంలో గౌరవ మర్యాదలు కలుగుతాయి. స్వభావంలో ఉగ్రత కారణంగా అనవసర వివాదాలను కొని తెచ్చుకొనెదరు. కుజుని యొక్క దృష్టి పంచమ భావంలో వృషభం, సప్తమ భావంలో సింహం, అష్టమంలో కన్యాలో ఉండటం వల్ల జీవిత భాగస్వామి గుణవంతుడు, వ్యావహారిక స్వభావం గలవాడై ఉండును. వైవాహిక జీవితం సామాన్యంగా సుఖమయంగా ఉండును. సప్తమాదిపతి, కుజుడు పీడించబడి లేదా పాప ప్రభావంలో ఉండటం వల్ల సప్తమ భావంలో సంబంధిత సుభాలు బాధిస్తాయి.

***బుధుడు*** : బుధుడు కుంభలగ్నము గల కుండలిలో పంచమాధిపతి, అష్టమాదిపతి కాగలడు. అష్టమాధిపతిగా ఉండటం వల్ల ఇది అకారక, అశుభ ఫలదాయిగా ఉంటుంది. లగ్నంలో దీని ఉపస్థితి కారణంగా ఈ జాతకుడు బుద్ధివంతుడు, వివేక వంతుడు అవుతాడు. శిక్షా రంగంలో వీరికి సఫలత లభిస్తుంది. మాటల ద్వారా వీరు ప్రజలను ప్రభావితం చేస్తారు. జలక్షేత్రంలో వీరికి ఆసక్తి అధికం. పడవ ప్రయాణాలు, జల యాత్రలు వీరిని ఆకట్టుకుంటాయి. బుధుని దశావదిలో మానసిక సమస్యలు ఏర్పడతాయి. ప్రథమస్థ బుధుడు సప్తమ భావంలో స్థితిలో ఉన్న సింహ రాశిని చూస్తున్నాడు. ఈ కారణం వల్ల జీవిత బాగస్వామితో వివాదాలు, మత బేధాలు ఏర్పడతాయి. వివాహేతర సంబంధాలు కూడా ఉండే అవకాశం.

***గురువు*** : కుంభ లగ్నం గల కుండలిలో గురువు అకారక గ్రహం కాగలడు. ఇది ద్వితీయ, ఏకాదశ భావము యొక్క అధిపతిగా ఉండును. లగ్నంలో దీని ఉపస్థితి కారణంగా వ్యక్తి బుద్ధివంతుడు, వివేకవంతుడు అవుతాడు. ఈ జాతకుల్లో

ఆత్మబలం, ఆత్మవిశ్వాసం అధికం. ధన సేకరణ చేసే నైపుణ్యం ఉంటుంది. దీంతో ఆర్థిక సమస్యలు పెద్దగా రావు. లగ్నంలో కూర్చొని ఉన్న గురువు పంచమ, సప్తమ, నవమ భావాలపై దృష్టి కలిగి ఉండును. గురువు యొక్క దృష్టి కారణంగా బంధుమిత్రుల నుంచి లాభం ప్రాప్తించగలదు. పితృ పక్షం నుంచి లాభము కలుగును. సంతానం, జీవిత భాగస్వామి నుంచి సుఖం ఉంటుంది.

***శుక్రుడు*** : కుంభ లగ్నం గల కుండలిలో శుక్రుడు సుఖాధిపతి, భాగ్యాధిపతిగా ఉండును. సుఖాధిపతి, భాగ్యాధిపతిగా ఉండటవ వల్ల ఇది ప్రముఖ కారక గ్రహంగా ఉంటుంది. లగ్నంలో దీని ఉప స్థితి కారణంగా వ్యక్తి అందంగా, ఆకర్షణీయంగా ఉండును. వీరు బుద్ధివంతులు, గుణవంతులు అవుతారు. అధ్యాత్మికంలో వీరికి అభిరుచి అధికం. ఆధ్యాత్మిక కార్యకలాపములలో వీరు ఇష్టంగా పాల్గొంటారు. మాతృమూర్తి నుంచి ప్రేమ, సహ్యోగం లభిస్తుంది. భూమి, భవనం, వాహన సుఖం ప్రాప్తి చెందగలదు. శుక్రుడు సప్తమస్థ సింహరాశిని చూస్తున్నాడు. ఈ కారణంగా వైవాహిక జీవితంలో సమస్యలు ఏర్పడవచ్చు. జీవిత భాగస్వామితో ఒడిదుడుకులు తప్పవు.

***శని*** : శని కుంభ లగ్నం గల కుండలిలో లగ్నాదిపతి, ద్వాదశాధిపతిగా ఉండి కారక గ్రహం యొక్క భూమికత్వమును నిర్వహించును. లగ్నాదిపతి శని స్వరాశి స్థితిలో వుండి వ్యక్తి ఆరోగ్యాన్ని, నిరోగముతో కూడిన శరీరాన్ని ప్రదానించును. శని యొక్క ప్రభావం కారణంగా వ్యక్తి ఆత్మవిశ్వాసముతో పరిపూర్ణత కలిగి ఉంటాడు. ఈ జాతకుడు తన వ్యక్తిత్వ తీరు వల్ల సమాజంలో గౌరవమర్యాదలు, ప్రతిష్టలను పొందుతాడు. లగ్నంలో కూర్చొని ఉన్న శని తృతీయ భావంలో మేషరాశి, సప్తమంలో సింహరాశి, దశమంలో వృశ్చిక రాశిని చూస్తున్నాడు. శని యొక్క దృష్టి కారణంగా సోదరులతో అపేక్షిత సహ్యోగములో సమస్యలు ఏర్పడతాయి. ఇక జీవిత భాగస్వామితో సమస్యలు తప్పకపోవచ్చు.

***రాహువు*** : ప్రథమ భావంలో అష్టమ గ్రహం రాహువు యొక్క ఉపస్థితి కారణంగా అనారోగ్యం ఏర్పడే అవకాశాలున్నాయి. రాహువు యొక్క దశా కాలంలో ఉదర సంబంద రోగాలు కలిగే అవకాశాలున్నాయి. వర్తక వ్యాపారాలలో సమస్యలను ఎదుర్కొవలసి రావచ్చు. వీరికి వ్యవసాయంపై కోరిక ఉన్నప్పటికీ ఉద్యోగం ఫలదాయకంగా ఉంటుంది. లగ్నస్థ రాహువు సప్తమ భావంలో సూర్యుని రాశి సింహాన్ని చూస్తున్నాడు. శత్రు రాశిపై రాహువు యొక్క దృష్టి వైవాహిక జీవిత సుఖాన్ని బలహీన పర్చును. భాగస్వాముల నుంచి ఈ జాతకులకు లాభం కలిగే అవకాశాలు తక్కువ. రహస్యాలు, గుప్త విద్యల అంటే ఈ జాతకులకు మక్కువ. ఆత్మవిశ్వాసం తక్కువగా ఉంటుంది. దీంతో నిర్ణయాలు తీసుకొవడంలో సమస్యలు ఎదుర్కొంటారు.

***కేతువు*** : కేతువు కుంభ లగ్నం గల కుండలిలో లగ్నస్థంగా ఉండి వ్యక్తిని అస్థిరునిగా చేస్తున్నాడు. విపరీత లింగపు వ్యక్తిపై వీరికి అభిరుచి అధికం. వీరు తల్లిదండ్రులతో వివాదాలు, మనస్థాపాలు కలిగే అవకాశములున్నాయి. సప్తమ భావంపై కేతువు యొక్క దృష్టి ఉండటం వల్ల గృహస్థ సుఖంలో లోపం ఏర్పడుతుంది. వ్యక్తికి అన్య వ్యక్తితో సంబంధాల కారణంగా కుటుంబములో అశాంతి ఏర్పడుతుంది. కేతువుతో పాటు శుభ గ్రహాల యుతి లేదా దృష్టి సంబంధాలు ఉంటే గన క కేతువు యొక్క అశుభ ప్రభావం తగ్గుతుంది.

## మీన లగ్నము - ఫలితాలు

మీన లగ్నానికి అధిపతి గురువు. మీన లగ్నానికి చంద్రుడు, కుజుడు, గురువు కారక గ్రహాలు. ఈ కారణం వల్ల మంచి ఫలితాలు ఉంటాయి. శుక్రుడు, సూర్యుడు, శని అకారక గ్రహాలు. అశుభ ఫలితాలు ఇస్తారు. మీన లగ్నంలో ర్యాది గ్రహాలు ఉన్నప్పుడు కలుగే ఫలితాలు ఎలా ఉంటాయో పరిశీలిద్దాము.

***సూర్యుడు*** : సూర్యుడు మీన లగ్న కుండలిలో షష్టమాధిపతిగా ఉండును. షష్టమ భావంలో ఉండడం వల్ల సూర్యుడు అకారక గ్రహంగా ఉండును. మీన లగ్నంలో లగ్నస్థంగా ఉండి సూర్యుడు వ్యక్తిని ఆరోగ్యంగా ఉంచును. ఎవరి కుండలిలో అయితే ఈ స్థితి ఉండునో వారు ఆత్మవిశ్వాసంతో ఉండగలరు. ఏ పనినైనాను పూర్తి మనోబలంతో పూర్తి చేయుదురు. శత్రువులు, విరోదుల నుంచి భయపడరు. సూర్యుని పూర్ణ దృష్టి సప్తమ భావములో కన్యా రాశిపై ఉండును. వ్యాపారం చేయలననే కోరికతో పాటు, ఉద్యోగంలో అనుకూలత ఉంటుంది. వైవాహిక జీవితంలో జీవిత భాగస్వామితో ఒడిదుడుకులు తప్పవు.

***చంద్రుడు*** : మీన లగ్న కుండలిలో చంద్రుడు పంచమాధిపతి అవుతాడు. ఈ లగ్నంలో త్రికోణాధిపతిగా ఉండటం వల్ల చంద్రుడు శుభ కారక గ్రహంగా ఉండును. లగ్నంలో దీని స్థితి వ్యక్తికి సుఖంగా, శుభకరంగాను ఉండును. చంద్రుని ప్రభావం వల్ల వ్యక్తి అందం, ఆకర్షణీయమునకు అధిపతి కాగలడు. వీరి మాటలు ఇతరులపై ప్రభావం చూపును. వీరిలో ఆత్మవిశ్వాసం మెండుగా ఉండును. అందుకే ఎలాంటి పెద్ద కార్యమును మొదలు పెట్టడానికి భయపడరు. మాతృ పక్షం నుంచి, మాతృమూర్తి నుంచి సుఖాన్ని, ఆదరాభినమాల్ని పొందగలరు. చంద్రుడు పూర్ణ దృష్టి ద్వారా బుధుని రాశి కన్యను చూస్తున్నాడు. ఈ ప్రభావం వల్ల జీవితభాగస్వామి, సంతానం నుంచి ప్రశాంతత, సుఖం లభిస్తుంది.

***కుజుడు*** : కుజుడు మీన లగ్నం గల కుండలిలో ద్వితీయ, నవమ భావము యొక్క అధిపతిగా ఉండును. లగ్నంలో దీని ఉపస్థితి కారణంగా వ్యక్తి శక్తిశాలి, పరాక్రమిగా ఉండును. ఇది వ్యక్తిని మొరటి వాడిగా చేయును. అధ్యాత్మికమంటే మీరికి ఆసక్తి ఉంటుంది. తోటి వారికి సహాయం చేసేందుకు వీరు ఎల్లవేళల సిద్ధంగా ఉందురు. ఆర్థిక స్థితికి అడ్డంకులు ఉండవు. ఇక ధనాన్ని అనవసరంగా ఖర్చు చేయరు. వీరికి దృష్టి దోషం, కర్ణ దోషం కలిగే అవకాశాలు ఉన్నవి. ప్రథమ భావ స్థితిలో ఉన్న కుజుడు చతుర్ధ, సప్తమ, అష్టమ భావములను తన దృష్టితో ప్రభావితం చేస్తున్నాడు. ఈ ప్రభావం వల్ల మిత్రులు, భాగస్వాముల వల్ల లాభం కలుగుతుంది.

***బుధుడు*** : బుధుడు మీన లగ్న కుండలిలో చతుర్ధ, సప్తమ భావం యొక్క అధిపతిగా ఉండడం వల్ల క్రోదాధిపతి దోషం కారణంగా దూషించబడును. లగ్నంలో బుధుని ఉపస్థితి కారణంగా వ్యక్తి పరిశ్రమి కాగలడు. వారి పరిశ్రమ, బుద్ధి బలం వల్ల ధనార్జన చేస్తారు. పితృ సంపత్తి నుంచి వీరికి విశేష

లాభాలు కలుగుతాయి. మహిళల వల్ల వీరికి లాభాలు, సమ్యోగము లభిస్తాయి. లగ్నంలో కూర్చొని ఉన్న బుధుడు సప్తమ భావంలో స్వరాశిని చూస్తున్నాడు. దీని ప్రభావం వల్ల వర్తక వ్యాపారాలలో మిత్రుల, భాగస్వాముల నుంచి సమ్యోగం లభిస్తుంది. గృహస్థ జీవితం సుఖమయంగా ఉంటుంది. అనుకూలమైన జీవితభాగస్వామి లభించే అవకాశం.

***గురువు*** : గురువు మీన లగ్నము యొక్క కుండలిలో లగ్నాదిపతి, దశమాధిపతిగా ఉండును. లగ్నాధిపతిగా ఉండటం వల్ల రెండు కేంద్ర భావాలకు అధిపతిగా ఉన్నప్పటికి కేంద్రాధిపతి దోషం కలుగుతుంది. లగ్నంలో దీని ఉపస్థితి కారణంగా

వ్యక్తి అత్యంత భాగ్యశాలిగా ఉండును. శారీరకంగా అరోగ్యంగా, అందంగా ఉండును. ఈ జాతకులు దయా స్వభావం, వినమ్రత కలిగి ఉంటారు. లగ్నస్థ గురువు తన యొక్క పూర్ణ దృష్టితో పంచమ, సప్తమ, నవమ భావాలను చూస్తున్నాడు. దీని ప్రభావం వల్ల తండ్రి, సంతానం నుంచి సుఖం లభిస్తుంది. గృహస్థ జీవితం సుఖమయంగా ఉంటుంది.

***శుక్రుడు*** : శుక్రుడు మీన లగ్నకుండలిలో తృతీయ, అష్టమ భావం యొక్క అధిపతి కాగలడు. ఈ లగ్నం యొక్క కుండలిలో ఇది అకారకంగా ఉండును. ఈ లగ్నంలో శుక్రుడు ప్రథమ భావంలో ఉండటం వల్ల వ్యక్తి అందంగా, ఆకర్షణీయంగాను ఉండును. వీరికి పిత్తవాత రోగం కలుగు అవకాశాలు ఉండును. వీరి పనిలో వీరు నిపుణత కలిగి ఉంటారు. వీరు సాహసం, పరాక్రమం కలిగిన వారై ఉంటారు. వీరు ఏ విషయంనైనా చాలా లోతుగా తెలుసుకొనుటకు ఆసక్తి కలిగిన వారై ఉండును. తల్లి నుంచి సుఖం, సహ్యోగానికి అవకాశాలు తక్కువ. సంతానం యొక్క సందర్భంలో కష్టాలు ఎదుర వుతాయి. సప్తమ భావంలో శుక్రుని పూర్ణ దృష్టి ఉండటం వల్ల గృహస్థ జీవితం సామాన్యంగా సుఖమయంగా ఉండును.

***శని*** : శని మీన లగ్న కుండలిలో ఏకాదశాధిపతి, ద్వాదశాధిపతిగా ఉండును. లగ్న భావంలో శని యొక్క ఉపస్థితి కారణంగా వ్యక్తి సన్నగా ఉంటాడు. శని యొక్క ప్రభావం వల్ల వ్యక్తి నేత్ర సంబంధ వ్యాధుల వారిన పడవచ్చు. వీరికి సొంత నిర్ణయాలు తీసుకొవడం సాధ్యం కాకపోవచ్చు. జీవితంలో ప్రగతి కొసం ఇతరుల సలహాలను పాటించాల్సి వస్తుంది. ధన సేకరణ యొక్క ప్రవృత్తి ఉంటుంది. షేయర్, పందాలు, లాటరీల వలన ఈ జాతకులకు అకస్మాత్తు లాభాలు కలిగే అవకాశం. లగ్నస్థ శని తృతీయ భావంలో వృశ్చిక రాశిని, సప్తమ భావంలో కన్యా రాశిని, దశమ భావంలో గురుని రాశి ధను చూస్తుండును. ఈ భావాలో శని యొక్క దృష్టి ఉన్న ఎడల మిత్రుల నుంచి అపేక్షిత లాభం, సహ్యోగం లభించదు. ఇక భాగస్వాముల నుంచి హాని ఏర్పడే అవకాశం. దాంపత్య జీవితంలో సమస్యలు ఏర్పడే అవకాశం ఉంటుంది.

***రాహువు*** : రాహువు మీన లగ్న కుండలిలో లగ్నస్థంగా ఉండటం వల్ల ఈ జాతకుడు కండలు తిరిగిన బలశాలి అయి ఉండును. రాహువు వీరికి చతురతను, బుద్దిని ప్రసాధించును. వీరిలో స్వార్ధ భావన ఉంటుంది. అనుకున్న కార్యాలను సాధించుటకు, వీరు ఎవరితోనైనా మిత్రుత్వంను చేస్తారు. పనిని ఎలా పూర్తి చేసుకొనవలనో వీరికి బాగా తెలుసు. వీరిలో సహసం అధికంగా ఉండును. లగ్నస్థ రాహువు సప్తమ భావంలో స్థితిలో ఉన్న బుధుని కన్యా రాశిని చూస్తున్నాడు. దీని ప్రభావం వల్ల సంతానం యొక్క సందర్బంలో సమస్యలు వచ్చే అవకాశాలు ఉన్నాయి. జీవితభాగస్వామి అరోగ్య సంబంధ మైన సమస్యలతో బాధించబడును. గృహస్థ జీవితంలో సమస్యలు తప్పకపోవచ్చు.

***కేతువు*** : కేతువు మీన లగ్న కుండలిలో లగ్నస్థంగా ఉండటం వల్ల వ్యక్తి అరోగ్య సమస్యలు ఎదుర్కొంటారు. నడుము నొప్పి, వాత వ్యాధులు కలిగే అవకాశం ఉన్నాయి. ఆత్మవిశ్వాసం తక్కువగా ఉండటం మూలంగా సొంత నిర్ణయాలు తీసుకోలేరు. వ్యాపారం చేయాలనే కోరిక, ఉద్యోగం చేయుట వీరికి ఇష్టంగా ఉండును. స్వార్ధ సిద్ధి కొరకు సామాజిక నియమాలను ఉల్లంఘించుటకు కూడా వీరు వెనుకాడరు. సప్తమ భావంలో కేతువు యొక్క దృష్టి జీవిత బాగస్వామికి కష్టకారిగా ఉండును. కేతువు వీరిని వివాహేతర సంబంధాలకు ప్రేరేపితం చేయును. ఫలితంగా గృహస్థ జీవితంలోని సుఖం బాధించబడును. ఆర్ధిక పరిస్థితి సామాన్యంగా ఉంటుంది.

## *గ్రహములు శుభ అశుభ ఫలములు*

***రవి మహాదశ* :** జాతకచక్రంలో రవి సూర్యుడు బలవంతుడై ఉన్నప్పుడు సుఖము, ధన లాభము, రజ సన్మానము, కుటుంబ సంతోషములను, కలుగజెయొఉను. బలహీనుడై ఉన్నపుడు శత్రువుల భాద, అగ్నిచొర భయము, గుండె జబ్బులు, ఉదార భాదలు, కుటుంబ పరస్తుల నివాసము కలుగచేయును.

***చంద్ర మహదశ* :** చంద్రుడు బలవంతుడై వున్నప్పుడు శుభకార్యసిద్ధి, ద్రవ్యలాభము, వాహన ప్రాప్తి, శుభభవన సదుపాయము కలిగించును. బలహీనుడై ఉన్నచొ రాజ వీరొధము, ధెహయమాత్రు వంశీయులకు హాని, సుఖబంగము.

***కుజ మూదశ* :** కుజుదుశుభస్థితిలొ ఉన్నప్పుడు జయప్రాప్థి, ధనలాభము, ఉద్యోగ లాభము, ఆనందము, సకల కార్యసిద్ధి కలుగచేయును. అశుభ స్టితి లో ఉన్నచో బందుమిత్రుల విరోధము, కోపతాపములు, వ్యసనములు అనారోగ్యము కలిగిచును .

***బుధ మహదశ* :** బుధుడు బలవతుడై ఉన్నచో బందు మిత్రులతో శుభ గోష్టి, ధన లాభము వృద్ధి, శుభ కార్యక్రమములు, ఆనదము కలుగ జేయును. చెడ్డ బావములో వున్న మనో వ్యాధి, కార్య విఘ్నములు, ధన కఠినత కలిగించును.

***గురు మహదశ* :** గురుడు బలీయంగా ఉన్నచో బుద్ధి వికాసం, సంతాన లాభం, గృహ లాభం, కుటుంబ సుఖము, శత్రు జయము కలుగును. నీచస్థితి కలిగి ఉన్నచో బంధనము, గృహ విపత్తు, జీవహింస, గౌరవ భంగము కలుగును.

***శుక్ర మహదశ* :** శుక్రుడు బలియముగా వున్న గృహ లాభము, కార్య సిద్ధి, ధన ప్రాప్తి, శుఖ జీవనం, స్త్రీ సంగమం కలిగించును. నిచ స్తితి పొందిన కుటుబ కలహములు, భయ భర్తల మద్య విభేదాలు, అసుఖమును కలిగించును.

***శని మహదశ* :** శని బలవతుడై ఉన్న గృహ బలము, ధన లాభము, కుటుంబ సామీప్యత, వృత్తి వ్యాపారములలో లాభము, ఉద్యోగ ప్రాప్తిని కలిగించును. బలహీనుడై ఉన్న ఖర్చులు పెరుగుట, అసంతృప్తి, బందు మిత్రులతో విరోధములు కలుగును.

***రాహు మహదశ* :** రాహూవుబలముగా ఉన్నప్పుడు సర్వసౌఖ్యం, ఆదాయ ప్రోత్సాహము, వాహన లాభము, పుత్రలాభము, మహా సన్మానములు, స్వస్థత కలుగచేయును. దుష్ట స్థానంలో ఉన్న గృహ కలహాలు, స్టాన బ్రంశం, మనోవాతుల్యత, అనారొగ్యత కలుగచేయును.

***కేతు మహదశ* :** కేతువు సుభుడై ఉన్న వాహన సౌఖ్యము, పుత్ర మిత్ర కళత్రములతో శుభ గోష్టి, నష్ట పోయిన ద్రవ్యములను వస్తువులను తిరిగి పొందుట జరుగును. నిచ స్థితిని పొందిన శరీర జాడ్యము, మనస్పర్థలు, ధన నష్టము, అసౌఖ్యము కలిగించును.

## జాతక చక్రంలో 2,4,5,9 స్థానాలు

జాతక చక్రంలో 2,4,5,9 స్థానాలు పరిశీలించడం ద్వారా ఆవ్యక్తి విద్య ఎలా ఉంటుంది అనేది తెలుసుకోవచ్చు. ద్వితీయ భావం ద్వారా బాల్యంలోని విద్య ఎలా ఉంది అనేది తెలుసుకోవచ్చు. నాల్గవ స్థానం ద్వారా ఆవ్యక్తి భావ సామర్థ్యాన్ని - ఐదవ స్థానం ద్వారా హైస్కూల్, ఇంటర్, డిగ్రీ విద్య ఎలా ఉంది అనేది - తొమ్మిదవ భావం ద్వారా డిగ్రీ తరువాతి విద్య (PG, PHD etc.) గురించి తెలుసుకోవచ్చు.

ఇక బుధ, గురు గ్రహాలు విద్యకు కారకత్వం వహిస్తాయి. బుధుడు విద్యలో సామర్థ్యాన్ని, జ్ఞాపకశక్తిని తెలియజేస్తే, గురుడు అవకాశాన్ని అదృష్టాన్ని కలుగజేస్తాడు. ఈ రెండు గ్రహాలు ఉన్న స్థానాన్ని బట్టి ఆవ్యక్తి యొక్క విద్య ఎలా ఉంటుంది అనేది కూడా గ్రహించ వచ్చు. మనసుయొక్క శక్తిని సూచించే చంద్రుడు కూడా మంచి స్థానాలలో ఉన్నాడా లేదా అన్నది కూడా గ్రహించాలి.

పంచమం, దానిమీద ఉన్న గ్రహాల ప్రభావాన్ని బట్టి వారి విద్య ఏరంగంలో ఉంటుంది అన్నదాన్ని కూడా మనం తెలుసుకోవచ్చు.

**ఇంజనీరింగ్ :** కుజ –శని (రాహు సంబంధం చేత ఎలక్ట్రానిక్స్, ఎలక్ట్రికల్స్), మేష, వృశ్చిక, మకరం, మీనం

వైద్య సంబంధ విద్య : రవి - చంద్ర – కుజ - బుధ , కర్కాటకం, కన్య, 6th , 10th స్థానాలు వైద్యవిద్యకు సంబంధించినవి.

**మేనేజ్ మెంట్ విద్య :** గురు (ధనం) – బుధ (లెక్కలలో సామర్థ్యం), మిథున, కన్య, తుల.

**ఆర్ట్స్ మరియు ఫ్యాషన్ డిజైనింగ్ :** శుక్ర, బుధ, రాహు, చంద్ర వృషభం, మిథున, కర్కాటకం, కన్య, మీనం

**బాల్య విద్య:** ముందుగా చర్చించుకోవలసినది విద్యలేకపోవడం గురించి. నిజానికి విద్య లేకపోవడం అనేది ఉండదు. ప్రతి వ్యక్తీ ఏదోవిధంగా విద్యను పొందుతూనే ఉంటాడు. ఒక క్రమ పద్ధతిలో పాఠశాలకు వెళ్లి చదువుకుని విద్యపొందలేక పోవడాన్ని మనం జాతకచక్ర పరిశీలన ద్వారా గుర్తించ వచ్చు. రాహు, కుజ, శని ఈ మూడ గ్రహాలు లేదా రెండు గ్రహాలు కనుక ద్వితీయ భావంలో పడితే ఆవ్యక్తికి అందరిలా స్కూలుకు వెళ్లి చదువుకునే విద్య ఉండదు. వీరి పూర్తిగా విద్య ఉండదా అంటే ఉంటుంది. కానీ చదువు పూర్తి చెయ్యడానికి చాలా కష్టపడవలసి ఉంటుంది. వీరికి ఒక పద్ధతి ప్రకారం రోజు స్కూలుకు వెళ్లి చదవడం ఇష్టం ఉండదు. మొండిగా ఉండడం, అబద్ధాలు ఆడడం మొదలైనవి ఉంటాయి.

**కళాశాల స్థాయి విద్య :** 10th, Inter, Degree విద్యలను సూచించేది ఐదవ స్థానం. కుజుడు ద్వితీయంలో ఉంటే తననాల్గ వ దృష్టి ద్వారా పంచమ భావాన్ని చూస్తూ ఆవ్యక్తి స్కూలు విద్యసేకాక కళాశాల విద్యను కూడా క్రమంతప్పేటట్టు చేస్తాడు. శని తృతీయ, అష్టమ, ఏకాదశాలలో ఉంటే పంచమాన్ని చూస్తాడు కనుక విద్యలో ఆలస్యాన్ని సూచిస్తాడు. అంటే వారు టీనేజ్ లో చదవవలసిన కళాశాల విద్యను ముప్పైలు, నలభైలలో చెయ్యవచ్చు. రాహువు కంప్యూటర్ విద్యను సూచిస్తాడు. రాహువు ప్రభావం పంచమంపై ఉంటె కనుక కంప్యూటర్ విద్యను అభ్యసిస్తారు.

**ఉన్నత విద్య :** P.G. – P.H.D. స్థాయి విద్యలను సూచించేది తొమ్మిదవ భావం. నవమ భావాధిపతి శుభస్థానాలలో ఉన్నా, నవమభావం పై శుభులైన బుధ, గురుల ప్రభావం ఉన్నా ఉన్నత విద్యను ఏఆటంకాలు లేకుండా పూర్తిచేయగలుగుతారు. అలాకాక నవమాధిపతి తృతీయ, అష్టమ, వ్యయాల పడితే స్వస్థానంలో ఆవిద్య పూర్తిచేయడం కష్టమే. కానీ దూరప్రాంతాలలో లేదా విదేశాలలో చదివే యోగం ఉండవచ్చు.

పాప గ్రహాలు ఈ విద్యాస్థానాలలో ఉన్నప్పటికీ శుభుడైన గురువు కనుక లగ్నంలో ఉంటే ఎన్ని ప్రతిబంధకాలు వచ్చినా విద్యను పూర్తిచేసే శక్తిని ఇస్తాడు. గురుడు 5,9తొమ్మిది స్థానాలలో ఉన్నా కూడా విద్యపై మంచి పట్టుని ఇస్తాడు. గురుడు కోణదృష్టి కలిగిన వాడుకనుక 1,5,9 స్థానాలలో ఎక్కడ ఉన్నాకూడా మిగతా రెండిటినీ కూడా తన విశేష దృష్టితో వీక్షిస్తాడు.

విద్యను గురించి చతుర్వింశాంశ (D-24 ) చక్రాన్ని పరిశీలించాలి. కానీ ఈ చక్రం ప్రతీ 5 నిమిషాలకు మారిపోతుంది కనుక ఖచ్చితమైన జన్మసమయం తెలియకపోతే ఈచార్ట్ చూడవద్దు.

విద్య అనేది అనేకవిధాలుగా ఉంటుంది. మూసపద్ధతిలో చదివిన విద్య కంటే కష్టనష్టాలు దాటుకుంటూ చదువు పూర్తిచేసిన వారు ఎందరో మనకు స్ఫూర్తిప్రదాతలుగా ఉన్నారు. ఐనస్టీన్, రమణమహర్షి, రామక్రిష్ణపరమహంస, స్వామి వివేకానంద వీళ్ళందరూ ఏమిచదివారు? ఎలా చదివారు? కనుక చదవాలి, నేర్చుకోవాలి అనే ఆసక్తి తాపత్రయం ఉంటే జ్యోతిష్యశాస్త్రాన్ని ఆధారంగా చేసుకుని, ఏవైనా లోపాలు ఉంటే తగిన పరిష్కారాలు చేయడం ద్వారా మీయొక్క, మీ పిల్లలయొక్క విద్యను సరిచేసుకోవచ్చు. మొద్దులను కూడా విజేతలుగా తయారుచేయవచ్చు.

# నవగ్రహ స్థానాలు వాటి ఫలితాలు

గోచారరీత్యా నవగ్రహ ఏఏ స్థానాల్లో ఉంటే ఏఏ ఫలితములు అన్నది తెలుసుకుందాము......

**(1) రవి:-** జన్మ రాశి నుండి రవి 3,6,10,11 స్థానము లందు వున్న శుభ ఫలములను ఇచ్చును. 1,2,5,7,9 స్థానములందు వున్న అశుభ ఫలితములు ఇచ్చును. 4,8,12 స్థానములందు వున్న పాపియై చాలా కీడు చేయును.

**(2) చంద్రుడు:-** జన్మ రాశి నుండి చంద్రుడు 1,2,3,5,6,7,9,10,11 స్థానములందున్న శుభఫలముల నిచ్చును. 4,8,12 స్థానములందున్న పాపియై అశుభ ఫలితములిచ్చును.

**(3) కుజుడు:-** జన్మ రాశి నుండి 3,6,10,11 స్థానములందున్న మంచి శుభ ఫలితములు ఇచ్చును. 1,2,5,7,9 స్థానములందున్న అశుభ ఫలితములు కలుగును. 4,8,12 స్థానములందున్న పాపియై కీడు ఎక్కవగా చేయును.

**(4) బుధుడు:-** జన్మ రాశి నుండి ఈ బుధుడు 2,6,10,11 స్థానములందున్న శుభ ఫలితములను ఇచ్చును. 1,3,5,7,9 స్థానములందున్న అశుభ ఫలితములను నిచ్చువాడగును. 4,8,12 స్థానములందున్న పాపియై జాతకునకు అనేక కీడు చేయువాడగును.

**(5) గురుడు:-** జన్మ రాశి నుండి ఈ గురుడు 2,5,7,9,11 స్థానములందున్న శుభ ఫలితములనిచ్చు వాడగును. 1,3,6,10 స్థానములందున్న అశుభ ఫలితములు కలుగును. 4,8,12 స్థానములందున్న పాపియై జాతకునకు కీడు చేయువాడగుచున్నాడు.

**(6) శుక్రుడు:-** జన్మ రాశి నుండి శుక్రుడు1,2,3,9,11 స్థానములందున్న మంచి శుభ ఫలితముల నిచ్చును. 5,6,7,10 స్థానములందున్న అశుభ ఫలితములను నిచ్చును. 4,8,12 స్థానములందున్న కీడును చేయును.

**(7) శని:-** ఈ శని జన్మరాశి లగాయతు 3,6,10,11 స్థానములందున్న శుభ ఫలితములనిచ్చును. 1,2,5,7,9 స్థానములందున్న అశుభ ఫలితములనిచ్చును. 4,8,12 స్థానములందున్న మిక్కిలి పాపియై కీడు చేయువాడగుచున్నాడు.

**(8) రాహువు:-** ఈ రాహువు జన్మ రాశి నుండి 3,6,10,11 స్థానములందున్న శుభ ఫలితముల నిచ్చును. 1,2,5,7,9 స్థానములందున్న అశుభ ఫలితములనిచ్చును. 4,8,12 స్థానములందున్న పాపియై కీడు చేయును.

**(9) కేతువు:-** జన్మ రాశి నుండి ఈ కేతువు 3,6,10,11 స్థానములందున్న శుభ ఫలితములు ఇచ్చును. 1,2,5,7,9 స్థానములందుండిన అశుభ ఫలితములు ఇచ్చును. 4,8,12 స్థానములందు వుండిన పాపియై కీడు చేయువాడగును.

(ఇందులో ప్రతి గ్రహము 4,8,12 స్థానములందు వున్నచో చాలా ఎక్కువగా అశుభ ఫలితములు అనేక కష్ట నష్టములు దేహ అనారోగ్యములు మొదలగునవి కలుగ గలవు)

## విశాఖ నక్షత్రము - గుణగణాలు

విశాఖ గురుగ్రహ నక్షత్రము, రాక్షస గణము, అధిదేవతలు, ఇంద్రుడు, అగ్ని, జంతువు పులి, రాశ్యధిపతి కుజుడు. గురుదశతో జీవితము ప్రారంభం ఔతుంది కనుక బాల్యము సుఖముగా జరుగుతుంది. తల్లి తండ్రులు కుటుంబ సభ్యుల మధ్య గారాబంగా జీవితము మొదలైతుంది. వీరికి మొండితనము ఎక్కువ. అనుకున్నది అమలు చెస్తారు. విరికి సలహాలు చెప్పి మార్చాలని అనుకోవడము వ్యర్ధము. వీరికి సహాయము చేసిన వారికి కూడా వీరు సహకరించడానికి మనస్కరించదు. వారు చేసిన సహాయాన్ని భూతద్దములో చూపిస్తారు. అనర్హులైన వారికి సంపూర్ణ సహకారాలు అందిస్తారు అయినా వారి వలన ముప్పు కూడా పొంచి ఉంటుంది. భార్య లెక స్త్రీ సహాయము లేనిదే వీరు రాణించ లేరు. వైద్య, వ్యాపార, సాంకేతిక రంగాలలో, అర్ధికపరమైన వ్యాపారాలలో పట్టు సాధిస్తారు. రాజకియ ప్రవేశము చెస్తే ఉన్నత పదవులు వస్తాయి. మంచి సలహాదారుల వలన ప్రయోజనాలు ఉంటాయి. వంశాపారంపర్య ఆస్థులు సంక్రమిస్థాయి. స్వంతగా అంతకంటే అధికమైన ఆస్తులు సంపాదిస్తారు. సంతానము వలన ఖ్యాతి లభిస్తుంది. ఆధ్యాత్మిక రంగము వారి వలన మోసానికి గురిఔతారు. అన్యభాషలు నేర్చుకుంటారు. సాంకేతిక రంగం ఆధారముగా ఇతర రంగాలలో ప్రవేశించి ఆ రంగములో విజయము సాధించి ప్రముఖ్యత సాధిస్తారు. చదివిన చదువుకు చెసె ఉద్యోగానికి సమ్భంధము ఉండదు. ఉద్యోగములో బదిలీలు పొంచి ఉంటాయి. అవినీతి ఆరోపణలకు ఆస్కారము ఉంది. రాజకీయ నాయకులతో జాగ్రత్తగా వ్యవహరించాలి.వారి వలన నష్టము ప్రయోజనము సమముగా ఉంటాయి. కఠినమైన మనస్తత్వము ఉంటుంది. విదేశీపౌరసత్వము లభిస్తుంది. జీవితములో కనీస అవసరాలను తీర్చుకుంటారు. కుటుంబసభ్యుల మీద తప్ప ఇతరుల మీద ప్రేమాభిమానాలు తక్కువ. భయము, పొదుపు, జాగ్రత్త, విజ్ఞానము జివితములో సమపాళ్ళలో ఉంటాయి. ఏభై సంవత్సరాల అనంతరము జీవితము సుఖవంతముగా జరుగుతుంది కనుక వృద్ధాప్యము సుఖవంతముగా జరుగుతుంది.

నక్షత్రములలో ఇది 16వ నక్షత్రం. ఇందు 3 పాదములు తులారాశిలోను 4 వ పాదము వృశిక రాశిలోను ఉండును

**విశాఖనక్షత్రము నవాంశ**

1 వ పాదము - మేషరాశి. 2 వ పాదము - వృషభకరాశి. 3 వ పాదము – మిధునరాశి 4 వ పాదము - కర్కాటకరాశి.

**విశాఖా నక్షత్ర వృక్షము**

విశాఖా నక్షత్ర జంతువు. పులి, విశాఖా నక్షత్ర జాతి స్త్రీ, విశాఖా నక్షత్ర పక్షి గరుడుడు, విశాఖ నక్షత్ర అధిపతి గురుడు, విశాఖా నక్షత్ర అధిదేవత. ఇంద్రుడు అగ్ని, విశాఖా నక్షత్ర గణము రాక్షస గణము రాక్షసరాజు రావణుడు,

**విశాఖ నక్షత్రము ప్రాశస్త్యము :** గర్భాధానము, నూతన వస్త్రధారణ, నృత్యము, గీతము, చిత్రలేఖనము, వాహనారోహణ, వాణిజ్యంలకు ప్రశస్తము. క్షురకర్మలకు మధ్యమము.

## జ్యేష్ఠ. నక్షత్రం.  జ్యేష్టానక్షత్రము గుణగణాలు

జ్యేష్టా నక్షత్రమునకు అధిపతి బుధుడు. ఇది రాక్షసగణ నక్షత్రము, అధిదేవత ఇంద్రుడు, జంతువు జింక. ఈ నక్షత్ర జాతకులు తమ రహస్యాలు కాపాడుకోవడానికి ఇతరుల రహస్యాలు తెలుసుకోవడనికి ప్రయత్నిస్తారు. ఇతరులలో చిన్న విషయాలను కూడా పరిశీలించి లోపాలను ఎత్తి చూపుతారు. తగాదాలు పెట్టడమే ధ్యేయంగా ఉన్న వారిలా పేరు తెచ్చుకుంటారు. తమకు శక్తి లేకున్నా అనుకున్న కార్యం సాధించడనికి ప్రయత్నిస్తారు. ఇతరుల సహాయాన్ని తమ హక్కులుగా వాడుకుంటారు. విమర్శలు సహించ లేరు. ఆత్మన్యూన్యతా భావం కలిగి ఉంటారు. ఎదుటి వారు సరదాగా చేసే వ్యాఖ్యలు తమను అపహాస్యం చేయడానికే చేసారని భావిస్తారు. మిత్రభేదం కలిగించి, తప్పుడు సలహాలు ఇచ్చి ఇతరులను అపఖ్యాతి పాలు చేయడంలో అందెవేసిన చేయిగా పేరు తెచ్చుకుంటారు. నమ్మిన స్నేహితులు కూడా వీరిని అలాగే మోసం చెస్తారు. వీరికి నచ్చని వారి మీద తీవ్రమైన ద్వేషం పెంచుకుంటారు. విశేషమైన దైవభక్తి ఉంటుంది. తమవరకు వచ్చే వరకు వీరికి సమస్యలు కూడా సౌందర్యంగానే కనిపిస్తాయి. భాషలకు భాష్యం వ్రాయగలిగిన పాండిత్యం కలిగి ఉంటారు. సామాజిక కార్యక్రమాలలో ముందు ఉంటారు. సౌకర్యవంతమైన ఉద్యోగం, అన్యోన్య దాంపత్యం వీరికి సుఖంను కలిగిఉస్తుంది. సంతానం నష్టంము కావచ్చు. అయినా సంతాన ప్రాప్తికి వంశాభివృద్ధికి లోపం ఉండదు. అన్నమాట, ఇచ్చిన వాగ్దానం నిలబెట్టుకోలేరు. సందర్భానుసారంగా అభిప్రాయాలు మార్చుకుంటారు. శాశ్వత మిత్రత్వం, శాశ్వత స్నేహం ఉండదు. సాంకేతిక రంగంలో ప్రత్యేక విభాగంలో నిపుణత ఉంటుంది. విదేశాల మిద మోజు, విహారయాత్రల మీద ఆసక్తి ఉంటుంది. వ్యసనాలకు దూరంగా ఉంటే జీవితం సాఫిగా సాగుతుంది. బాల్యం నుండి విద్యలో ప్రకాశిస్తారు. కాని ఉన్నత విద్యలకు కొంత ఆటంకం కలిగినా అడ్డంకులను అధిగమిస్తే అభివృద్ధి సాధించ గలరు. తగిన వయసులో సంపాదన మొదలౌతుంది. సంపాదించిన ధనంను భవిష్యత్తుకు జాగ్రత్త పరచుకోవాలసిన అవసరం ఎంతైనా ఉంది. వృద్ధాప్యంలో కొన్ని సమస్యలను ఎదుర్కొంటారు. ఇవి ఈ నక్షత్ర జాతకులు అందరికీ జరిగే సాధారణ ఫలితాలు మాత్రమే. జాతక చక్రంలో గ్రహస్థితులను అనుసరించి ఫలితాలలో మార్పులు ఉంటాయి.

నక్షత్రములలో ఇది 18వ నక్షత్రము.  ఇది వృశిక రాశిలోనిది

జ్యేష్టానక్షత్రము నవాంశ

1 వ పాదము - ధనసురాశి. 2 వ పాదము - మకరరాశి. 3 వ పాదము - కుంభరాశి. 4 వ పాదము - మీనరాశి.

జ్యేష్ట నక్షత్ర వృక్షము.  పొగడ

జ్యేష్ట నక్షత్ర జంతువు. జింక. లేడి

జ్యేష్ట నక్షత్ర జాతి స్త్రీ

జ్యేష్ట నక్షత్ర పక్షి కాకి.

జ్యేష్ట నక్షత్ర అధిపతి బుధుడు.

జ్యేష్ట నక్షత్ర అధిదేవత. రవి

జ్యేష్ట నక్షత్ర గణము రాక్షస గణము రాక్షసరాజు రావణుడు.

## పూర్వాషాఢ నక్షత్రము గుణగణాలు

పూర్వాషాఢ నక్షత్రముకు అధిపతి శుక్రుడు, అది దేవత గంగ, మనుష్య గణం , జంతువు వానరం, రాశి అధిపతి గురువు. వీరు విలాసమంతమైన జీవితాన్ని కోరుకుని సాధిస్తారు. స్త్రీలు జీవితంలో ఉన్నత స్థాయిని చవి చూసి తిరిగి దిగువ స్థాయికి చేరుకుంటారు. పూర్వీకుల ఆస్తులు హరించుకు పోయి కొంత భాగం మాత్రం మిగులుతుంది. చాకచక్యం, కొంటె తనం వీరి స్వంతం. బాల్యజీవితం సుఖవంతము. వివాహ జీవితం సాధారణం. పుట్టిన ప్రామ్తానికి దూరంగా రాణిస్తారు. నాయకత్వ లక్షణాలు ఉంటాయి. జీవితంలో అనుభవాలను చూసి పాఠాలు నేర్చుకుంటారు. స్నేహితుల సహాయ సహకారాలతో ఉన్నతస్థాయి సాధిస్తారు. స్నేహితులతో కలసి జీవితంలో విజయాలు సాధిస్తారు. విద్యా, వ్యాపార, రాజకీయ రంగాలలో ఖ్యాతి రాణింపు లభిస్తుంది. కొంత కాలం తరువాత వీరున్న రంగంలో వీరి స్నేహితులు ఉన్నతి సాధించి వీరిని దూరంగా ఉంచుతారు. వీరి ఓర్పుకు సహనానికి పరీక్షలు ఎదురౌతాయి. ఎక్కువ కాలం ఓర్పు వహించ లేరు. సమాజంలో గౌరవానికి బదులు భయం చోటు చేసుకుంటుంది. ఏ రంగంలోనైనా ఓటమిని అంగీకరించరు. సహోదరుల వలన అపఖ్యాతి లభిస్తుంది. నమ్మిన సేవకాజనం మోసం చెస్తారు. సహోదరీ వర్గం అన్ని విధాలా సహకరిస్తారు. ఆధ్యాత్మిక జీవితం మీద ఆసక్తి స్వామీజీల పతల సదభిప్రాయం ఉంటుంది. దైవభీతి ఉంటుంది. విదేశీయానం కలుగుతుంది. విదేశీ వ్యాపారము, వ్యవహారము లాభిస్తాయి. సంతానము మీద ఎవ్వరి నీడ పడకుండా కాపాడతారు. వ్యక్తిగతమైన వృత్తి సంబంధిత వ్యవహారాల నీడలు కుటుంబం మీద పడకుండా జాగ్రత్త వహిస్తారు. కుటుంబ జీవితానికి సామాజిక జీవితానికి మధ్య గోడను నిర్మించి జీవించడం మంచికి దారి తీస్తుంది.

నక్షత్రములలో ఇది 20వ నక్షత్రము.  ఇది ధనూరాశిలోనిది

పూర్వాషాఢ నక్షత్రము నవాంశ

1 వ పాదము _ సింహరాశి.

2 వ పాదము - కన్యారాశి.

3 వ పాదము - తులారాశి.

4 వ పాదము - వృశ్చికరాశి.

చిత్ర మాలిక

పూర్వాషాఢ నక్షత్ర వృక్షము. నెమ్మి

పూర్వాషాఢ నక్షత్ర జాతి స్త్రీ

పూర్వాషాఢ నక్షత్ర పక్షి నెమలి.

పూర్వాషాఢ నక్షత్ర అధిపతి శుక్రుడు.

పూర్వాషాఢ నక్షత్ర అధిదేవత గంగాదేవి.

పూర్వాషాఢ నక్షత్ర మానవగణము

## శ్రావణ నక్షత్రం -   నక్షత్ర జాతకుల గుణగణాలు

శ్రవణానక్షత్ర అధిపతి చంద్రుడు. అధిదేవత మహా విష్ణువు, గణము దేవగణము, రాశ్యాధిపతి శని, జంతువు వానరం. ఈ నక్షత్రజాతకులు మితభాషులు. కోపతాపాలు, మొండి వైఖరి, అల్లరితనం ఉన్నా వీరు ధర్మం తప్పక జీవితం సాగిస్తారు. వీరు చక్కని తీర్పులు చెప్పగలరు. వీరి అంతర్గత ఆలోచన, మేధస్సు ఎవరికి అర్ధం కాదు. ఓర్పు ఉంటుంది కాని దానికి హద్దులు ఉంటాయి. ఎవరికి ఎటువంటి మర్యాద ఇవ్వాలో ఎవరిని ఎక్కడ ఉంచాలో వీరిని చుసి నేర్చుకోవాలి. ఆభరణాలు, స్థిరాస్థులు, వస్తువులు స్థిరాస్థులుగా లభించిన దాని కంటే స్వార్జితము ఎక్కువగా ఉంటుంది. మనోధైర్యంతో సాహస నిర్ణయాలు తీసుకుంటారు. విజయం సాధించి అఖండమైన ఖ్యాతి గడిస్తారు. చనువుగా మాట్లాడే స్వభావం ఉన్నా ఎవరిని నెత్తికి ఎక్కించుకోరు. ఊహ తెలిసిన నాటి నుండి ధనానికి లోటు ఉండదు. అంచెలు అంచెలుగా పైకి వస్తారు. శత్రువర్గం అడుగడుగునా ఇబ్బందులు పెడుతుంది. ఒక వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తారు. బంధుప్రీతి ఎక్కువ. స్నేహితులకు గుప్తంగా సహకరిస్తారు. చదువు పట్ల శ్రద్ధ, సమాజములో ఉన్నత స్థితి, అవకాశాలను సద్వినియోగపరచుకొనుట, సందర్భాను సారము వ్యూహం చేయుట వీరి స్వంతం. అందరు వీరిని మొండి వాళ్ళు అని భావించినా విరికి విశాలహృదయం, సున్నిత మనస్తత్వం ఎవరికి అర్ధం కాదు. వ్యాపారంలో ముందుగా భాగస్వాముల వలన నష్టపోయినా తరువాత మంచి లాభాలు గడిస్తారు. వారసత్వ విషయాలు లాభిస్తాయి. జీవితంలో ఊహించని స్థాయికి చేరుకుంటారు. బాల్య జీవితానికి జీవితంలో చేరుకున్న స్థాయికి ఎంతో తేడా ఉంటుంది. అడుగడుగునా దైవం కాపాడుతాడు. వీరికి దైవాను గ్రహం ఎక్కువ. వీరికి ఉండే దైవభక్తి, గుప్తదానాలు ఇందుకు కారణం. సంతానం వలన ఖ్యాతి లభిస్తుంది.

శ్రవణా నక్షత్రము. 4 పాదములు మకరరాశి

నక్షత్ర వివరములు

నక్షత్రములలో ఇది 22వది.

శ్రవణ నక్షత్ర వృక్షము జిల్లేడు.

శ్రవణ నక్షత్ర జాతి స్త్రీ

శ్రవణ నక్షత్ర పక్షి

శ్రవణ నక్షత్ర అధిపతి చంద్రుడు.

శ్రవణ నక్షత్ర అధిదేవత మహావిష్ణువు.

శ్రవణ నక్షత్ర గణము దేవగణము దేవగణాధిపతి ఇంద్రుడు.

## ధనిష్ఠానక్షత్రము

ధనిష్ఠా నక్షత్ర అధిపతి కుజుడు, ఇది రాక్షస గణము, రాశ్యాధిపతి శని, జంతువు సింహము. ఈ రాశిలో జన్మించిన వారు మంచి బుద్ధికుశలత కలిగి ఉంటారు. వీరి తెలివి తేటలను సరిగా ఉపయోగిస్తే శాశ్వత కీర్తి లభిస్తుంది. జీవితంలో ఉన్నత శిఖరాలను సునాయాసంగా అందుకుంటారు. అండగా నిలబడే శక్తివంతమైన వ్యక్తులు జీవితంలో ప్రతి సంఘటనలో ఆదుకుంటారు. అధికారులుగా, రాజకీయ నాయకులుగా, వ్యాపారవేత్తలుగా రాణిస్తారు. వీరి అధికార వైఖరి, మొండి తనం కారణంగా విమర్శలను ఎదుర్కొనవలసిన పరిస్థితి అడుగడుగునా ఎదురౌతుంది. అనవసరమైన విషయాలను గోప్యంగా ఉంచే ఆత్మీయులను దూరం చేసుకుంటారు. ధనం పొదుపు చేయాలని ప్రయత్నిస్తారు. కాని అది ఆచరణ సాధ్యం కాదు. అందరికీ సాయం చేస్తారు. డబ్బు చేతిలో నిలవదు. స్థిరాస్థుల రుపములోనె నిలబడతాయి. మేధావులుగా భావిస్తారు కాని ఆత్మియులకు చెప్పకుండా చేసే పనులు నష్టం కలిగిస్తాయి. దుష్టులకు భాగస్వామ్యం అప్పచెప్తారు. అందు వలన నష్టపోతారు. మధ్యవర్తి సంతకాల వలన, కోర్టు తీర్పుల వలన నష్టపోతారు. పైసాకు చెల్లని వ్యక్తులను నెత్తికి ఎక్కించు కుని అందలం ఎక్కించి కష్టాలు కొని తెచ్చుకుంటారు. చదువు, సంస్కారం ఉపయోగపడి మంచి అధికారిగా రాణిస్తారు. దుర్వ్యసనాలకు దూరంగా ఉంటే పురోగమనం సాధించ వచ్చు. సంతానంను అతి గారాబం చేస్తే చేదు అనుభవాలు ఎదురౌతాయి. పెంపకంలో లోపాలు ఉన్నా సంతానం బాగుపడి కుంటుంబానికి ఖ్యాతి తెస్తారు. గురు, శని, బుధ, మహర్ధశలు, శుక్రదశ యోగిస్తాయి.

నక్షత్రములలో ఇది 23వ నక్షత్రము. ఇది 2 పాదములు మకరరాశి 2 పాదములు కుంభ రాశిలోను ఉండును

ధనిష్ఠానక్షత్రము నవాంశ

1వ పాదము - సింహరాశి.

2వ పాదము - కన్యారాశి.

3వ పాదము - తులారాశి.

4వ పాదము - వృశ్చికరాశి.

ధనిష్ఠ నక్షత్ర వృక్షము

ధనిష్ఠ నక్షత్ర జంతువు

ధనిష్ఠ నక్షత్ర జాతి(పురుష)

ధనిష్ఠ నక్షత్ర పక్షి కాకి.

ధనిష్ఠ నక్షత్ర అధిపతి అంగారకుడు.

ధనిష్ఠ నక్షత్ర అధిదేవత. అష్ట వసువులు

ధనిష్ఠ నక్షత్ర గణము రాక్షస గణము రాక్షసరాజు రావణుడు.

## ఉత్తరాభద్రానక్షత్ర,ము

ఉత్తరాభద్ర నక్షత్ర అధిపతి శని, రాశ్యధిపతి గురువు, మానవగణం, జంతువు ఆవు. ఈ నక్షత్ర జాతకులు వినయవిధేయతలు కలిగి ఉంటారు. పెద్ద చిన్న తారతమ్యం కలిగి ఉంటారు. చదువు మీద మంచి పట్టు సాధిస్తారు. ఉన్నత విద్యాభ్యాసం చేస్తారు. విదేశీ విద్య, అధికార పదవులు, వ్యాపారం కలసి వస్తాయి. వివాహ జీవితం బాగా ఉంటుంది. చక్కటి వ్యూహరచనతో పొదుపుగా సంసారాన్ని సాగిస్తారు. గొప్పలు చెప్పుకోరు. ఇతరులను కించపరచరు. ఇతరులకు అనవసరంగా ఖర్చు చేయరు. ఇతరుల సొమ్మును ఆశించరు. భూమి వాహనముల మీద అధికారం కలిగి ఉంటారు. కుటుంబ చరిత్ర తండ్రి వలన మేలు జరుగుతుంది. ఇతర భాషలు నేర్చుకుంటారు. మంచి హాస్య ప్రియులు. అన్ని విషయాల పట్ల అవగాహన ఉంటుంది. అబద్ధాలు చెప్పి ఇతరులను మోసగించరు. మంచి స్నేహస్ఫూర్తి కలిగి ఉంటారు. ఉన్నత స్థితిలో ఉన్నవారికి ఇష్టులుగా, సలహాదారులుగా ఉంటారు. మంచి స్నేహస్ఫూర్తి కలిగి ఉంటారు. జివితం సాఫీగా జరిగి పోతుంది. ముప్పై నుండి నలభై సంవత్సరాల తరువాత జీవితంలో అభివృద్ధి కలుగుతుంది. ఇది నక్షత్ర జాతకులు అందరికీ సామాన్య ఫలితాలు. జాతక చక్రములో గ్రహస్థితులను అనుసరించి ఫలితాలలో మార్పులు చేర్పులు ఉంటాయి.

నక్షత్ర వివరాలు

నక్షత్రములలో ఇది 26వ నక్షత్రము. ఇది 4 పాదములు మీనారాశిలో నుండును

ఉత్తరాభద్రానక్షత్రము నవ్వాంశ

1వ పాదము - సింహరాశి.

2వ పాదము - కన్యారాశి.

3వ పాదము - తులారాశి.

4వ పాదము - వృశ్చికరాశి.

ఉత్తరాబాధ్ర నక్షత్ర వృక్షము. వేప

ఉత్తరాభద్ర జంతువు ఆవు.

ఉత్తరాభద్రా నక్షత్రజాతి స్త్రీ

ఉత్తరాబాధ్ర నక్షత్ర పక్షి నెమలి.

ఉత్తరాబాధ్ర నక్షత్ర అధిపతి శని.

ఉత్తరాబాధ్ర నక్షత్ర అధిదేవత. అహిర్బుధ్న్యుడు

ఉత్తరాబాధ్ర నక్షత్ర గణము మానవగణము.

## రేవతీ నక్షత్రం

రేవతీ నక్షత్ర అధిపతి బుధుడు, అధిదేవత పూషణుడు, గణము దేవగణం, రాశ్యాధిపతి గురువు. ఈ నక్షత్రంలో పుట్టిన వారు కనిపించని మేధావులు. ఆడంబరం తక్కువ. గణితంలో ప్రజ్ఞ కలిగి ఉంటారు. దౌర్జన్యం తగాదాలకు దూరంగా ఉంటారు. అనేక రకాల విజ్ఞాన గ్రంథాలను పఠిస్తారు. వేదవేదాంగాలను తెలుసుకోవాలన్న తపన కలిగి ఉంటారు. ఇతరుల ధనానికి ఆశపడరు. కష్టపడే మనస్తత్వము ఉంటుంది. ప్రశాంతంగా నిదానంగా సమాధానాలను చెప్తారు. సమస్యలను పక్కన పెట్టిచక్కగా నిద్రిస్తారు. స్నానం పట్ల మక్కువ ఎక్కువ. త్వరిత గతిన ఆర్థిక ప్రగతిని సాధిస్తారు. త్వరితంగా కోపం రాదు. వ్యాపరంలో మోసం చేసే భాగస్వాముల నుండి తప్పించు కుంటారు. ముఖ్యమైన సమయాలలో సహాయం చెసే ఆత్మీయుల అండ దండ ఉండదు. ఒక వేళ ఉన్నా ప్రయోజనం ఉండదు. దూరప్రాంతాలలో చదువుకుని స్థిరపడడా నికి బంధువుల సహకారం ఉంటుంది. కీలకమైన అధికార పదవులలో వినూతన వ్యాపారాలలో రాణిస్తారు. ప్రజలలో మంచి పేరు ఉంటుంది. నమ్ముకున్న వారిని కుటుంబాన్ని పైకి తీసుకురావడానికి ప్రయత్నిస్తారు సహాయం చేస్తారు. వివాహ జీవితంలో ఒడిదుడుకులు ఉన్నా సర్దుకు పోతారు. వీరికి జ్ఞాపక శక్తి, సాహిత్య రంగంలో అధికం. పాడి పంటలకు సంబంధించిన వ్యాపారాలు కలసి వస్తాయి. సంతానాన్ని ప్రేమగా గౌరవంగా చూస్తారు. మంచితనంతో జీవితంలో ముఖ్యమైన విషయాలను అనుకూలం చేసుకుంటారు. విద్యాభ్యాసంలో కలిగే అవరోధాలను అధిగమించి ముందుకు సాగితే రాణిస్తారు. బాల్యం నుండే తెలివితేటలను ప్రదర్శిస్తారు.

నక్షత్రములలో ఇది 27వ నక్షత్రము. ఇది మీనారాశిలోగలదు

రేవతీనక్షత్రము నవాంశ

1వ పాదము - ధనసురాశి. 2వ పాదము - మకరరాశి. 3వ పాదము - కుంభరాశి. 4వ పాదము - మీనరాశి.

రేవతి నక్షత్రమువృక్షము విప్ప

రేవతి నక్షత్రమ జంతువు ఏనుగు

రేవతి నక్షత్ర జాతి (పురుష)

రేవతి నక్షత్ర పక్షి నెమలి.

రేవతి నక్షత్ర అధిపతి బుధుడు.

రేవతి నక్షత్ర అధిదేవత. పూషణుడు

రేవతి నక్షత్రగణము దేవగణము దేవగణాధిపతి ఇంద్రుడు.

**రేవతి నక్షత్రము ప్రాశస్త్యము :** దేవతాప్రతిష్ట, యాత్రలు, ఉద్యోగము, వివాహము, ఉపనయనము, సీమంతము, నూతన వస్త్రధారణ, అక్షరాభ్యాసము, వాహనారోహణ, అన్నప్రాశన, గృహారంభము, గృహప్రవేశము, క్షురకర్మ/కేశఖండన లకు ప్రశస్తము.

## సూర్యుడు...!!

గోత్రం ------ కాశ్యప

తల్లిదండ్రుల--అదితి--కశ్యపులు

పుట్టిన సంవత్సరం - ప్రభవ

మాసం ---- మాఘం

తిధి ---------- శుద్ధ సప్తమి

వారం ---ఆదివారం (భానువారం)

నక్షత్రం ----------- విశాఖ

పుట్టిన దేశం ------- కళింగ దేశం

ఆధిపత్య రాశులు ---- సింహం

గ్రహమండల స్థానం -- మధ్యలో

చూసేదిక్కు---- తూర్పుముఖం

వాహనం ----- సప్తాశ్వ రథం

ధాన్యము ----- గోధుమలు

వర్ణము ------- ఎరుపు

రత్నం ------ కెంపు

సమిధ ---------- జిల్లేడు

అధిష్ఠాన దైవం -------- విష్ణువు

తత్వం ---------- అగ్నితత్వం

ఆధిపత్య శరీరభాగాలు ---- ఎముకలు,తల,రొమ్ము భాగాలు

గుణం ----------- సత్వగుణం

స్వక్షేత్రము ------- సింహం

మిత్రులు ---- చంద్రుడు,కుజుడు,గురుడు

శత్రువులు -------- శుక్రుడు,శని

సములు --------- బుధుడు

ఆధిపత్య నక్షత్రాలు ------- కృత్తిక,ఉత్తర,ఉత్తరాషాఢ

ఉచ్చ స్థానం ----------- మేషం

నీచ స్థానం ------------ తుల

కారకత్వం --------- ఆత్మ

గ్రహ జాతి ------ క్షత్రియుడు

లింగము ---------పురుష

వయస్సు --------- 50సం.

గ్రహం తెలియజేయు రుచి -కారం

ఒక రాశిలో ఉండు కాలం ---- 30 రోజులు

పరిపాలించు ప్రదేశం ---- ప్రపంచం మొతం.

**1. సూర్య గ్రహ గుణగణాలు**

సూర్యుడు జ్యోతిష శాస్త్రంలో ఇలా వర్ణించారు. గుండ్రని ముఖం, రక్తవర్ణం, పొడగరి, గోధుమ వర్ణం కలిగిన జుట్టు కలిగిన వాడుగా వర్ణించబడ్డాడు. గుణత్రయాలలో సూర్యుని స్వభావం రజోగుణం. రుచులలో సూర్యుడు కారం రుచికి కారకత్వం వహిస్తాడు. చాతుర్వర్ణములలో సూర్యుడు క్షత్రియ జాతికి కారకత్వం వహిస్తాడు. తత్వం అగ్ని తత్వం, ప్రకృతి పిత్త ప్రకృతి. దిక్కు తూర్పు దిక్కు, లోహము రాగి, రత్నము మాణిక్యము, దిక్బలం దశమ స్థానం, రాశి సంఖ్య 1, కృత్తిక, ఉత్తర ఫల్గుణి, ఉత్తర ఆషాఢ నక్షత్రాలకు నక్షత్రాధిపత్యం వహిస్తాడు. శరీరావయవాలలో గుండె మరియు పురుషులకు కుడి కన్ను, స్త్రీలకు ఎడమ కన్ను, రాశ్యాధిపత్యం సింహరాశి, మేహరాశిలో 10 డిగ్రీలలో పరమోచ్ఛ స్థితిని, సింహరాశిలో 20 ఇగ్రీలలో రాజ్యాన్ని, తులా రాశి 10 డిగ్రీలలో నీచను పొందుతాడు.

**2. సూర్యుని ప్రభావం**

సూర్యుని ప్రభావం ఉన్న వారు ఆత్మాభిమానం, చురుకు తనం కలిగి ఉంటారు. సంఘంలో పలుకుబడి ఉంటుంది. దుబారా వ్యయం, పొగడ్తలకు లొంగుట, ఆవేశపడుట, సమయస్పూర్తి కలిగి ఉంటారు. చక్కని సంపాదన ఉంటుంది. కంటి జబ్బులు, గుండె జబ్బులు, వడదెబ్బకు గురి అగుట వంటి శారీరక అవస్థలకు గురి ఔతుంటారు. పిత్త ప్రకృతి కలిగి ఉంటారు.

**3. కారకత్వములు**

సూర్యుడు ఆత్మకు, తండ్రికి, శక్తికి, అగ్నికి, ప్రతాపానికి, ఆకాశము, దిక్కు తూర్పు, దేశాధిపత్యములకు కారకత్వము వహిస్తాడు. ముళ్ళ చెట్లకు, పంటలలో మిరియాలు, మిరపకాయలు, కొబ్బరి, వాము, బియ్యం మొదలైన వాటికి కారకత్వం వహిస్తాడు. శివ భక్తులు, శివ పూజ, శివాలయాలకు కారకత్వం వహిస్తాడు, జంతువులలో సింహం, ఎలుగుబంటి, గుర్రము, సర్పములకు కారకత్వం వహిస్తాడు. పక్షులలో కాకి కోకిల, కోడి, హంసలకు కారకత్వం వహిస్తాడు. వృత్తులలో ప్రభుత్వ కార్యాలయాలు, హృదయ సంబంధిత మందులు, వైద్యులు, రిజర్వ్ బ్యాంక్ సంబంధిత వృత్తులకు కారకత్వం వహిస్తాడు. ఆకాశ సంబంధిత విమానాలు, విమానాశ్రయము, ఖగోళము, వాతావరణము, విమాన చోదకులు, విద్యుత్ సంబంధిత బ్యాటరీలు, విద్యుత్తు ఉత్పత్తి, భూకంపాలు, ఆకాశ వాణి, దూరదర్శన్వంటి ప్రసార సంబంధిత మాధ్యమ వృత్తులు, విద్యుత్తు ఉపకరణ సంబంధిత వృత్తులకు కారకత్వం వహిస్తాడు.

**4. రాశులు సూర్యుడు**

సూర్యుడు మేష రాశి 10 డిగ్రీలలో ఉచ్ఛ స్థితిని పొందుతాడు. సిం,హరాశిలో 20 డిగ్రీల వద్ద రాజ్యా స్థితిని పొందుతాడు. సింహం సూర్యునికి స్వక్షేత్రం మరియు మూల త్రికోణ క్షేత్రం. సూర్యుడికి కుంభరాశి, మకర రాశి శత్రు క్షేత్రాలు, కాగా కన్యా రాశి, మిధున రాశి సమ క్షేత్రాలు. మీనం మిత్ర క్షేత్రం. వృశ్చిక, ధనస్సు, మకరాలు విషమ క్షేత్రాలు.

**5. సూర్యుడు గ్రహాలు**

సూర్యుడికి గురువు, చంద్రుడు, కుజుడు మిత్ర గ్రహాలు. శుక్రుడు, శని శత్రు గ్రహాలు. బుధుడు నైసర్గిక బలం కలిగిన గ్రహం. వృధా గ్రహం శుక్రుడే.

**6. సూర్య ఆరాధన**

సూర్యుడు తెలుగు సంవవత్సరం ప్రభవ మాఘ శుద్ధ సప్తమి ఆదివారం నాడు విశాఖ నక్షత్రంలో అతిధి, కశ్యపులకు జన్మించాడు కనుక సూర్యునికి రధసప్తమి నాడు విశేష పూజలు జరుపుతారు. సూర్యుడి పూజార్థం రాగి విహగ్రహం ప్రతిష్ఠిస్తారు. గోధుమలు, బెల్లంతో వండిన పాయసం నైవేద్యంగా పెడతారు. గ్రహ ప్రీత్యర్థం బెల్లం కలిపిన అన్నం సమర్పిస్తారు. సూర్యుడికి పళ్ళు లేవని అందువలన పాయసం అతడికి ప్రీతి కలిగిస్తుందని పురాణాలు చెప్తున్నాయి.

సూర్యుడు సప్త వర్ణాలకు ప్రతీకగా సప్త అశ్వములు పూన్చిన రథం మీద ఆరూఢుడై ఉంటాడు. వినతా పుత్రుడైన అనూరుడు సూర్యుడికి సారధి. అనూరుడు గరుత్మంతుని అన్న. శ్రీరామ నవమి సూర్య గ్రహ ప్రీత్యర్ధం చేయబడే మరి ఒక పండుగ. సూర్యుడికి ప్రీతికరమైన తిధి జ్యేష్ట శుక్ల ద్వాదశి, కార్తిక శుక్ల సప్తమి. సూర్యుడి ప్రీత్యర్ధం ఆదివార వ్రతం చేస్తారు. సూర్యుడిని వివిధరకాలుగా స్త్రోత్రం చేస్తారు. వాటిలో కొన్ని ఆదిత్య హృదయం, సూర్యాష్టకం, సూర్య అష్టోత్తర శతనామావళి మొదలైనవి. సూర్యుని ప్రీత్యర్ధం విష్ణుసహస్రనామ పారాయణ, హరి వంశ పురాణం పారాయణ చేస్తారు. గాయత్రీ మంత్రోపాసన, దీక్ష. జపం సూర్యునికి ప్రీతి కలిగిస్తుంది. సూర్యునికి ప్రతి రోజు త్రిసంధ్యలలో సంధ్యా వందనం చేయడం హిందూ సంప్రదాయాలలో ఒకటి.

## చంద్రుడు

చంద్రుడు జ్యోతిష శాస్త్రంలో మనస్సుకు కారకుడు. చంద్రుడు స్త్రీ గ్రహం, వైశ్య జాతి, శ్వేత వర్ణం, పరిమాణం పొట్టి, వయస్సు డెబ్బై సంవత్సరాలను సూచించును. దిక్కు వాయవ్యం, తత్వం జల తత్వం, ప్రకృతి వాత, శ్లేష్మములు. ఋతువులలో వర్ష ఋతువును, లోహములలో వెండిని, రత్నములలో ముత్యమును సూచించును. చంద్రుడు చతుర్ధ భావంలో దిక్బలం కలిగి ఉంటాడు. గ్రహములలో చంద్రుడు ఏడవ వాడు. సత్వగుణ సంపన్నుడైన చంద్రుడు కృష్ణ పక్ష దశమి నుండి శుక్ల పక్ష పంచమి వరకు పూర్ణ చంద్రుడు. శుక్ల పంచమి నుండి అమావాస్య వరకు క్షీణ చంద్రుడు, అమావాస్య నుండి కృష్ణ పక్ష దశమి వరకు మధ్యమ చంద్రుడు అని శాస్త్రం చెప్తుంది. చంద్రుడు రోహిణి, హస్త, శ్రవణం నక్షత్రాలకు అధిపతి. శరీరావయవములలో మగవారి ఏడమ కన్ను, స్త్రీల కుడి కన్ను శరీర మధ్య భాగమును సూచించును. చంద్రుడు కర్కాటక రాశికి ఆధిపత్యం వహిస్తాడు. చంద్రుడు వృషభంలో మూడు డిగ్రీలలో పరమోచ్చ స్థితిలో ఉంటాడు. వృషభంలో మూడు నుండి ఇరవై ఏడు డిగ్రీల వరకు మూల త్రికోణంలో ఉంటాడు. వృశ్చికంలో మూడు డిగ్రీల వరకు పరమ నీచ స్థితిలో ఉంటాడు. బుధుడు, సూర్యుడు మిత్రులు. చంద్రుడికి శత్రువులు లేరు.

### 1. చంద్రుని ప్రభావం

చంద్ర ప్రభావిత వ్యక్తులు శ్లేష్మమ వ్యాధి పీడితులుగా ఉంటారు. వీరు కొంత సమయం ఉత్సాహంతోనూ మరి కొంత సమయం నిరుత్సాహంగానూ ఉంటారు. కొంత కాలం ధైర్యము మరి కొంత కాలం భయం కలిగి ఉంటారు. కొంత కాలం ధనవంతులుగా మరి కొంతకాలం ధనహీనులుగా ఉంటారు. స్థూలంగా మానసిక స్థితి, సందలు అస్థిరంగా ఉంటాయి. అభిప్రాయాలూ తరచూమార్చుకుంటారు. మిత్రులనూ తరచూ మార్చుకుంటారు. భోజన ప్రియులుగా ఉంటారు. ఆ కారణంగా యుక్త వయసు దాటే సమయానికి పొట్ట పెద్దది అయ్యే అవకాశం ఎక్కువ. స్వతంత్రించి ఏకార్యం చెయ్య లేరు. నీటి పారుదల, జల విద్యుత్, ప్రజా ప్రాతినిధ్యం, బియ్యము, వస్త్రములకు సంబంధించిన వృత్తులలో రాణిస్తారు. పాండు రోగం, క్షయ, మధుమేహం, శ్వాశకోశ వ్యాధులు వచ్చే అవకాశం ఎక్కువ.

### 2. చంద్రుని కారకత్వాలు

చంద్రుడు తల్లికి, జలరాంతాలు, జలం, పూలు, సముద్రం, నదులు, ముఖము, ఉదరం, మహిళా సంఘాలకు, స్త్రీ సంక్షేమ సంఘాలకు చందుడు కాకత్వం వహిస్తాడు. వృత్తి సంబంధంగా నౌకా వ్యాపారం, ఓడ రేవులు, వంతెనలు, ఆనకట్టలు, చేపల పెంపకం, వెండి, మత్యములకు కారకత్వం వహిస్తాడు. వ్యాధులలో రక్త హీనత, అతి మూత్రం, గర్భ సంబంధిత వ్యాధులు, వరబీజము, బేదులు, మానసిక వ్యాధులు, ఉదర సంబంధిత వ్యాధులు, కేన్సర్(రాచ పుండు) మొదలైన వాటికి కారకుడు, ఆహార సంబంధంగా చెరకు, తేనె, పాలు, పెరుగు, భోజనము, గోధుమలు, జొన్నలు, రొట్టెలు, గోధుమలు, చేపలు,

